# అక్షర విశ్వనాథ

('విశ్వనాథ మధ్యాక్కఱల' అనుశీలన)

1987వ సం॥ కాకినాడ శ్రీ విశ్వనాథ సాహిత్యపీఠంవారు
నిర్వహించిన పోటీలో - ప్రభవ ఉగాది - ఉత్తమ పరిశోధక
రచన బహుమతి పొందిన గ్రంథం.

నడుపల్లి శ్రీరామరాజు

తిరుమల తిరుపతి దేవస్థానం వారి మత సంబంధమైన పుస్తకాల ప్రచురణకు సాహాయ్యం చేసే పథకం క్రింద పొందిన ఆర్థిక సహకారంతో ఈ గ్రంథం ప్రచురితమైంది

వాగ్దేవీ ప్రచురణలు
హైదరాబాదు.

# AKSHARA VISWANATHA

A Critical Study of *Viswanatha Madhyakkaralu*

by Dr. Nadupalli Srirama Raju,
Dept. of Telugu, University of Hyderabad,
Hyderabad - 500 046.

(This book won the Sri Viswanatha Sahitya Peetham Award for 1987 for the best research work on Viswanatha Madhyakkaralu)

డా॥ నడుపల్లి శ్రీరామరాజు, తెలుగు శాఖ
హైదరాబాదు విశ్వవిద్యాలయం (సెంట్రల్ యూనివర్సిటీ)
హైదరాబాదు - 500 046

ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : 1997

రూ. 60/-

వాగ్దేవీ ప్రచురణలు
సాయిప్రియా అపార్ట్‌మెంట్స్
12-2-790/77, అయోధ్యానగర్
మెహదీపట్నం, హైదరాబాదు - 28

ప్రతులకు :

1. విశాలాంధ్ర బుక్ హౌస్ వారి
   అన్ని శాఖలు
2. నవోదయ బుక్ హౌస్,
   కాచిగూడా, హైదరాబాదు.

టైప్ సెట్, ముద్రణ : మాన్‌పబ్లికేషన్స్, ఖైరతాబాదు, హైదరాబాదు - 4. ✆ : 3315547

# అంకితం



పెదతల్లి, పెదతండ్రి

**శ్రీమతి లక్ష్మీనరసమ్మ గారు**

**శ్రీ ఓలేటి సత్యనారాయణమూర్తి గారు**

నరసమాదేవి నారాయణాఖ్య గురులు
బాల్యమాదిగ నరసి యమూల్య శిక్ష
నొసగి దివికేగ వారికై నొనర నిత్తు
విశ్వనాథ ధిషణ కిద్ది వెలుగు దివిటి

# కృతజ్ఞతలు

'అక్షర విశ్వనాథ' నిజానికి పేరాల భరత శర్మగారి చలువ. కాకినాడ శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠ వ్యవస్థాపక సంచాలకులుగా తమ ఆధ్వర్యవంలో 1987 లో 'విశ్వనాథ మధ్యాక్కఱల' పై జరిగిన పోటికి వచ్చిన వ్యాసాలలో నా ఈ గ్రంథానికి ఉత్తమ పురస్కారం అందించిన సుకృతి – శ్రీ పేరాలవారు. వారికి ఆజీవము కృతజ్ఞుణ్ణి.

నాపట్ల ప్రత్యేక ఆదరణతో ఈ గ్రంథానికి విలువైన పీఠికలు రచించి గ్రంథ గౌరవాన్ని ఇనుమడింప జేసినవారు జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ, ఆచార్య సి.నారాయణరెడ్డి గారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు, ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు గారు.

వీరికి నా కృతజ్ఞతాభివందనాలు.

నాటి గ్రంథ రచన నుంచి నేటి గ్రంథ ప్రచురణ వరకు, ఆకృతులు వేరైనా ఆత్మలు ఒక్కటిగా తమతో వ్యవహరించే భాగ్యం నాకు కలిగించినవారు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు అన్నగారు. నా చర్యలకు మెరుగులు దిద్దిన వారి మనస్వితకు ఏమని కృతజ్ఞతలు చెప్పగలను.

గ్రంథ రచనా సందర్భంలో తమవద్దనున్న ఉపనిషద్గ్రంథాలను నాకు అందజేసి సహకరించిన శ్రీ సోమయాజుల సూర్యనారాయణ గారికి కృతజ్ఞతలు. శుద్ధప్రతిని రాయడంలో సహకరించిన విద్యార్థి మిత్రులు శ్రీ ఎమ్. నాగరాజు, శ్రీమతి చంద్రిక, శ్రీమతి గురజాడ పద్మావతి తదితరులకు శుభాశీస్సులు.

ఈ 'అక్షర విశ్వనాథ' ముద్రణలో అక్షరత్వం పొందడానికి ఆర్థికంగా ఆదుకొన్నవారు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు. వారికి నా కృతజ్ఞతలు.

నేను చేపట్టిన అన్ని కార్యక్రమాలకు చేదోడు వాదోడుగా ఉంటున్న నా అర్ధాంగి శ్రీమతి అరుణకు, మా అమ్మాయిలు చిరంజీవినులు అపర్ణ, శ్రీసత్య లకు నా ఆశీస్సులు.

ఈ గ్రంథాన్ని శ్రద్ధగా ముద్రించిన మాన్ పబ్లికేషన్స్ అధినేత శ్రీ నజీర్ అహ్మద్ (ఎస్పే నజీర్) గారికి కంప్యూటర్ టైపు సెట్టింగ్ చేసిన శ్రీ రమేష్ నేత, జి, శ్రీ పి. పవన్ కుమార్ గారలకు కృతజ్ఞతలు.

**వడుపల్లి శ్రీరామరాజు**

**30–05–97** (ఎన్.ఎస్. రాజు)

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
**డా॥ సి. నారాయణ రెడ్డి**

హైదరాబాదు
22.3.1997

# అభినందన

రసార్ద్రమతి, ధిషణాహంకృతి విలక్షణంగా మేళవించిన బ్రాహ్మీమయమూర్తులు విశ్వనాథ సత్యనారాయణ గారు. విశ్వనాథవారి కవితా వ్యక్తిత్వాన్ని సంగ్రహంగా సమీక్షించి వారి మధ్యాక్కరల పైన విమర్శనాత్మక గ్రంథం రచించారు నడుపల్లి శ్రీరామరాజు గారు. గ్రంథం పేరు "అక్షర విశ్వనాథ". ఇక్కడ 'అక్షర' శబ్దానికి క్షరం కానిది అనే అర్థమే కాకుండా ఆ శబ్ద వికృతి 'అక్కర' ను గుర్తులో పెట్టుకోవాలి. అప్పుడు అక్కరలు రాసిన విశ్వనాథ ప్రధానంగా స్ఫురిస్తాడు.

నన్నయ తరువాత తెలుగు కవులు అక్కర ఛందస్సును అంతగా స్వీకరించలేదు. ఈ ఛందస్సులో విశ్వనాథవారు 10 శతకాలు రాసేయడం విశేషం.

ఉత్పల, చంపక, మత్తేభ, శార్దూలాలలాగా అక్కరలు లయాత్మకంగా కదను తొక్కినట్టు ఉండవు. మధ్యాక్కర గతి మందంగా ఉంటూ వచనంలా సాగుతుందని ఆచార్య దివాకర్లవారు అన్నది ఆ దృష్టితోనే. మధ్యాక్కర జాతి పద్యం. ఇప్పుడు అందరం చదివే పద్ధతిలో దీన్ని పద్యంలా చదివితే ఇదమిత్థమైన లయ ఉన్నట్టు కనిపించదు. కానీ ప్రతి పాదంలో రెండు రెండు - నాలుగు మాత్రలు కలిపితే మధ్యాక్కర అయిదయిదు మాత్రలతో నడిచే ఖండగతిలో కదను తొక్కుతుంది. ఉదాహరణకు విశ్వనాథ వారి 'శ్రీశైల మల్లికార్జున శతకం' నుంచి రెండు పాదాలు :

"శ్రీ నీరధి నిషంగ భక్త (తక) జనతతి శ్రేయోనుషంగ (తక)
మానాథ శరసంగ ప్రౌఢ (తక) వృషభ రాణ్మాద్యత్తురంగ (తక)"

మధ్యలో నేను చేర్చిన ఆ రెండు మాత్రలను కలుపుకుని చదివితే చాలా మధ్యాక్కరలు ఖండగతిలో ఒదిగిపోతాయి.

శ్రీరామరాజు గారు మధ్యాక్కర లక్షణాలను గురించి చర్చించి విశ్వనాథ వారు ఆ ఛందస్సులో రచించిన పదిశతకాల వస్త్వాత్మలను నిశితంగా పరిశీలించి చూపారు. పాండిత్యంతోపాటు సముచిత విమర్శనా పాటవం పండించుకున్న శ్రీరామరాజు గారి ఈ కృషికి నా అభినందన.

**సి. నారాయణ రెడ్డి.**

డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం
విశ్రాంత ఆచార్యులు, తెలుగు శాఖ
పూర్వాధ్యక్షులు, హ్యూమానిటీస్ విభాగం
హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు

శ్రీవాణి, 1-8-702/105
నల్లకుంట, హైదరాబాదు - 44
తేదీ. : 20–4–1997

# మనసు పాట మధ్యాక్కఱ

వచన కవిత్వం సాహితీ రంగంలో ప్రవేశించిన తరువాత, ఖండ కావ్యమే ఆధునిక కావ్యరూపమనే భావం ప్రబలిన తరువాత, వచన కవిత్వంలో కూడా మినీ రూపాలకు ప్రాచుర్యం తెచ్చే ప్రయోగాలు సాగటం మొదలైన తరువాత పద్యకవులు ఒక్కొక్క ఛందస్సుకు విశేష ప్రచారం కలిగించే ఉద్యమం చేపట్టారు. కొందరు ఆటవెలదిని, కొందరు తేటగీతిని, మరి కొందరు కందాన్ని, ఇంకొందరు సీసాన్ని చేపట్టి పాత ఛందస్సులకే క్రొత్త వాడుక నేర్పి చూపించారు. ఇటువంటి ప్రయోగాల వరుసలో విశ్వనాథవారి 'మధ్యాక్కఱ' కూడ ఒక ప్రత్యేక ప్రతిపత్తిని గడించుకున్నది. అంతే కాదు, పై ప్రయోగాలన్నింటికి కంటె విశిష్ట ప్రచారాన్ని పొందింది. ఆధునిక జీవితంలోని అన్ని భావావస్థలను అవలీలగా ఆ వృత్తంలో ఆవిష్కరించ వచ్చునన్న ఒక అభినవ చైతన్యం విశ్వనాథవారు చేసి చూపించారు. వారి చేతుల్లో మధ్యాక్కఱ మరొక జన్మ నెత్తింది; శతక ప్రక్రియలో సహస్రాధిక సంఖ్యలో మధ్యాక్కఱలను రచించి ఆ వృత్తానికి మరొక శతాబ్దం మహనీయంగా జీవితం సాగించే చైతన్యాన్ని ప్రసాదించారు. విశ్వనాథవారు మధ్యాక్కఱల వృత్త పునస్స్థాపనాచార్యులు.

విశ్వనాథవారి మధ్యాక్కఱలపై మహనీయు లెందరో వ్యాసాలు వ్రాశారు. మా విద్యార్థి దశలో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు మధ్యాక్కఱ శతకాల మీద వ్రాసిన వ్యాసం ఆసక్తికరంగా చదివాం. ఆ తరువాత మధ్యాక్కఱలలో రచించిన శతకాలను, వాటిపై వచ్చిన వ్యాసాలను పరిశీలించాం. స్వయంగా నేనూ కొన్ని మధ్యాక్కఱ శతకాలకు ముందుమాటలు వ్రాశాను. విశ్వనాథవారి దయవలన మధ్యాక్కఱ తెలుగువారి మనసు పాటగా వినిపిస్తున్నది.

డా॥ నడుపల్లి శ్రీరామరాజు గారు విశ్వనాథ మధ్యాక్కఱలపై 'అక్షర విశ్వనాథ' గ్రంథాన్ని రచించి కాకినాడ విశ్వనాథ సాహిత్యపీఠంవారి అవార్డును పొందారు. మధ్యాక్కఱలలో శతకాలు వ్రాసినందుకు విశ్వనాథవారికి రాష్ట్ర సాహిత్య అకాడమి అవార్డు వచ్చింది. వారి మధ్యాక్కఱల మీద గ్రంథం వ్రాసిన రాజు గారికి మరొక అవార్డు వచ్చింది.

మాకందరికీ ఒక ఆశ్చర్యం! డా॥ రాజుగారు అవార్డులకోసమే గ్రంథాలు వ్రాస్తారో, లేదా, వ్రాసిన గ్రంథానికి ఎవార్డు వస్తూంటూందో - ఏదో ఒకటి కీలకమై ఉంది వారి సాహిత్య రచనలో. ఏమైనా అది ఒక మంచి కళేగా!

నాకు అంతగా తెలియని శాస్త్రము ఛందస్సు. రాజు గారు ఆ నేలను దున్నువారు. పంటను చూచి సంతోషించు వారిలో నేనొకణ్ణి. ఆ పంటకు సంబంధించిన మర్మములు తెలియని వాణ్ణి. డా॥ రాజు గారు హైదరాబాదు విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖలో పనిచేస్తున్నారు. నేనూ అందులో పనిచేసి విశ్రాంతి తీసుకుంటున్న వాణ్ణి. వారు నాయందు గౌరవంతో అభిప్రాయాన్ని అడిగారు కాని నాకు అంతటి అర్హత ఉన్నదని నేను భావించటం లేదు. అభిప్రాయ మడిగిన వారి మంచితనానికి నా సంతోషం.

జి.వి. సుబ్రహ్మణ్యం

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య
విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షులు
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు

3–440, పరిమళ కాలని
వడ్డేపల్లి, వరంగల్లు – 506370
తేది : 6-5-1997

# అభినందన

"అక్షర విశ్వనాథ" రచించిన మా ప్రియ మిత్రులు, కేంద్రీయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ అధ్యాపకులు శ్రీ నడుపల్లి శ్రీరామరాజు నిరంతరాధ్యయన శీలురు. ఆయన ఛంద శ్శాస్త్రం అభిమానాంశంగా పరిశోధన చేసి విశిష్టమైన గ్రంథాలు వెలువరించారు. సాహిత్య తాత్త్విక చింతనలకు సంగమ స్థానమైన 'విశ్వనాథ మధ్యాక్కఱల'ను గూర్చిన ఈ పరిశోధక గ్రంథాన్ని రచించి సాహిత్య విమర్శలోనూ తమ అభినివేశాన్ని ప్రకటిస్తున్నారు.

విశ్వనాథ సత్యనారాయణ సృష్టించిన సారస్వత సముద్రంలో 'విశ్వనాథ మధ్యాక్కఱలు' ఐరావతం వంటి రచన. తన దైన అనుభూతి తనదిగా సాగిన తాత్త్విక జిజ్ఞాసకు ఈ గ్రంథం స్వతంత్ర మైన మార్గాన్ని వేసింది. ఆత్మీయ మైన సంవేదనలో, ఈశ్వరాభిముఖ మైన అనంత మైన అభీప్సతో విలక్షణ మైన రచనా విన్యాసంతో, అపూర్వ కృత వృత్త వైశిష్ట్యంతో ఈ గ్రంథం తెలుగు సాహిత్యంలోనే అరుదైన రచన. నన్నయ నాటి మధ్యాక్కరను ఎఱ్ఱన స్పృశించినా తరువాత మరుగున పడిపోగా దానికి జీవం పోసి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో విరివిగా ప్రయోగించి, దానిమీద తీరని మక్కువతో పది శతకాలుగా వెలువరించిన ఈ సృష్టి వృత్తగత మైన సంగీతాన్ని విరిచి - ఈశ్వరునితో ప్రత్యక్ష సంభాషణగా దాదాపు వచనంలాగా సాగిపోయిన నూతనావిష్కారం.

'—కల్పవృక్ష' రచనతో పండిపోతున్న విశ్వనాథకు 1957 జనవరిలో రామచంద్రుడన్న కుమారుడు చనిపోవటంతో పిడుగు పడ్డట్లయింది. దుఃఖంనుంచి తేరుకోవటం కష్టమయింది. అంతర్ముఖుడై ఈశ్వరుణ్ణి నిత్యభావనాధీనునిగా చేసికొనిన సన్నివేశంలో ఈ మధ్యాక్కరల రచన కొనసాగింది.

*కొడుకు కాంతారమ్ము చనిన నసువుల గ్రుంకె నీ తండ్రి*
*కొడుకు తానసువుల గ్రుంక నేనింతక్రుంక, నీ పేరు*
*కొడుకుకు బెట్టితి వాని బ్రతికించుకొనను, నిన్ గాద*
*నెడు తీవ్రతయులేదు భద్రగిరిపుణ్యానిలయ ! శ్రీరామ!* (*భద్రగిరి – 43*)

తరువాతి పద్యంలో 'పసివాడు వానిపై ప్రాణములు పెట్టి బ్రతికితి' నంటారు. అందువల్ల ఈ దుఃఖముకూడా ఈశ్వర ప్రాప్తికి సాధనమైంది. 'ఏడుపులో నట్టనడుగు నందున నెక్కడో నీదు జాడ కన్పించు' (భద్రగిరి – 45). ఈ అన్వేషణ సాగి సాగి హరి హరాత్మక మైన పది శతకాలుగా సాగింది. ఈ రచన అంతా 1957-60ల మధ్య సాగింది. కాలక్రమాన్ననుసరించి ఈ మధ్యాక్కరలు మున్నంగి, కులస్వామి, శేషగిరి, శ్రీగిరి, కాళహస్తి,

భద్రగిరి, దాక్షారామ, నెకరుకల్లు, నందమూరు, వేములవాడ శతకాలుగా రచింపబడ్డాయి. అయితే గ్రంథరూపంలో 'విశ్వనాథ మధ్యాక్కఱలు' 1961లో ప్రచురింపబడ్డది.

ఈ గ్రంథంలో విశ్వనాథ ప్రధానంగా తన మనన నిధిధ్యాసలను ప్రకటించటం జరిగింది. ఈ గ్రంథం ఆయన చైతన్య ప్రవాహంలో అవి యెంతగా నిరంతరాయంగా వెలువడినవో తెలియజేస్తుంది. జీవితంలో ప్రతి క్షణమూ, ప్రతి సన్నివేశమూ తద్భావనా భావితం చేయటంవలన తనకు అది 'కవితారూప తపస్సు'. ఈ తపోమహితస్ఫూర్తిని అనేక రూపాలలో ఒకే చోట అందిస్తుందీ మధ్యాక్కరల శతక సముచ్చయం.

*తన నొసంట నిషణ్ణుడై పినాక లస్తకమును వంచి*
*కొని సహస్రారమ్ము లక్ష్యముం జేసి, కొట్టుచున్నావొ*
*నిను గూరుచున్న వానిని వృషాకపీ! నే నెరుంగుదును*
*సృణికల్పనారాచ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి.* *(నెకరుకల్లు –88)*

ఉపనిషత్తులలో హృదయ గ్రంథి భేదనం చెప్పబడగా, యిక్కడ సహస్రారం లక్ష్యమయింది. ఈ శతకాలలో అనేక సన్నివేశాలలో భ్రూమధ్య సూక్ష్మ తేజః స్వరూప దర్శనం ప్రసక్త మయింది. అవ్యవహిత భ్రూయోగ లక్షణం అనార్కలి (1928) నాటికే విశ్వనాథలో కనిపించే అంశం.

*కన్నది యనుభూతి సగము పచ్చి, సగము దోరగాగ*
*నున్నది, భోగవేళ సయితమ్ము నా యుల్లంబునందు*
*నున్నది నీవును, నురక కదలుచున్నది మేను...* *(నెకరుకల్లు – 40)*

ఇక్కడ ధ్యాన లక్షణము, ఏకాంతానుభవమూ వెల్లడి అవుతున్నాయి. మరొక అనుభవం విచిత్రంగా ఉన్నది.

*నా నెత్తిపై కెక్కి పిండి గొట్టుచున్నావు, నా గుండె*
*లోనుండి గగ్గోలు చేయుచున్నావు, లుంగయై పోతి....* *(దాక్షారామ -30)*

ఇది కపాలభేదరూప మైన ఉపాసనను స్మరింపజేస్తున్నది. కావ్యకంఠ గణపతి ఈ మార్గంలో సాఫల్యం పొందిన అంశం తెలియవస్తున్నది. ఇలా ఉదాహరిస్తూపోతే ఈ అనుభూతి వైవిధ్యం గ్రంథమంతా పరచుకొని ఉండటం స్పష్టపడుతుంది. దుఃఖము ఐహిక జీవితంలోనుంచి పెల్లుబికొని వచ్చింది. అంతఃకరణాన్ని ఒరిపిడి పెట్టింది. ఒక కవితా ప్రవాహానికి హేతు వయింది. సూర్య కిరణ కాంతులను ప్రతిఫలింపజేసే ఇసుకమీది సెలయేటి జాలువలె పరమ సాధుగతియై ఈ వాహిని సాగిపోయింది.

ఈ కవితా యాత్రలో కవి తన సాధనను సగుణ నిర్గుణాల మధ్య సంధి మార్గంగా ఎంచుకొన్నారు. హరిహరాభేద భావం పూర్వకవుల నతిక్రమించి ఒక మూర్తి మీద మరొక మూర్తిని ఆరోపిస్తూ రూపాతీతమైన దశను చేరుకోవటానికి – రెంటినీ చివరకు చెదరగొడుతూ మూర్త్యుపాసన నుంచి అమూర్త్యుపాసనవైపు సాగిపోవటం మనకు కానవస్తుంది.

ఇంతటి గ్రంథాన్ని తన విమర్శ పరిధిలోకి ఎంచుకొని శ్రీరామరాజు సఫలమైన సాహసాన్నే చేశారు. వారి నిశిత పరిశీలన, బహుగ్రంథ పరిచయమూ దీనిలో అడుగడున కానవస్తాయి. తత్త్వవిచారణ సందర్భంలో శ్రీశంకరుల ప్రకరణ గ్రంథాలలోంచి ఎన్నో విశేషాలను ఉల్లేఖించి వివరణలు ఇచ్చారు. అద్వైత శాస్త్ర రహస్యాలను ఈ మార్గంలో వ్యాఖ్యానించారు.

అయితే విశ్వనాథ కవియే కాక సామాజిక ఆధ్యాత్మిక తత్త్వవేత్త కావటంవలన శంకరానంతర తాత్త్విక పరంపరలో ఈనాటి శ్రీ అరవిందులు, రమణ మహర్షి వరకు సాగివచ్చిన సుసూక్ష్మ చర్చల సారంకూడా జీర్ణించుకున్నారు. ఆ పద్ధతిలో కూడా దీనిని పరిశీలించవలసి ఉన్నది.

> కొన్ని జన్మములు దాటితిని, మనోమయ కోశంబునందు
> నున్న జన్మ మిది, యింకెన్ని జన్మలకో మరి రెండు
> మున్నున్న కోశముల్ దాటి నీవైన మూర్తితో నొక్క
> డన్నది యగుట శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ ! (కాళహస్తి – 68)

ఉపనిషత్తులలోని పంచకోశ వివేకం ఈ పద్యంలో కానవస్తూవున్నా శ్రీ అరవిందుల దివ్య జీవన పరిణామ వివేచనం స్పష్టంగా గోచరిస్తుంది. ఈ జగత్తు పరిణామ క్రమంలో ఈశ్వర చైతన్యం అధోముఖంగా ఆనంద విజ్ఞాన మనః ప్రాణాన్న దశలలోకి దిగిరావటం, అల్లాగే మళ్లీ అన్నమయ కోశం నుంచి ప్రాణ మనో విజ్ఞా నానందమయ భూమికలను అధిరోహించటం ఈ రెండూ ఆరోహ ణావరోహణములుగా సాగే అంశం ఆయన సూచించారు. ఇప్పుడు సృష్టిపరిణామంలో మనోమయ దశలో ఉన్నదనీ, అది అతిమనోమయ దశలోకి ఉద్గమించవలసిన అవసరం ఉన్నదనీ ఆయన ప్రతిపాదించారు. ఈ అతిమనస్సు భౌమ జగత్తును స్పృశించిందనీ దీన్ని దుఃఖ రహితంగా అది దివ్యీకరించగలదనీ ఆయన వివేచించారు. 'మనోమయ కోశంబునం దున్న జన్మము' అన్నమాట ఈ ఎరుకలో వచ్చిందేనని భావించాలి. ' నేను' సమష్టి అస్మిత అనుకుంటే సమన్వయం సులభంగా సిద్ధిస్తుంది.

అయితే అవరోహణం అంత సులభమైంది కాదీ అధిరోహణం. ఇప్పుడు కావలసింది జీవుని ప్రగాఢమైన సంకల్పం, అంతఃకరణంలోని దైవ విరోధి లక్షణ నిరాకరణం, నిరంతర సాధనం, సర్వ సమర్పణం. ఈ నాలుగు అంశాలూ కూడిన ఒక చతుర్ముఖ స్థితి సత్యలోక మార్గాన్ని చేరుస్తుంది.

'తావెలికి వచ్చుటయును నెంత తేలికో యట్లె లోనికిఁ బోవుటంత కాదోయి నా స్వామి! హ్రీయేచ! ద్వారబంధా ల్బిగించి రానీరు దేవతలు' (భద్రగిరి – 55). అధిరోహణం ఎంత కష్టమైందో రచయిత చెప్పుతున్నాడు. ఈ బిగించిన ద్వారబంధం ఈశావాస్యం పేర్కొన్న సత్యపాత్ర. దీన్ని విహితం చేసిన హిరణ్మయ మూర్తులు దేవతలు. భౌమ చైతన్యం దివ్యచైతన్యంతోడి అనుసంధానం చెందనంతవరకూ ఇక్కడ తమస్సుదే రాజ్యం. అందుకే మహేతిహాస మైన సావిత్రి ఆరంభంలో ఆ అనంత గాఢ రాత్రిని 'అది దేవతలు యింకా

మేల్కొనని ముహూర్తం' అని వర్ణిస్తారు శ్రీ అరవిందులు. ఈ దేవతలు ప్రసన్నులు కావటం – మేల్కొనటం – సత్యం ఆవిష్కృతం కావటమే.

ఈ గ్రంథంలో చాలా భాగం సాధననూ, అనుభవ పరంపరనూ విచారించటం వల్ల ఎక్కడా అద్వైత గ్రంథాలలోని జటిల శాస్త్రాంశాల చిలుక పలుకులు లేవు. చాలా అంశాలు శాస్త్ర పరిధికి మించినవి. 'ఒకటి నిశ్చయమయ్యె బయట నెచ్చటి నుండియో నీవు ప్రకట శైవానేక కథలలోని రూపాలతో రావు. ప్రకట మత్పాలంబు పట్టుమంచును పగిలి రావలయు.' దీనిలో వ్యక్తమయ్యే భక్తి స్వస్వరూపానుసంధానంగా పరిణమించవలసిందేనని కవి స్పష్టం చేస్తున్నారు. విశ్వనాథ నిత్య యోగాభ్యాసమూ, నిత్య జపిత లక్షణమూ ఈ స్పష్ట విశ్వాసానికి కారణాలు.

అనేక సందర్భాలలో విశ్వనాథ స్వప్నములో భ్రూ మధ్యంలో మరి ప్రత్యక్షంగానూ తనకు కలిగిన ఈశ్వర సిద్ధిని చెప్పుకొని అది స్థిరం కానందుకు వేగిర పడుతూ వుంటారు. మధ్యాక్కరలలో యోగసాధనలోని అనేక భిన్న భిన్నాంశాలు దీనిలో ప్రసక్తాలయినవి. హృదయోపాసన, హంసోపాసన, కుండలినీ సాధన – ఇవన్నీ చెప్పబడ్డాయి. సూక్ష్మంగా ఈ గ్రంథాన్ని విచారిస్తే రచయిత సాగించిన సాధన పద్ధతిని కనుక్కోవటం అసాధ్యమైన అంశమేమీ కాదు.

మధ్యాక్కఱలకును నీకు నాకు సంబంధంబు బలిసి
మధ్యాక్కఱలు నేను వేఱ పనిమీద మానివేసినను
నీధ్యాన మేమయ్యె నేమి యయ్యెదను నేను కృపణమ
హీధ్యేయ .... (వేములవాడ – 33)

కవి చైతన్య ధారాస్రోతసుకు మధ్యాక్కర మార్గమైంది. విచారణ ప్రవాహమైంది. దీనికి కారణాలు: ఈ ఛందస్సులో దేశి మార్గ లక్షణాలు కలసి వుండటం. పద్య గద్య లక్షణాలు కలసి ఉండటం, వ్యక్తావ్యక్త స్థితిలోని అనుభవం యధాతథంగా వెలువడటానికి హేతువుగా అకృత్రిమ ధ్యేయస్థితి చెదరకపోవటం.

ఈ తపోమార్గంలో విశ్వనాథ ధిషణాహంకార మనే కంచుకాన్ని తొలగించుకున్నారు. క్రమంగా ఒక్కొక్క పొరనూ త్రెంచుకుంటూ సహజ స్థితిలో స్వామి ముందర నిలబడ్డారు.

*నేనెంత! నాబ్రతుకెంత! సృష్టిలో నిజము నావంటి*
*మానవుల్ మూఁడు కాలములఁ బుట్టుచు మడియుచున్నారు*
*కానగా సర్వ దేశముల యందు, జగం బొక పెద్ద*
*సూనాపణంబు....* *(శ్రీగిరి – 7)*

ఈ దశ తొలి నాళ్లలో కవి తన్నుతాను గుర్తించుకునే సందర్భంలో వ్రాసికొన్న ఖండకావ్యం గుర్తుకు తెస్తుంది.

*'ఈ కెలన శరత్పూర్ణిమావృత శశాంక, లలిత రోచిర్వితాన మాకెలన ఘోర*
*ఘనతరాంధకారచ్ఛటా సమాక్రాంత భూమి, అందు సగ మిందు సగ ముంటి నౌర నేను.*
*. . . . . . . . . . . . . . . . . . . . . . . . . , ఈ సగము నాది నాకె కన్పింపబోదు'.*

మాయా పరిచ్ఛిన్న భాగం జీవచైతన్యం అవిద్యావృతమై బ్రహ్మ శుద్ధ చైతన్యంలో విస్మృతమౌతూ వున్నవి. ఈ దశ నుంచి తనకు తాను తెలుపుకునే సహజ స్థితికి చేరుకునే త్రోవలో మధ్యాక్కర శతకాలు కరదీపికలు.

'--- మధ్యాక్కఱల' లోని కవితా సౌందర్యం ముఖ్యంగా సంబోధనలు, రూపకాలు, విశేషణాలు అదీ ఒక ప్రత్యేకాధ్యయనాంశం. ఈ రచన చేసే నాటికి విశ్వనాథ '--- కల్పవృక్షం' లో సుందర కాండం పూర్తి చేశారు. ఒక విషాద విరామం కలిగింది. తన్ను తాను చెదరి పోకుండా బిగ బట్టుకుని ఈ మధ్యాక్కర పథంలో అక్షర దర్శనానికై సాగిపోయారు. మధ్యాక్కరలతో ప్రారంభమైన కవితా రచనలో తెలుగు పలుకుబడి పెంపును లోకోక్తుల బాహుళ్యమును శైలిలో మార్పునూ తెచ్చింది.

శ్రీరామరాజు మధ్యాక్కఱల పరిశీలనం రెండు భాగాలలో చేశారు. తొలి భాగంలో విశ్వనాథ జీవితాన్నీ వ్యక్తిత్వాన్నీ రచనల స్థూల పరిచయాన్నీ చేసి విశ్వనాథ తాత్త్వికతను విపులంగా చర్చించారు. రెండవ భాగంలో విశ్వనాథ మధ్యాక్కరలలోని ప్రతిశతకాన్నీ విశ్లేషణాత్మకంగా పరిచయం చేశారు. తత్త్వవిచారణ, భక్తి వైభవము, లోకవృత్త పరిశీలనము, భాషా విశ్లేషణ దిక్సూచికలుగా ఈ విమర్శ కొనసాగింది. ఏ శతకాని కా శతకంగా కాకుండా ఆ యా అంశాలే ప్రధాన విచారణాంశాలుగా అధ్యయనం చేస్తే సమష్టిగా గ్రంథ వైశిష్ట్యం కనులకు కట్టేది.

'విశ్వనాథ మధ్యాక్కఱల' ను చదివే పాఠకులకు ఈ గ్రంథం ఒక విధంగా మార్గ దర్శనం చేస్తుంది. జీవితంలో పరమార్థాన్ని అన్వేషించే వారికి శ్రీరామరాజు గారి కృషి నిజంగా ఎంతో తోడ్పడుతుంది.

*పరగ నాశారదాదేవి నీ నుండి బయలుదేరినది*
*సరసిజభవురాణి యొక్క ధార, నా సన్నిధిఁ బ్రాఁకె*
*హర ! నన్ను నా ధారవెంట నీవద్ద కరుదేరనీవె......* *(శ్రీగిరి – 100)*

*సామాన్యముగ నేల బ్రయాణముం జేయు సమయంబునందు*
*నా ముఖంబునఁ గవితా సరస్వతి నాట్య మాడెడిని*
*స్వామి ! నాతుది యాత్ర నిన్నుఁ బాడుచు సాగనీవె, గ*
*వీ మార్గ......* *(నందమూరు – 88)*

అనుగ్రహమూ, అభీప్స రెండూ రెండు పద్యాలలో చెప్పబడ్డాయి. 'విశ్వనాథ మధ్యాక్కఱల' అధ్యయనం ద్వారా పరమార్థ మార్గాన్ని స్పష్టం చేసిన శ్రీరామరాజు గారికి నా హృదయపూర్వ కాభినందనలు.

కోవెల సుప్రసన్నాచార్య

# విషయ సూచిక

# అవతారిక

ఇది 'శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము (కాకినాడ)' వారు 'విశ్వనాథ మధ్యాక్కఱల' పై నిర్వహించిన సిద్ధాంత వ్యాస రచనల పోటికి రచించిన గ్రంథము.

ఇది 'అక్షర విశ్వనాథ'. విశ్వనాథవారు మధ్యాక్కర శతకములను రచించి అక్షరు లైరి. ఈ శతకములలో స్తోత్ర రూపమున పరబ్రహ్మమును గురించియు, తదుపాస నానుభవములను గురించియు వివరింపబడినది. ఆ విధమున ఒక్కొక్క మధ్యాక్కర ఒక్కొక్క స్తుతియై విశ్వనాథవారు వేయి మధ్యాక్కరలలో వేయి నుతులు గావించిన వారగుచున్నారు. వైదిక ఋషులకు ఋక్కులవలె విశ్వనాథవారికి మధ్యాక్కర వాహిక యైనది. అక్షరత్వము నాశించి, మధ్యాక్కరలలో అక్షరుని నుతించి విశ్వనాథవా రక్షరు లైరి. అనగా వారు మధ్యాక్కర శతకముల మూలమున సాహిత్య జగత్తులోనే గాక విశ్వ జగత్తునందు కూడ శాశ్వతు లైరి. దానిని విశ్లేషించి చూపు నీ గ్రంథము 'అక్షర విశ్వనాథ' యైనది.

ఇది 'విశ్వనాథ మధ్యాక్కఱల' పై నొక విధమైన సమీక్ష. ఇది సమగ్రము కాదు. అసలేది సమగ్రము? పరబ్రహ్మ మొక్కటే. కడమ వన్నియు నసమగ్రములే. ఇచ్చటి ప్రస్తుతాంశము - ఒక గ్రంథముపై పలు విధములైన విమర్శలు వెలయుట కవకాశము కలదు. అది విమర్శకు డెన్నుకొను మార్గముపై ఆధారపడి యున్నది. ఈ గ్రంథము విశ్వనాథవారి నొక వ్యక్తిగా, కవిగా, తత్త్వవేత్తగా స్థాపించి, తరువాత నీ శతకములలో వారు రచించిన విషయములను విశ్లేషించి చూపుట అనెడి ఒక నిర్దిష్టమైన ప్రణాళికపై రచింపబడినది.

విశ్వనాథ వారొక మహాకవి. ఒక మహాజ్ఞాని. ఇట్లు చెప్పుటయందు క్రొత్త ఏమున్నదని ప్రశ్నింతురు. దీనికి సమాధానము, ఆ విధముగ చెప్పుటకు 'విశ్వనాథ మధ్యాక్కఱల'ను గ్రంథ మొక్కటియే చాలునని తోపింపజేయుటయే. ఆ గ్రంథమున విశ్వనాథవారి కవిత్వము యొక్కయు, జ్ఞానము యొక్కయు విశిష్టతను పరిపూర్ణముగ గాంచనగును. వ్యవహార భాషాగత జీవలక్షణము యొక్క కావ్య ప్రయోగ సౌందర్యము నంతను, కనుల పండువుగా వీక్షింప నగును. ఈ విషయము నంతను ఒక్క కోణము నుండియే సమగ్రముగ పరిశీలింపజాలము. ఇతర మార్గములలో కూడ విమర్శలు వెలసినప్పు డదంతయు కలిపిన సమగ్ర :ము కావచ్చును. మాటవరుస కాగ్రంథములోని అద్వైత తత్త్వము, లోకపరిశీలనము, భాషా విశేషములు, అలంకార ప్రయోగము మొదలైన వానిని గురించి యొక్కొక్క గ్రంథము వెలువడదగును. ఆ విధముగ జేయు ప్రయత్నమున కిది యొక ప్రేరణ వలె రచింపబడినది.

ఇది పోటికి రచించిన గ్రంథము. ఆ నిబంధనలలోని కాలము నీ రచయిత సమముగ వినియోగించుకొనలేక పోయెను. ఆ విధమైన తొందరపాటుచే కలిగిన దోషము లిందుండ వచ్చును. ఇంకను రచనను చిత్రిక పట్టవలసి యున్నది. సముద్రపు టలవలె వచ్చు గడువు

తేదీ ముంచక మునుపే రచయిత గ్రంథమును సమర్పించి గట్టెక్క నెంచుట వలన, అవి గ్రంథ ముద్రణ సమయమున సరిచేయబడునని రచయిత విన్నవించుకొనుచున్నాడు.

ఈ సందర్భమున నీ రచయిత, గురువులకు నమస్కరించి, గ్రంథ రచన కుపకరించిన గ్రంథముల / వ్యాసముల రచయితలకు కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాడు. తమ గ్రంథముపై విమర్శను వెలయించు భాగ్యము కలిగించిన విశ్వనాథ సత్యనారాయణ గారి కెదలో నంజలి ఘటించి, అట్టి అవకాశము లభింపజేసిన 'శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము (కాకినాడ)' వారికి కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాడు.

పోటి నిర్ణయ మెట్లున్నను, ఈ గ్రంథము సహృదయ పండితుల మన్నన లంద జాలినచో రచయిత కృతార్థుడైనట్లే.

రచయిత

14-2-87

---

## 1987 ప్రభవ ఉగాది - విశ్వనాథ సాహిత్య పీఠం అవార్డు వార్తా ప్రకటన

"ప్రతి సంవత్సరం శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము, కాకినాడ వారు నిర్వహించే ఉత్తమ సాహిత్య విమర్శల పోటిలో ఈ సంవత్సరము డాక్టరు నడుపల్లి శ్రీరామరాజు, ఎమ్.ఏ., పిహెచ్.డి. (ఆంధ్రోపన్యాసకులు, కేంద్రీయ విశ్వవిద్యాలయము, హైదరాబాదు) వ్రాసిన 'అక్షర విశ్వనాథ' అన్న గ్రంథము ఉత్తమ మైనదిగా నిర్ణయింపబడినది. ఇది విశ్వనాథ వారి మధ్యాక్కరలపై విమర్శ గ్రంథము. "

"కాకినాడలో 30-3-1987 తేదీన ప్రభవ ఉగాది పర్వదినాన జరిగే వసంత సాహితీ సమారోహ మహాసభలో డాక్టరు నడుపల్లి శ్రీరామరాజు విశ్వనాథ సాహిత్య పీఠం అవార్డు ............ గ్రహిస్తారు."

"..................."

పేరాల భరత శర్మ

17-3-1987

వ్యవస్థాపక సంచాలకుడు,

శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము,

కాకినాడ.

# పూర్వ ఖండము

# ధిషణా వైశ్వానాథము

## 1. ఉపోద్ఘాతము

ఆంధ్ర భారతి క్రొత్త రూపము సంతరించుకొనుచున్న సమయ మది. ఆంధ్ర కవితా లత సంప్రదాయముపై నవ్యత యను మారాకు దొడుగుచున్న తరుణ మది. 'శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల వాణి. ప్రాచీన కవితకు భరత వాక్యము నవీన కవితకు నాందీ వాక్యము' పలికిన రోజు లవి. కాల వాచకమును బట్టి అది ఇరువదియవ శతాబ్ది ప్రథమ పాదము. ఆ సమయమున ప్రతిభా వ్యుత్ప త్త్యభ్యాసములు పుష్కలముగా కలిగి, సంప్రదాయమునకు పట్టుగొమ్మయై సహృదయతతోనవ్యత నాదరించు మహాకవి అవతరింపవలసిన ఆవశ్యక మేర్పడెను. వారే 'అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయ మూర్తి' శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఆధుని కాంధ్ర కవి పుంగవులలో నగ్రగణ్యులు. వీరు సకల సాహిత్య ప్రక్రియలను చేపట్టి, వానికి వినూత్న గౌరవము కలిగించుటతోపాటు -

తే॥ కవి ప్రతిభలోన నుండును గావ్య గత శ,తాంశముల యందుఁ దొంబది యైన పాళ్ళు
ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయి, రెట్లు గొప్పది నవ కథా ధృతిని మించి.

అని వారు శ్రీమద్రామాయణ కల్పవృక్షమున (బాల. 1-5) నిరూపించి, ఆంధ్ర వాఙ్మయమును పరిపుష్టము కావించిరి. కథానికలు కల్పించిరి. నవలలు నిర్మించిరి. ఖండ కావ్యములు కూర్చిరి. రూపకములు రూపొందించిరి. విమర్శలు వెలయించిరి. ప్రబంధములు ప్రచురించిరి. మహాకావ్యములు ప్రకటించిరి. ఇట్లు సర్వ కావ్య ప్రక్రియల నాదరించి రసవత్కావ్యములను పుంఖానుపుంఖముగా రచించిరి.

ఆంధ్ర సారస్వతోద్యానమునకు వారు కావ్య పుష్పములచే సౌరభోత్కర్షను కలిగించిరి. ప్రతి రచనను సమగ్ర కళా సంభరితము కావించుటతోపాటు పనిబూని ప్రతి రచనయందును భారతీయాత్మను ప్రతిష్ఠించిరి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి ప్రతిభా పాండిత్యములకు మేరలు లేవు. వేద వేదాంత శాస్త్రముల సారమును జీర్ణించుకొనిన హైందవ సంస్కృతి పరిణద్ధమూర్తి వారు. ఆంధ్ర గీర్వాణాంగ్ల సారస్వతాంబుధులను ఆపోశనము పట్టిన సాహితీ కుంభసంభవులు వారు. కావ్య శిల్పము ననల్పముగ పోషించి నన్నయ భట్టార కాది మహాకవులను తమ కవితలో నిలుప జాలిన ఆంధ్ర వాఙ్మయ విరాణ్మూర్తి వారు. ఇటువంటి సర్వతోముఖ ప్రతిభా భాస్వంతులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ఇరువదియవ శతాబ్ది ప్రసాదించిన ఒక నన్నయ, ఒక తిక్కన, ఒక సోమన, ఒక పెద్దన.

సంప్రదాయమును లేశ మాత్రమైనను అతిక్రమింపనిది వారి లేఖిని. అది జీవము, జవము కలిగిన భాషా వ్యవహార ప్రయోగమునకు పట్టుగొమ్మ. చమత్కార ఝరీ ప్రవాహము వారి ఉపన్యాసము. పాండిత్య ప్రకర్షతో కూడిన రజోగుణ స్ఫోరకము వారి వాగ్ధోరణి. వీరు ఆంధ్ర పౌరుషము, ఆంధ్ర ప్రశస్తి, ఋతు సంహారము మొదలగు ఖండకావ్యములు; కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెండ్లి, గిరి కుమారుని ప్రేమగీతాలు మొదలగు గేయ కావ్యములు; ప్రద్యుమ్నోదయము, రురుచరిత్రము వంటి ప్రబంధములు; కుమారాభ్యుదయము, ఝాన్సీరాణి వంటి కావ్యములు; అనార్కలి, నర్తనశాల, వేనరాజు మొదలగు నాటకములు; మా స్వామి, విశ్వనాథ మధ్యాక్కరలు వంటి శతకములు; ఆరు నదులు, ఏకవీర, కడిమి చెట్టు, వేయి పడగలు మొదలగు నవలలు; నన్నయ గారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అల్లసాని వాని అల్లిక జిగిబిగి మొదలగు విమర్శ గ్రంథములు రచించిరి. వీరి కవితా సరోవరమున సహస్రదళ కమలము శ్రీమద్రామాయణ కల్పవృక్షము. ఈ మహా కావ్యము వీరికి లభించిన జ్ఞానపీఠ బహుమాన పురస్కారమున కాలంబనమైనది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు సంస్కృతమున కూడ రచనలు చేసిరి. అమృత శర్మిష్ఠము, గుప్త పాశుపతము అను నాటకములు; దేవీ త్రిశతి, శివ సాహస్రము ఇత్యాది కావ్యములు వీరి సంస్కృత రచనలు. ఆంధ్ర క్రియా సర్వస్వ మణి దీపిక, తెలుగు సామెతల సంకలనము, గద్య చంద్రిక అనునవి వీరిచే సంపాదితములైన గ్రంథములు. అర్చన, ఆకాంక్ష, ఆకాశ దీపము, తల్లి, తిక్కన ప్రశంస, ధర్మ వాంఛ, పూల మబ్బులు, విప్లవము, స్వాతంత్ర్యము మొదలుగా గల వీరి అసంఖ్యాక కవితలు పత్రికలలో ప్రచురించబడినవి. వీరి రచనలలో దుర్యోధనుడు, కిరీటమణి మొదలగు నాటికలు; ఆద్యంతములు, కాళిదాసు - అపకీర్తి , జమీందారుని కొడుకు మొదలగు చిన్న కథలు కూడ కలవు. ఆంధ్ర విశ్వ విద్యాలయం - వాడుక భాష, ఏకో రసః

కరుణ ఏవ, తిరుపతి వేంకటేశ్వర కవుల కావ్యములు, నాచన సోమనాథుడు - సంవిధాన చక్రవర్తి మొదలైన వ్యాసముల నెన్నింటినో వీరు విరచించిరి. ఇంకను వీరు భారత నిరుక్తి, కల్చర్ రివీల్డ్ టు లిటరేచర్ మొదలగు వ్యాసముల నాంగ్లమున కూడ వెలయించిరి. కలి లేక నాగరికతా భవిష్యత్తు, ద్వాదశ మంజరి, యతిగీతము అనునవి వీరి అనువాద రచనలు. ఇక వీరి లేఖిని నుండి పలు రేడియో కవితలు, నాటికలు, ప్రసంగములు వెలువడినవి. ఆంధ్రవాఙ్మయ చరిత్రకు సంబంధించి వీరు రచించిన రేడియో రూపకములు ఒక క్రొత్తకు ఒరవడి. ఇతరుల గ్రంథములకు వీరు రచించిన ఆశీస్సులు, పీఠికలు అసంఖ్యాకములు. వీరి ఉపన్యాస ధారలయం దోలలాడని తెలుగు పల్లె లేదనిన నతిశయోక్తి కాదు. ఇదంతయు వీరి సారస్వత వ్యాసంగము కాగా వీరిపై ఇతరులు రచించినవియు, వీరి రచనలు ఇతర భాషలలోనికి అనువాదము లైనవియు వంటి సారస్వతము అపారముగా కలదు. (విశ్వనాథ వాఙ్మయ సూచి.1974) ఇదంతయు వీరి బహుముఖమైన సారస్వత సృజనకును, ఆంధ్ర వాఙ్మయమున వీరికి గల స్థానమునకును దిక్ప్రదర్శనము మాత్రమే. దీనినిబట్టి వీరు, బహుశః నేటి కాలమునందు ప్రత్యేకమైన గుర్తింపు నొందిన వచన కవిత తప్ప కడమ ప్రక్రియల నన్నిటిని స్పృశించి వానికి గౌరవము చేకూర్చి రని చెప్పవచ్చును.

'విశ్వనాథ మధ్యాక్కరలు' అనునది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి కావ్యములలో శతక ప్రక్రియకు చెందిన ఒక విశిష్ట గ్రంథము. ఇది మధ్యాక్కరలలో వ్రాయబడిన పది శతకముల సంపుటి. ఈ గ్రంథము 1967వ సంవత్సరమునకు కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి బడసినది. ఇందలి శతకములు శ్రీశైలము, శ్రీకాళహస్తి, భద్రాచలము, నందమూరు (కులస్వామి, వేణుగోపాల), తిరుపతి, ద్రాక్షారామము, నెకరుకల్లు, మున్నంగి, వేములవాడ అను క్షేత్రములలోని దైవములపై వ్రాయబడినవి. భక్తియే ప్రధాన వస్తువుగా ఒక్కొక్క శతకమున 101 పద్యముల చొప్పున తొమ్మిది శతకములందును, ఒక్క మున్నంగి శతకములో 108 పద్యములును కలవు. మొత్తము పద్యములు 1017. 'విశ్వనాథ మధ్యాక్కఱ'లను నామముతో ఈ దశ శతక సంపుటి ధర్మవరపు సీతారామాంజనేయులు గారి కంకిత మీయబడినది. వారి నాశీర్వదించుచు వ్రాసిన నాలుగు పద్యములు కూడ మధ్యాక్కరలే. ద్వితీయ ముద్రణ మని యున్న గ్రంథములో '1958, 59, 60 సంవత్సరములలో భారతి, నవభారతులలో ప్రచురితము' అని ఈ శతకముల పూర్వ ముద్రణ వివరములు కలవు. విమర్శిని (1977 : 261)లో వారణాసి ప్రథమ శతకము అను అసమగ్ర మైన వ్రాత ప్రతి యొకటి కలదని పేర్కొనబడి 'వారణాసి ప్రభూ! విశ్వనాథ!' అను మకుటముతో లభ్యమగు అయిదు మధ్యాక్కర పద్యములు ప్రకటితము లైనవి. 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను పేరు గల పది శతకముల సంపుటిలో ఈ పద్యములు

లేకపోవుటచే అవి ఈ విమర్శ గ్రంథములో గ్రహింపబడలేదు.

మధ్యాక్కర ఒక విశిష్టమైన ఒక విలక్షణమైన పద్యము. ఇది జాతి పద్యము. పంచవిధ అక్కరలలోను మధ్యాక్కరకే తెలుగున ప్రచారము కలదు. నన్నయ తరువాత దీనిని అధికముగ నాదరించిన సుప్రసిద్ధ కవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారే. నన్నయ మధ్యాక్కరల లక్షణమునందు కొంత వైలక్షణ్యము కలదు. అందువలన నీ పద్యమున కొక ప్రత్యేకత లభించినది. ఇట్టి మధ్యాక్కరలను గైకొని శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు పది శతకములతో పాటు రామాయణ కల్పవృక్ష మహా కావ్యమునందు కూడ రచించుటను బట్టి వారికి మధ్యాక్కర పద్యముపై గల మక్కువ తెలియుచున్నది.

ఈ విమర్శగ్రంథమున ప్రధాన కావ్య విమర్శ కుపక్రమించుటకు ముందు విశ్వనాథ సత్యనారాయణ గారి వ్యక్తిత్వము, మధ్యాక్కరల వృత్తాంతము, శతక సాహిత్య వైశిష్ట్యము మొదలగు అంశములు పరామర్శింపబడును. తదుపరి విశ్వనాథ మధ్యాక్కరల పరిచయము, ఒక్కొక్క శతకమునందు వారు ప్రకటించిన తత్త్వము, సందేశము మొదలగు వానిని అనుశీలించుట, అందలి కవితానుశీలనము చేయుట అనునంశములు స్థూలముగా వీక్షింపబడును.

---

# 2. వ్యక్తి విశ్వనాథ

మ॥ అల నన్నయ్యకు లేదు తిక్కనకు లే దాభోగ మస్మాదృశుం
డలఘు స్వాదు రసావతార ధిష ణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయ మూర్తి శిష్యుఁడయినా డన్నట్టి దావ్యోమ పే
శల చాంద్రీ మృదు కీర్తి చెళ్ళపిళ వంశ స్వామి కున్నట్లుగన్.

(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల. 1.21)

ఇది విశ్వనాథ వారి వ్యక్తిత్వమునకు మణిదర్పణము. ఆయన మనస్తత్వము విలక్షణ మైనది. వాగ్వైఖరి వక్రోక్తి విన్యాస భరితము. వా రమేయ ప్రతిభా పాండిత్య సంపన్ను లగుటతోపాటు, వారు తలపెట్టిన సాహి త్యోద్యమముపై వారికి గల ఆత్మ విశ్వాసముతో పై విధముగా గురువులను నుతించిరి. ఈ పద్యమున వారికి ప్రయోగించుకొనిన

బ్రాహ్మీమయ మూర్తి వంటి విశేషణములను చూచి అది వారి అహంకార మనుకొన రాదు. ఇది ''తాను సృష్టించిన సువిశాల సారస్వత జగత్తు యొక్క పుష్టి చూచికొని తుష్టి పొందిన హృదయం వెల్లడించిన ఆత్మ విశ్వాస'' మని వారికి సన్నిహితు లైన మిత్రులు వెలిపుచ్చెడి అభిప్రాయము. (సూర్యనారాయణ మూర్తి, జోశ్యుల 1982: 20) రామాధిక్యముచే గురువులగు వశిష్ఠ విశ్వామిత్రుల గౌరవము అధికమైనది. రావణ పరాక్రమముచే రాముడు పరాక్రమాధికు డైనాడు. ఇదొక విధమైన వాక్యధ్వని. ఇట్లే పై పద్యమున విశ్వనాథ వారికి గల విశేషణముల ఆధిక్యముచే నా గౌరవము గురువులగు వేంకట శాస్త్రి గారిదే. (సుబ్రహ్మణ్యం, జి.వి. 1964:73)

వారు సాహిత్యము ద్వారా భారతీయ విజ్ఞానమును సనాతన ధర్మమును లోకుల కందీయ వలెనని దీక్ష వహించినట్లు తెలియుచున్నది. వారొక సందర్భమున ''నేను వ్రాసిన దానిని అనంత విషయములు నేను చొప్పించి వ్రాస్తాను. కనుక అనాదినుంచి ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకొంటూ వస్తున్నది. ఈ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయి వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను. అనే భావం నాకు ఉన్నది'' (సత్యనారాయణ,విశ్వనాథ 1972: 3.3) అని వ్రాసిరి. ఇది వారి రచనల మూల తత్త్వమును తెలుపుటతోపాటు వారికి గల ఆత్మ విశ్వాసమును గూడ ప్రకటించు చున్నది. ''మఱల నిదేల రామాయణం బన్నచో, నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళ - దిను చున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు, తన రుచి బ్రతుకులు తనవి గాన...''(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల.1-5) అను పద్యము వీరి వ్యక్తిత్వము నావిష్కరించు చున్నది. భారతీయ సంస్కృతి పరిరక్షణ, ధర్మప్రబోధము అనునవియే మన సమాజాభ్యుదయమునకు హేతువు లను సిద్ధాంతముతో వీరు సారస్వత సృజన గావించిరి. వీరి వ్యక్తిత్వము నం దీ భావమే తొంబది పాళ్ళు కనబడునట్టిది. దీని సారాంశమే వీరి సారస్వత సందేశము. ఈ అంశములపై ఇతరుల భావములతో వీరికి పనిలేదు. 'నా భక్తి రచనలు నావి గాన' అని పై పద్యమునందును, తన కవిత్వమును మెచ్చుకొనకపోయినను తనకు తన దైవ మైన విశ్వేశ్వరుని తోడనే సంబంధ మని విశ్వేశ్వర శతకమునందును వీరు తమ అభిప్రాయమును సూటిగా ప్రకటించిరి. నిత్య జీవితమున వీరి కనుభవమునకు వచ్చిన తాత్త్విక భావనకు వీరిపై గల శ్రీవిమలానంద భారతీ స్వామి వారి ప్రభావమే కారణ మనదగును. (శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల. 1-74) ''ఆయన సాహచర్యంతో సత్యనారాయణ గారి మేధ పులు గడిగిన ముత్య మల్లే తయారైందని చెప్పవచ్చు'' నని వీరి సోదరులు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లుగారు వ్రాసిరి. (విమర్శిని 1977:309) వారిని విశిష్ట వ్యక్తిగా చేసినవి రెండు గుణములు. మొదటిది మహాకవిత్వ దీక్ష, రెండవది

సనాతన ధర్మ ప్రబోధము. ఈ రెంటియందును వారు, జీవిత పర్యంతము గురువులుగా నంగీకరించినవారు క్రమముగా చెళ్ళపిళ్ళ వారును, విమలానంద భారతీ స్వామి వారును. ఈగురువుల ప్రభావముచే వారు ఉత్తమ కావ్యముల ద్వారా అపారమైన భారతీయ విజ్ఞానమును లోకమున ప్రచారము చేసిరి. ఈ విధముగా వారటు కవితా స్రోతస్వినితోను, ఇటు సనాతన ధర్మ స్రోతస్వినితోను ఆధునికాంధ్ర సాహిత్య కేదారమును సస్యశ్యామల మొనర్చిరి.

విశ్వనాథవా రెంతటి సత్యశీలురో అంతటి 'నిర్మోహమాటి'. ఒకపర్యాయ మొకరు తిరుపతి వేంకట కవుల పద్య మొక దానిని సందర్భ వశమున చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి గారి సమ్ముఖమున గానము చేసిరి. అది తిరుపతి వేంకట కవులం దెవరి పద్య మను ప్రశ్న తల ఎత్తినది. ఆ సమయమునం దచ్చట నున్న విశ్వనాథవారు ఆ పద్య రచనా విధానమును బట్టి అది వేంకట శాస్త్రి గారిది కాదనియు, తిరుపతి శాస్త్రి గారిదే ననియు ప్రకటించి గురువు గారి అభినందనల నందుకొనిరి. (సూర్యనారాయణ మూర్తి, జోశ్యుల 1982 :31) వారి వ్యక్తిత్వములోని వైశిష్ట్యము వారి స్నేహ భావమునందు ప్రత్యేకముగా వ్యక్తమగును. వారి మిత్రు లందరు 'వేయి పడగలు' నవలలోని పాత్ర లైనారని, ఆయన తోడి స్నేహ మనగా వారి జీవితముతో ముడిపడుటయే అనియు, ఆయన బ్రతు కంతయు స్నేహితులతోనే గడచినదనియు, స్నేహితులతో వారికి గల మనస్విత, సమార్ద్రత ఒక ప్రత్యేక లక్షణమనియు విశ్వనాథ వేంకటేశ్వర్లు గారు పేర్కొనిరి. (విమర్శిని.1977:309)

'విశ్వనాథవారు తమ బాల్య మిత్రుల నెప్పుడు కలిసికొనినను వారెంతయో అపేక్ష వెళ్ళబోసికొనెడివా రట. ఆయన మొదటి నుండియు స్నేహజీవి. వారు బాల్యము నం దెల్లప్పుడు స్నేహితులతోనే కాలము వెళ్ళపుచ్చెడివారు. అదే కాలమున చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి యొద్ద కవితా సమారాధనమున వీరికి పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు గారలు సహాధ్యాయులుగా నుండెడివారు. 1916 తరువాత ఇంటర్మీడియట్ విద్య నుండి లక్ష్మీకాంతం గారితో స్నేహము గాఢము కాజొచ్చినది. విశ్వనాథవారి కుటుంబములో లక్ష్మీకాంతంగా రొక సభ్యునిగా మెలగెడివారు. ఇరువురు నెంతో ప్రేమాస్పదులుగా నుండెడివారు. ఒకరి అనుభవముల నొకరికి చెప్పికొనెడివారు. అన్నిటను ఒక్కరై జంటగా పద్యముల కూడ నల్లెడివారు. చివరకు అభిమానులుగా మారిరి.' (విమర్శిని.1977:296-300)

'వీరు బందరు హిందూ కాలేజిలో లెక్చరర్ పదవిని నిర్వహించి నప్పుడు వీరి తమ్ములు విశ్వనాథ వేంకటేశ్వర్లు గారు, కృష్ణాపత్రిక అధిపతులైన ముట్నూరి కృష్ణారావు గారు సాహిత్యగోష్ఠులు నిర్వహించెడివారు. ఆ సభలలో విశ్వనాథవారి

కారంభమున ప్రతిపక్షులుగా నున్నవారు చివర కభిమానులుగా మారిరి. ఇది వారి సాహిత్యౌన్నత్యముతోపాటు నిర్మల వ్యక్తిత్వమునకు కూడ నిదర్శనము. ఆ రోజులలో విశ్వనాథవారి కవిత్వముపై అపరిమి తాభిమానము కలిగి విలువలను గుర్తించినవారు జలసూత్రం రుక్మిణీ నాథ శాస్త్రి గారు, గురుభాగవతుల సుబ్బారావు గారు, తారకం గారు మొదలగువారు. చింతా దీక్షితులుగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు, నాయని సుబ్బారావు గారు మొదలగు వా రప్పటి స్నేహితులే. తరువాత వీరికి మిత్రులైన వారిలో అడివి బాపిరాజుగార్లు, నండూరి సుబ్బారావు గారు, బసవరాజు అప్పారావు గారు, మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు మొదలగు వారు కలరు'. (విమర్శిని. 1977:322,3)

'విశ్వనాథవారి వ్యక్తిత్వ మెంతటి విలక్షణమైనదో వారి వాగ్ధోరణి అంత చమత్కారమైనది. వారి కత్యంత సన్నిహితులైన పండితులు శ్రీ జోశ్యుల సూర్య నారాయణమూర్తి గారొక నాడు వారింటికి వెళ్ళినపుడు మర్యాదకొరకై మీరేదో పనిలో నుండుటచే తన రాక అభ్యంతరకర మగుచున్న దేమోనని పల్కినారట. వెంటనే విశ్వనాథ వా రవునని బదులు చెప్పిరట. వారి నెరిగిన వారి కది బాధాకరమైన విషయము కాదని, వారితో గల తమ అనుభవమును శ్రీ జోశ్యులవారు గ్రంథస్థము చేసిరి. ఇది వారికి మిత్రుల యెడల గల 'నిర్మోహమాట' మైన ప్రవర్తనమున కుదాహరణము.' (సూర్యనారాయణ మూర్తి, జోశ్యుల 1982:12)

విశ్వనాథవారు కొడాలి ఆంజనేయులు గారితో కలిసి కొంత కాలము సత్యాంజనేయు లను పేరుతో జంట కవిత్వము చెప్పిరి. తరువాత నెవరితోను జంట కవనమున కంగీకరించినవారు కారని చెప్పుదురు. వీ రిరువురు ప్రగాఢమైన మైత్రీ భావ సంపన్నులే కాక శరీరములు వేరయినను ఒకే ఆత్మవలె నుండెడి వారట. వా రిరువురు నొకప్పుడు నడుచుచు సంభాషించుకొనుచుండిరి. అప్పుడు, శ్రీనాథునకు సంబంధించిన సాహిత్యాంశముపై అభిప్రాయ భేదము రాగా ఆంజనేయులుగారు కోపము పట్టజాలక విశ్వనాథవారిని లెంపకాయ కొట్టిరట. విశ్వనాథవారికి కన్నుల వెంట జలజల బొట్లు రాలి పడుటతోపాటు రోషము కూడ కలిగినదట. ఆ తరువాత వారు నడక సాగించుచునే యుండిరి. ఒక వాగు అడ్డము రాగా ఆంజనేయులుగారు దానిని దాటలేక పోయిరట. అప్పుడు వారిని విశ్వనాథవారు ఎత్తుకొని వాగును దాటిరట. జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు (విమర్శిని.1977:383) పేర్కొన్న పై ఉదంతము విశ్వనాథ వారి వ్యక్తిత్వమును చెప్పక చెప్పుచున్నది.

చెళ్ళపిళ్ళవారికి జరిగిన ఒక సన్మాన సభలో పద్యములు చదువుడని సభవారు వీరిని కోరిరి. ఆరంభమున వీరంగీకరించకపోవుటచే వారు పట్టుబట్టగా విశ్వనాథవారు

'మీరేమంటారో చూద్దామని అలా అన్నా'నని పలికి పద్యములు చదివిరట. వీరు పద్యములు చదువుచుండగా సభాధ్యక్షులు వేదిక పైనున్న వరొకరితో సంభాషించుచుండిరి. అప్పుడు విశ్వనాథవారు చదువుట మానివేయగా, అధ్యక్షులవారు 'చదవండి చదవం'డనిరి. వీరు వెంటనే 'మాటలాడండి మాటలాడండి' అని బదులు పలికిరి. అప్పు డధ్యక్షులవారు సంభాషించుట మానిన పిదప వీరు పద్యములు చదువ నారంభించిరి. మరల వారు సంభాషణము కొనసాగించుచుండగా విశ్వనాథవారి కాటంకము కలిగినది. వీరు పద్య పఠనము నాపివేయగా అధ్యక్షులు 'మీరిక్కడకు వచ్చింది చదవటానికే' అని సూచన చేయగా, వెంటనే విశ్వనాథవారు వెనుకాడక 'ఆ సంగతి తమకు తెలుసునో లేదో అనే చూస్తున్నా'నని పలికినారట. ఈ దృశ్యమును వారి మిత్రులు జోశ్యుల వారు చిత్రించిరి. (సూర్యనారాయణమూర్తి, జోశ్యుల 1982:22) వారి జీవితములోనిట్టి సన్నివేశములు వారి నిర్భీతిని, వాక్చాతుర్యమును వ్యక్తము చేయును. వారి పలుకు దారుణాఖండల శస్త్రతుల్యమయ్యును మనస్సు నవ్య నవనీత సమాన మని వారి సన్నిహితులు చెప్పెదరు. వారు సొంత ధనమును లెక్కింపక మిత్రులకు వెచ్చించెడివారు. బీదవారికి దానము చేసెడివారు. ఇతరుల యెడ అపరిమిత మైన జాలి వహించెడివారు. రసజ్ఞులకు తమ కావ్యముల నిచ్చుటతోపాటు తమతో భోజనముకూడ పెట్టెడివారు. ఇంటియం దిబ్బంది పడుచున్నను సొంత డబ్బును మిత్రులకై వెచ్చించి వట్టి చేతులతో నింటికి వచ్చెడివారనియు వారి షష్టిపూర్తి సన్మానమునకు వచ్చిన ధన మంతయు కళాశాలకు విరాళ మొసగి రనియు, ఆయన ఎంత సంపాదించిరో అంతకు మించి దానము చేసి రనియు వారి సోదరులు శ్రీ వేంకటేశ్వర్లుగారివలన తెలియుచున్నది. (విమర్శిని 1977:339) ఇవన్నియు వారి వదాన్య శీలమునకు ప్రత్యక్ష సాక్ష్యములు.

వారి వ్యక్తిత్వమునం దంతట దర్శన మిచ్చు విలక్షణము అహంభావము. వా రాదినుండియు దారిద్ర్యము ననుభవించియు, అహమును చంపుకొని బ్రతుకలేదు. గుంటూరులోని కళాశా లాధ్యాపకత్వమును మానివేయుట కిదియే కారణమట. వీరి పట్ల ఈ భావ మొక ఉత్తమ లక్షణముగా పరిణమించిన దనియే చెప్పవచ్చును. అదొక్కొక్కప్పు డితరులకు సహింపరానిదిగ కూడ నుండియుండవచ్చును. ''ఇంకొకరిని తనతో సమానంగా చూచుకొనే లక్షణం విశ్వనాథలో లేదు. ఆయన ఇతరులను కేవలం తనను మెచ్చుకోవటానికి పుట్టినవారుగానే చూస్తాడు.'' (విమర్శిని 1977: 407) అని శ్రీ నోరి నరసింహ శాస్త్రి గారు వ్రాసిన దానిని బట్టి పై విధముగ నభిప్రాయపడవలసివచ్చుచున్నది. వీరి కితరులతోడి వైర మున్నచో నిది యొక హేతువై యుండవచ్చును. వీరి అహంభావమును శ్రీ గిడుగు సీతాపతి గారు (విమర్శిని 1977:

395) ఆత్మ ప్రత్యయ లక్షణమని శ్లాఘించిరి. వీరి కీర్తి కది దోహదపడు సద్గుణముగా భాసించిన దనియే చెప్పవలెను. వీరి సాహిత్యాభిమానులు నట్లే చెప్పుదురు.

ఈయన హృదయము ఆర్ద్రతా గుణ సంభరితము. ప్రత్యక్షముగ జరిగిన సన్నివేశములకు మనస్సు తీవ్రముగా చలించెడి స్వభావము గలవా రీయన. తమ అనుభవములకు కావ్యతా ముద్ర కల్పించి యుండుట వలననే వీరి కవిత్వమున కంతటి ప్రచారము కల్గిన దని చెప్పవచ్చును. విశ్వనాథ వారి సహృదయత్వమునకు సాటిలేదు. ఆయన 'కల్లా కపటము' లేని సహృదయుడనియు, వారి కోపము, వారి స్నేహమున కవరోధము కాదనియు, 'బలవత్తరమైన ప్రకృతి' **(strong nature)** కలవారనియు, వారెంత కోపింతురో అంత ప్రేమింతు రనియు అడివి బాపిరాజు గారు (విమర్శిని 1977: 364) వీరిని ప్రస్తుతించిరి. విశ్వనాథవారు నిష్కపటులు లని చెప్పుట కింత కంటె వేరొక ఆధార మక్కరలేదు. వీరిది విప్లవ ప్రకృతి కాకపోయినను, వీరు సామాజిక పరిణామమును గాని, చైతన్యపు టూహలను గాని వ్యతిరేకించు స్వభావము కలవారు కారు. వీ రన్ని మార్గముల కవిత్వము నాదరించు సమ భావము కలిగియుండియు, తాను ప్రతిపాదించు సిద్ధాంతము ద్వారా సమాజ చైతన్యము కాంక్షించు పురోగామియే కాని, ప్రాత క్రొత్తలయం దొక దానినే గ్రుడ్డిగ నమ్మి రెండవ దానిని తిరస్కరించువారు కారు.

విశ్వనాథవా రెల్లప్పుడును జాతీయతా భావమును కలిగియుండెడివారు. సహాయ నిరాకర ణోద్యమమునందును విదేశీయ వస్తు బహిష్కారమునందును వారుమాతృ దే శాభిమానముతో పాల్గొనిరి. బందరులోనున్న రోజులలో నొకనాడు వారి తమ్ముని కుమారు నొకరిని వెంట పెట్టుకొని రోడ్డుపై నడచుచుండగా, టోపీ ధరించిన తెల్లనాడొకడు సైకిలుపై పోవుచుండెను. వీరితో నున్న చిరంజీవి ఆ తెల్లవానిని చూపి ''అడుగో దొర'' అని బిగ్గరగా పలికెను. తెల్లవానిని దొర యని సంబోధించుటను సహింపని విశ్వనాథవా రా బాలుని ఒక్క దెబ్బ కొట్టి ''మనకు రెడ్డి రాజులు, వెలమ దొరలు దొరలు కాని ఆ తెల్లవారు కాదురా'' అని కేకలు వేసిరి (శ్రీకృష్ణదేవరాయలు, విశ్వనాథ 10.9.86 నాటి ప్రసంగం). ఈ ఉదంతమును బట్టి వారు మూర్తీభవించిన మాతృదేశాభిమాని యని చెప్పకయే తెలియుచున్నది.

ఈ విధముగా భిన్నలక్షణములతో నొప్పు వారి వ్యక్తిత్వము కావ్య నిర్మాణమునందును భిన్న మార్గముల పయనించి బహుభంగిమలను దాల్చి పరమోదాత్త మైన స్థాయికి చేరుకొనినది. విశ్వనాథ వారి వ్యక్తిత్వములో ఒక విశిష్టగుణము అపార మైన గురుభక్తి. దానికీ క్రింది పద్యము నిదర్శనము.

చ॥ తన యెద యెల్ల మెత్తన కృత ప్రతి పద్యము నంతకంటె మె
త్తన తన శిష్యు లన్న నెడదం గల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రు పర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగు నాడునన్.

విశ్వనాథవారి సారస్వతమున వారి వ్యక్తిత్వము యొక్క ప్రతి బింబమును ఆచార్య శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం గారి (1976:6) వాక్యములలో నిట్లు గాంచనగును - ''విశ్వనాథ ప్రవృత్తిలో, ప్రయోగంలో ఆవేశం కంటే ఆలోచనం, ఉద్వేగం కంటే ఉద్విగ్నత, ఆడంబరం కంటే అంతర్ముఖీనత, పరుగు కంటే పయనం, చమత్కారం కంటే ధ్వని ప్రాధాన్యం వహిస్తాయి.''

---

# 3. కవి విశ్వనాథ

తే॥ నాది వ్యవహార భాష మంథరము శైలి, తత్త్వము రసధ్వనులకుఁ బ్రాధాన్యమిత్తు
రసము పుట్టింపఁగ వ్యవహారము నెఱుంగ, జనము లోకమ్మువీడి రసమ్ము లేదు.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము:బాల.1.38)

అని విశ్వనాథ వారు తమ కవిత్వ లక్షణమును ప్రకటించిరి. దీనిని, వారి కావ్యములకు సమన్వయించి సమాలోచించి చెప్పుట సామాన్య విషయము కాదు. తదుపరి వీరు కృతి శత నిర్మాతలు; సర్వ సాహిత్య ప్రక్రియా నిర్వహణ పట్టభద్రులు. వీరు రసవ త్కావ్య కళా ప్రపూర్ణులై సుమా రొక అర్ధ శతాబ్ది కాల మాంధ్ర కవి లోకమునకు కవి సమ్రాట్టులై వెలుగొందినవారు. అట్లగుటచేత భారతావతారిక యందు నన్నయ భట్టారకుడు 'అమలిన తారకా సముదయంబుల నెన్నను....' అని ప్రకటించినట్లుగా విశ్వనాథ భారతిని సంపూర్ణముగ నావిష్కరించుట నిజమున కసాధ్య మనవలెను. అయినను విశ్వనాథవారి కావ్య కళా కౌశలమును దిఙ్మాత్రదర్శనముగా తానేర్చిన భంగిచెప్పుట కీ రచయిత యత్నించుచున్నాడు.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునందు పందొమ్మిదవ శతాబ్ది యొక్క ప్రత్యేకతను సంతరించుకొనినది. ఈ కాలమున మహోత్కృష్టమైన సారస్వతము వెలువడెనో లేదో గాని, ఇరువదియవ శతాబ్దిలో మొగ్గ తొడిగి పుష్పించిన సాహిత్యలతల కప్పుడు బీజావాపము మాత్రము జరిగెను. ఇరువదియవ శతాబ్దిని వాఙ్మయ చరిత్రయందు ఆధునిక యుగ మని గ్రహించినప్పుడు దీనికి పూర్వమున గల సామాజిక రంగములో ఆంగ్ల భాషా సాహిత్య సంస్కృతు లాంధ్రులపై ఎనలేని ఆధిపత్యము నెరపినవి. సమాజము ప్రాతలోని రోతను విడనాడుటకు, క్రొత్తలోని మంచిని గ్రహించుటకు సమాయత్త మైనది. అంతవరకు వచ్చుచున్న సంప్రదాయము ఒడుదొడుకులకు లోనైనది. జాతీయోద్యమ ప్రభావ మన్ని రంగములందు నసాధారణమైన ముద్ర వేసినది. ఆ సమయములో వీరేశలింగ ప్రభ సర్వే సర్వత్ర సంస్కార దీధితులను ప్రసరింప జేసినది. ఆంధ్ర సరస్వతి కావ్య రసమును గ్రోల దప్పికగొని యున్నది. అప్పుడు జాతిని చైతన్య జ్యోతిగా మలచగలిగిన సారస్వతము కొరకు లోక మెదురు చూచినది. ఆత్మ భూతమైన రస ధ్వనుల రాహిత్యముతో నిస్తేజము, నిస్సారము నయిన తెలుగు భారతికి వీరేశలింగ వాణి జవసత్వములు కూర్చినది; ఉరుకులు నేర్పినది; పరమోత్కృష్టమైన సాహిత్య ముద్భవించుటకు వైతాళిక గీతము లాలపించినది. ఆంధ్ర సాహిత్య వేత్తలను ఆలోచింపజేసినది. పరుహ్ను ద్రొక్కు అఖండ గౌతమికి రాజమహేంద్రవరము చెంత గౌతమీ వశిష్ఠ లను రెండు పాయలుగా విడివడు టెట్లు సంభవ మైనదో, అట్లే సంఘర్షణల నడుమ నవశక్తితో భవితవ్యము నన్వేషించు ఆంధ్ర భారతికి రెండు మార్గములుగా విడివడుట తప్పనిసరి అయినది. అందొకటి నూత్నోత్తేజముతో శక్తిమంతమైన సంప్రదాయ మార్గము కాగా మరొకటి భాషలోను భావనలోను నవ్యరీతులు పల్లవించిన క్రొంగ్రొత్త మార్గము. తొలి నాళ్ళలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకట కవులు మొదలగు వారు సంప్రదాయ పథ గాములు కాగా గురజాడ, రాయప్రోలు ప్రభృతులు నవ్యపథ నిర్దేశకు లగుచున్నారు. నన్నయ, తిక్కనాది పూర్వ మహాకవుల నాదర్శముగా నిడుకొని భారతీయ సాహిత్య రీతుల నవలంబించి, సలక్షణమైన భాషాచ్ఛందములలో రసమన్మనోహరము లైన కావ్యములు రచించుట సంప్రదాయ మార్గ మగుచున్నది. పాశ్చాత్య సాహిత్య సంప్రదాయముల నాదర్శముగా నిడుకొని భాషాచ్ఛందములందు స్వేచ్ఛను వహించి నవ్యానుభూతి కలిగించు రచనలు చేయుట నవ్యమార్గ మగుచున్నది. ఇందు మొదటిది నన్నయాదుల మార్గమే అయినను ఆధునిక యుగమున నవ చైతన్యముతో విజృంభించినది. ఈ మార్గము నం దీనాటికిని ఉత్తమ కావ్య కుసుమములు వికసించుచునే యున్నవి. రెండవది ప్రాచ్య పాశ్చాత్య రీతుల మేళనముచే నవతరించిన వినూత్న ప్రక్రియ. ఈ శతాబ్ది తొలి పాదమునం దీ మార్గమున భావకవితా చంద్రిక వెల్లివిరిసినది. అనంతర మభ్యుదయ కవితా భానూదయముతో నది

మరుగైనది. ప్రస్తుత మీ మార్గమున వివిధ తాత్త్విక భూమికలతో వచన కవిత్వము ప్రచారమునం దున్నది. ఇరువదియవ శతాబ్దిలో నవల, కథ, నాటకము వంటి వచన ప్రక్రియలు జనాదరణ పాత్రము లైనవి. ఇవి కూడ నవ్య సాహిత్య విభాగము క్రిందకు చేరును.

విశ్వనాథవారు సంప్రదాయ మార్గమునకు చెందినవా రైనను కాల సరణిని బట్టి నవ్య సాహిత్య ప్రక్రియలను కూడ చేపట్టి వానియందు సంప్రదాయములోని విశిష్టతను చొప్పించిరి. వీరికి సమకాలీనులుగా నీ కోవకు చెందిన ప్రముఖులలో జాషువా, తుమ్మల సీతారామమూర్తి, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, జంధ్యాల పాపయ్య శాస్త్రి, మొదలైనవారు కలరు. ఈ సంప్రదాయ సాహిత్యము జాతీయోద్యమ ప్రభావముతో నవ్యతను సంతరించుకొనుటచే దీనిని 'నవ్య సంప్రదాయ' మార్గముగ విమర్శకులు భావించిరి.

మహా కవిత్వ దీక్షా విధి నంది, రసము చిప్పిలు కవిత్వము వెలయించినవాడు మహాకవి యగును. తాను పట్టిన మార్గమున పారము ముట్టి ఇతరులకు ఒరవడి యైన వాడు మహాకవి యగును. ఒక మహా సంప్రదాయమునకు ప్రతినిధియై దానిని తరముల తరబడి పొందుట కందించినవాడు మహాకవి యగును. కాల ప్రవాహమును తనవైపు త్రిప్పుకొనగలిగినవాడు మహాకవి యగును. క్రాంత దర్శియై కవిత్వము ద్వారా సమాజమును నడిపింప జాలినవాడు మహాకవి యగును. విశ్వనాథవా రిటువంటి బహు మహా గుణ సమాహార స్వరూపము. కావుననే వారు మహా కవిగా నధిక ఖ్యాతి నార్జించుటతోపాటు కవిసమ్రాట్టు బిరుదము నన్వర్థము గావించుకొనిరి.

విశ్వనాథవారు తమ సాహిత్య సృజనకు ప్రధాన హేతువులుగా మూడు విషయములను జెప్పిరి. అవి: ఒకటి - ఇతరులు తమ కొక కావ్యము వ్రాసిపెట్టు మని అర్థించుట. రెండు - అంతః ప్రబోధము. మూడు - పేరుకొన్న భావజాలమున కొక రూప మీయవలెనని సంకల్పించుకొనుట. (సత్యనారాయణ, విశ్వనాథ 1972: 3-3) వారు ప్రారంభ దశలో జాతీయోద్యమ, భావకవితోద్యమముల ప్రభావముచే రచనలు చేసిరి. ఎంతటి ప్రతిభా సంపన్ను లైనను కాల ప్రవాహమునందు మునుగక తప్పదు కదా! అనంతరము భిన్న ప్రక్రియలను చేపట్టియు రచన లన్నింటిని అనంతము, అవిచ్ఛిన్నము అయిన భారతీయ ధర్మ మనెడి సూత్రముచే బద్ధము కావించిరి. జనులకు జీవమునిచ్చు మహానదులను చైతన్య స్రవంతులుగాను, పూర్వపు టౌన్నత్యమును జ్ఞప్తికి దెచ్చు రాజులను, చారిత్రక ప్రదేశములను పరాక్రమ జ్యోతులుగాను వర్ణించి దేశభక్తిని రేకెత్తించెడి రచనలు చేయు టానాడు వ్యాప్తి నందినది. వీ రటువంటి జాతీయోద్యమ భావములచే ప్రభావితులై 'ఆంధ్ర పౌరుషము', 'ఆంధ్ర ప్రశస్తి' వంటి ఖండ కావ్యములు వెలయించిరి. పూర్వాంధ్ర భూపతుల పరాక్ర మాతిశయములను, ప్రాచీన వైభవ

ప్రాభవములను కీర్తించి ఆంధ్రులను దేశాభిమానులుగా తీర్చి దిద్దుటయం దానాడు పోటి పడిన ఉత్తమ కావ్య శ్రేణిలోని వీ కావ్యములు. 'గోదావరీ పావనోదార వాః పూర మఖిల భారతము మాదన్ననాడు' అని జాతీయ గీతము వలె ఆలపించుకోదగిన పద్యము లెన్నింటికో వీరి దేశభక్తి కావ్యములు కాణాచి.

ఆత్మాశ్రయ కవిత్వ మొక ఉద్యమము వలె వచ్చిన కాలమున వీరు వెలువరించిన భావ కవితా ఖండిక లసంఖ్యాకములు. 'గిరి కుమారుని ప్రేమ గీతాల'నెడి కావ్యమున ప్రణయ, వియోగములు హృదయంగమముగ ఆత్మాశ్రయ ధోరణిలో వర్ణింపబడినవి. కులాంగనానిష్ఠమగు వారి ప్రేమ భావముల చిత్రీకరణ మిందు కానగును. ఎట్టి రసోచిత భావములకైనను కవితా శిల్పము కల్పించునపుడు ధర్మాభినివేశమైన ఆదర్శము వీడనిది వీరి లేఖిని యనుట కీ కావ్యము చక్కని నిదర్శనము. 'కొండవీటి పొగ మబ్బుల'నెడి ఖండ కావ్యమున వీరి భావౌన్నత్యము విశద మగును. 'వరలక్ష్మీ త్రిశతి' అను వియోగ కావ్యము వీరి భావ నిశితత్వమునకు తార్కాణమై కరుణ రసోత్కర్షముతో నొప్పుచున్నది.

ఆంధ్ర దేశమున పరాక్రమమునకును, పట్టుదలకును వెలమ వీరులు పెట్టినది పేరు. పలనాటి వీర గాథ దేశి భారతమని వాసి గాంచినది. అది వీర రసోచితముగ 'చంద్రవంక యుద్ధమున' వర్ణితము. 'యమ దంష్ట్రిక' యను ఖండ కావ్యము మరొక వీర రస గుళిక. విజయనగర వీరుల యుద్ధకౌశలము, రాజభక్తి యిందు వర్ణితములైనవి.

విశ్వనాథ వారాశువుగా 'వేణీ భంగము'ను ఖండ కావ్యమును రచించిరి. ధృతరాష్ట్రుని సభలో ధర్మజుడు జూదమున సర్వమును ఓడిపోవ, దుర్యోధనుడు ద్రౌపదిని రావించి ఆమె వలువ లొలువ నియమించుట, శ్రీకృష్ణుడామె మాన సంరక్షణ గావించుట యిందలి కథ. ఇది చిరు కబ్బ మయ్యు రసపోషణమునందును, దృశ్యమును కన్నులకు కట్టినట్లు వర్ణించుట యందును భారతమునకు దీసిపోవునది కాదు. కావ్యమున శాస్త్రవిషయములను కూడ సమన్వయపరచి రచించుట వలన కావ్య గౌరవము ఇనుమడించును. విశ్వనాథ వారు కావ్య నిర్మాణమునందు అనుషంగికముగా గ్రహించిన శాస్త్రములలో సంగీత మొకటి. సంగీతము సర్వులకు త్వరితగతిని బ్రహ్మానందము కలిగించి మోక్ష పదవి నందించు ననునది విదిత మైన విషయము. విశ్వనాథవారు తమ రామ భక్తికి సంగీతమును జోడించి, త్యాగ బ్రహ్మము నాలంబనముగా స్వీకరించి 'కేదార గౌళ' యను నొక ఖండ కావ్యమును వెలయించిరి. ''వారి ఖండ కావ్యములు కొన్ని ప్రకృతి రహస్య గర్భితములు, కొన్ని భక్తి నిర్భరములు, కొన్ని వ్యంగ్య హేళనా పూరితములు, కొన్ని స్వీయ కవితా శిల్ప ప్రదర్శకములు.'' (వేంకటావధాని, దివాకర్ల 1983:30)

వీరి 'కిన్నెర సాని పాటలు' ప్రకృతి వర్ణనాత్మక మైన గేయ కావ్యము. ఇందు

అమహత్తు లయిన కిన్నెర, గోదావరి, సముద్రము, కొండ అనునవి మహతీ మహత్తులుగా వర్ణింపబడినవి. ఈ కావ్యమున నదీ సముద్రములకు నాయికా నాయక త్వారోపణము సౌందర్యావహమై యున్నది. మహాపతివ్రత, ఉద్విగ్న హృదయ అయిన కిన్నెర, భర్త కౌగిట కరిగి వాగు కాగా భర్త దుఃఖించి కొండ యగుట ఇందలి ఇతివృత్తము. కిన్నెర ప్రవాహపు నడకలు, త్రుళ్ళింతలు మొదలగునవి గేయ కావ్య రచనమునకెంతయో సొగసు కూర్చినవి. భట్టు మూర్తి వసు చరిత్ర కథను తలపించు అద్భుత రచన మిది. పాత్రగత మైన వివిధ మనో భావములకు ప్రకృతి ప్రతిస్పందించిన దని వర్ణించుట, కావ్యమునకు రామణీయకమును కూర్చునట్టి యంశము. ఈ గేయ కావ్యము నందు దీనిని కిన్నెరను వర్ణించు సందర్భమున గాంచనగును. మానవ పాత్ర గతమైన మనోభావములను, చేష్టలను నదియందు వర్ణించి వాగు నడవడికిని మానవ ప్రకృతికిని మనోహరముగ అభేదమును స్థాపించిరి. తద్ద్వారా రసపోషణము నందీ కావ్యము నిరుపమాన మగుచున్నది. ప్రకృతిని నిశితముగా పరిశీలించి దాని తత్త్వమును కావ్యము నందు యథోచితముగ నావిష్కరించుట మహాకవి లక్షణములలో నొకటి. భావ కవులలో నీలక్షణమే ప్రాధాన్యము వహించినది. విశ్వనాథవారీ యంశమును కిన్నెరసాని పాటలలో పుష్కలముగ ప్రదర్శించిరి. 'కోకిలమ్మ పెండ్లి' యను గేయ కావ్యము విశ్వనాథవారి దేశి కవితా వైదుష్యమున కద్దము పట్టుచున్నది. ఈ కావ్యమున చిలుక సాంస్కృతిక వాక్కునకు, కోకిలమ్మ తెలుగు పలుకునకు ప్రతీకలుగా వీరు ప్రదర్శించిన తీరు చమత్కార భరితము. ప్రకృతి వర్ణనతోపాటు ఊహాతీతమైన భావనతో నీ రెండు కావ్యములు నొక విశిష్టతను సంతరించుకొనినవి.

విశ్వనాథవారి హృదయము ప్రగాఢ మైన భక్తి భావముతోను, నిరుపమాన మైన కవితా కౌశలముతోను, భారతీయ ధర్మ నిబద్ధతతోను ముప్పిరిగొని మహాకావ్యముల రూపమున ప్రతిఫలించినది. ఈ మూడు విషయములు వారి కావ్యములందు పుష్కలముగా నుండును. ఒక్కొక్క కావ్యమునం దొక్కొక్క అంశము అధికముగా గోచరించుటయు గలదు. 'మా స్వామి', 'విశ్వనాథ మధ్యాక్కరలు', 'రామాయణ కల్పవృక్షము' మొదలగు కావ్యములు, వారి అద్భుత కవిత్వ తత్త్వము నావిష్కరించుటతో పాటు భక్తి భావ మకరందమును కూడ మధురముగ వెదజల్లు చున్నవి.

> శా॥ శ్రీవాణీ గిరిజాధి నాథుల జగత్స్థిత్యుద్భవాంతః క్రియా
> ప్రావీణ్యాత్ముల౯ దత్త దాచరణ భారం బూనగా జేసి నా
> నా విశ్వంబు లనంత గోళము లనంతాకాశ సంభ్రాంతముల్
> గా విశ్వాత్మ! త్వదాత్మనీనములుగా౯ గావింతు విశ్వేశ్వరా!
>
> (మాస్వామి శతకము)

పరబ్రహ్మము నిరాకారము, నిర్గుణము, నిరుపమానము. అది తేజోమయమై విశ్వ మంతయు నిండి యుండును. దాని ననుసరించియే త్రిమూర్తులు జగత్సృష్టి స్థితి లయముల నాచరించుచుందురు. ఈ భావములను విశ్వనాథవారు విశ్వేశ్వరుని యం దారోపించి, పై పద్యమున చెప్పిరి. ఇటువంటి భక్తితత్త్వముల నిరూపణము వారి కావ్యములందు నిండుగా గోచరించును. తమ ఇలువేల్పును నుతించుచు మాస్వామి శతకమును, పదిమంది దైవములను గూర్చి మధ్యాక్కర పద్యములో పది శతకములను వ్రాసిరి. ఈ పది శతకములే 'విశ్వనాథ మధ్యాక్కఱ' లైనవి. ఆంధ్రమున ఆత్మాశ్రయ కవిత్వమునకు శతక సారస్వత మాటపట్టు. భగవంతుని నాలంబనముగా జేసికొని వా రనూహ్యమైన భక్తి భావములనే గాక సాంఘిక విషయములపై ప్రతిస్పందనను కూడ ఈ శతకములలో ప్రకటించిరి. పదిమంది దైవములను స్తోత్రము చేయుచు వారు, ప్రాపంచిక విధులను నిర్వర్తించుచునే ఆత్మ సాక్షాత్కారమునకై యత్నింప వలెనుచు స్వానుభవములను వెల్లడి చేసిరి. ఈ శతకములు వారి భక్తి భావమునకును, తత్త్వ జ్ఞానమునకును, ఆత్మ సాధన ప్రవృత్తికిని, లోక పరిశీలనమునకును, ఉపనిష త్సిద్ధాంత ప్రతిపాదనమునకును, కవితా కౌశలమునకును నెలవులు. శతకములందు శక్తిమంతమైన భాష, ఉత్కృష్టమైన భావము, పటిష్ఠమైన కల్పనము గోచరించును.

శ్రీకృష్ణుని బాల్య క్రీడలతోపాటు గోపికల మధుర భక్తి నెపమున తమ అమేయ మైన భక్తిని ప్రదర్శించుచు వారు 'గోపికా గీతము' లను కావ్యమును వెలయించిరి. తత్త్వ జ్ఞానమును కవితా భావములతో మేళవించి వారు రచించిన కావ్యము 'భ్రమర గీతములు'. ఇందు వారు శృంగార నాయికల చక్షుఃప్రీతి, మనస్సంగమ మిత్యాది ద్వాద శావస్థలను వర్ణించిన తీరు మిక్కిలి ఆశ్చర్యానందములను కలిగించును. గోపికలకు కృష్ణుని యెడ గల శృంగారము, రసము కాదు. కావున విశ్వనాథవారు పంద్రెండవ దైన మరణావస్థను ''ఇది మృతి కాని యట్టి మృతి యెంతయుఁ జేసి యదూ ద్వహుండు తా, మొదగిన నిత్యమైన విరహోత్సవ మిచ్చు.....'' అని కడు మనోహరముగా వర్ణించిరి.

ఆత్మాశ్రయ కవితా మార్గము హృద్గతమైన నిశిత భావ ప్రకటనమునకు చక్కని రాచబాట. విశ్వనాథవారు విషాదమును ప్రకటించుచు 'వరలక్ష్మీత్రిశతి' అను విషాద కావ్యమును రచించిరి. ఇది కాల్పనిక కవిత్వములోని స్మృతికావ్య (ఎలిజీ) ప్రక్రియకు చెందినది. ఈ కావ్యము పాఠకులకు కరుణ రస పరిపోషణమున అవధులు లేని అనుభూతి కలిగించును. ఈ కావ్యము తమను మహాకవిగా చేసిన దని విశ్వనాథవారే పేర్కొనిరి. (వివుర్శిని 1977:62) వీరు విప్రయోగ శృంగార ప్రధానమైన 'శశిదూత' మను కావ్యమును వెలయించిరి. ఈ కావ్యము భావౌన్నత్య రసపోషణము

నందును, ప్రకృతి వర్ణనము నందును కాళిదాసు మేఘ సందేశమును తలపించును. 'విశ్వనాథ పంచశతి' అనునది ఏ కథా సూత్రములేక దేని కదియే ప్రత్యేకార్థము గల ఐదు వందల పద్యము లున్న కావ్యము. ఈ ముక్తక రచనలోని ప్రతి పద్యము విమర్శకో వ్యంగ్యమునకో చమత్కారమునకో అధిక్షేపమునకో నెలవై పాఠకునికి ఆనందము కలిగింపక మానదు. ''...వ్యంగ్యముల్ ధ్వనులును వట్టి, వర్ణనలు కొన్ని రమణీయ వాక్యసరణి, బహు విధంబుల వ్రాసెదఁ బంచశతి స, తార్తి హరుని విశ్వేశ్వరు నంజలించి." అని విశ్వనాథవారే ఈ కావ్యారంభమున తెలిపిరి. ఈ కావ్యములో వీరు ప్రకటించిన చమత్కార భావమున కీ క్రింది పద్య మొక చక్కని ఉదాహరణము

తే॥ వెస స్వరాజ్యము వచ్చిన పిదపఁ గూడ, సాగి యింగ్లీషు చదువునే చదువునట్లు
అంగనామణి పెండిలి యాడి కూడ, ప్రాత చుట్టఱికమ్ము రాపాడు చుండె.

ఇది. ప్రస్తుత విద్యా విధానము ద్వారా ఇంగ్లీషు పట్ల మనలో కొనసాగుచున్న దాస్య భావమును ఎత్తి చూపుచున్నది. ఈ కావ్యమందలి పద్యములు కొన్ని ధ్వనిమంతము లై, చమత్కార గర్భితము లై గాథా సప్తశతిని తలపించును.

విశ్వనాథవారి 'శశిదూత' మనెడి లఘు కావ్యము రస ప్రాధాన్యము నందును, కవితా కౌశలము నందును కాళిదాసుని మేఘసందేశమును తలపించును. సాధారణముగా మహాకవులు ఏదో సందర్భమున ఋతువులను వర్ణించగా విశ్వనాథవారు 'ఋతు సంహార' మను ప్రత్యేక కావ్యమునే రచించిరి. ఇందు వారు ప్రదర్శించిన లోకజ్ఞత, శాస్త్ర పరిజ్ఞానము, ప్రకృతి పరిశీలనము మొదలగు గుణములు నానృతో దర్శనీయములు. లోకోత్తర వర్ణనా నైపుణ్యమున కీ కావ్యము కాణాచి.

విశ్వనాథ వారి నిరుపమాన దేశభక్తి ప్రస్ఫుటమైన కావ్యము 'ఝాన్సీ రాణి.' ఇది వీరనారి ఝాన్సీరాణి కథ ఆధారముగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమును వర్ణించు చారిత్రక కావ్యము.

ఆ॥ శత్రుజనుని వలనఁ జావ దెప్పుడు గాని, యొక్క జాతి ధర్మ ముర్వి యందు
మనుజ పశు వొకండు తన ధర్మము త్యజించి, శత్రుఁ జేరినపుడు చచ్చునట్లు.
కం॥ తన దేశము తన ధర్మము, తన విద్యయు వదలి యెవడు తాఁ జేరుఁ బరా
వని విద్యా ధర్మము లా, జను డొక్కఁడు చచ్చు రెండు చావులు ధరణిన్.

ఝాన్సీరాణి కావ్యములోని ఈ రెండు పద్యములు వారి జీవితాదర్శమును, వారిచ్చు సందేశమును ప్రకటించుచున్నవి. స్వధర్మమును విడచి పరధర్మమును

స్వీకరించుట జాతి పతనమునకు హేతువనియు, అటువంటి జాతి ద్రోహికి పర ధర్మాచరణము రెండవ చావనియు, వారిచ్చట చెప్పిన యంశమే వారి సారస్వతమెల్లెడల అంతర్వాహినిగ నుండు సందేశముగా గోచరించును. ఈ అభిప్రాయముపై వారికి గల దృఢమైన విశ్వాసమే వారి మహాకవిత్వ లక్షణమున కొక వన్నెను చేకూర్చినది. కవులలో వారి ఔన్నత్యమున కొక ప్రత్యేకతను సంతరించిపెట్టినది. వీరరస ప్రధాన మైన ఈ కావ్యమున కరు ణాద్భుత బీభత్సములు కూడ హృదయము చలించు నట్లుగ పోషింపబడినవి. వీరి 'శివార్పణ'మను మరొక కావ్యమున ధర్మవీర మంగిరసము. ఇందు శివాజీ కథ ఆనంద జనకముగా వర్ణింపబడినది.

విశ్వనాథవారు రచించిన 'శ్రీవల్లీ దేవసేనా విజయ'మను నామాంతరముగల 'కుమారాభ్యుదయ'మను ప్రబంధము అద్భుత కథా కల్పనమునకును తదనుగుణ మైన వర్ణనములకును, రెండింటికి మించిన రస పోషణకును తావల మైన కావ్యము. భారతీయ సంప్రదాయ మహత్వమును స్థాపించు టీ కావ్యము నందలి ధ్వని యని చెప్పవచ్చును. 'ప్రద్యుమ్నోదయ'మను మరొక ప్రబంధము పెద్దన తిమ్మనలను తలపునకు తెచ్చును. ఇందలి ఇతివృత్తము, కథా నిర్వహణము, సన్నివేశ కల్పనము అనునవి పఠితల కానందాశ్చర్యములను కలిగింపక మానవు. ఈ కావ్యమున వీరు నిర్వహించిన విశిష్టాద్వైత వ్యూహములు, వాని తత్త్వమును వివరించిన తీరు, వారి యసాధారణ ప్రతిభా పాండిత్యములను చెప్పక చెప్పుచున్నవి.

విశ్వనాథ వారు రచించిన 'రురు చరిత్రము' వారి ప్రబంధములలో విశిష్టమైనది. ఇందలి శైలి విలక్షణమైనది. కల్పనలు నిరుపమానములు. వా రిందు ప్రతిపాదించిన గ్రహసంచార ఫలము, యోగసిద్ధాంతము అను రెండు విషయములు ఈ కావ్యౌన్నత్యమునకు హేతువులు. ప్రబంధోచితమైన వర్ణనలచేత, రచనా సంవిధానము చేత, పాత్ర చిత్రణముచేత నీ కావ్యము తెలుగులోని ఉత్తమ ప్రబంధములలో నొకటి యగుచున్నది. వారీ కావ్యమున తమ పాండిత్య ప్రౌఢిమను పలు తావులందు ప్రకటించిరి. రురుచరిత్రలో ''పద్య రచన కూడా చాలా క్రొత్త మార్గములలో చేసితిని. రామాయణములోని పద్య రచనకంటే కూడా పద్య రచన కొన్ని కొన్ని చోట్ల చాలా విచిత్రముగా చేసితిని.'' అని వారే (సత్యనారాయణ1972:3.3) ప్రకటించుటవలన ఈ కావ్య వైశిష్ట్యమును గూర్చి వేరుగా చెప్ప నక్కరలేదు.

శ్రీమద్రామాయణ కల్ప వృక్షము విశ్వనాథ వారి కవిత్వ వ్యక్తిత్వమునకు మణి దర్పణము వంటిది. భారతీయ కావ్య శిల్ప సౌందర్యమున కిది కాణాచి. ఈ కావ్యము నుగ్గడించుచు దివాకర్లవారు వ్రాసిన ఈ క్రింది వాక్యములు దాని ఔన్నత్యమును ప్రకటించుచున్నవి. ''విశ్వనాథ రామాయణమును కల్పవృక్ష మన్నట్లే శిల్ప వృక్ష

మనియు చెప్ప నగును. కల్ప వృక్ష మడిగెడి వారికి కోరిన దెల్ల నిచ్చును. కావ్య దృష్టితో చదువు వారికి రామాయణము రస, రీతి, భావ, ధ్వని చమత్కారముల వలె భక్తితో పఠించువారికి మోక్షమును కూడ కరతలామలకము చేయును. శిల్పదృష్టి కలవారి కిందలి కవితాంగము లన్నింట నుదాత్తమైన శిల్ప రామణీయకము గోచరించును. ఈ శిల్ప వృక్షమునకు పద్యము లాకులు, రసములు ఫల పుష్పములు, ఖండములు కొమ్మలు, కథ కాండము. వీనినే కథా కథన శిల్పము, వర్ణన శిల్పము, రస పాత్ర పోషణ శిల్పము, రీతి శిల్పము, అను పేర్లతో పేర్కొన వచ్చును.''(వేంకటావధాని. 1983:230) ఇందలి కథా కథనము, సంభాషణములు, రస పోషణము, వర్ణనలు మొదలగునవి వారి ప్రతిభను వేనోళ్ళ చాటుచున్నవి. ఈ కావ్యము వారికి జ్ఞానపీఠ బహువమాన పురస్కారము లభింపజేయుట చేత నిది వారి రచనలలో తలమానికమువంటి దగుచున్నది. ఈ కావ్యమున అహల్య శ్రీరామునకు కావించిన స్వాగత మపూర్వ మైనట్టిది. ఈ క్రింది పద్యమున శ్రీరాముడు సమీపించు నపుడు శిల పొందు శాప విముక్తి వర్ణనము విశ్వనాథ వారి ప్రతిభకు ప్రబల ఉదాహరణము.

సీ॥ ప్రభు మేనిపై గాలి పై వచ్చి నంతనే, పాషాణ మొకటికి స్పర్శ వచ్చె
ప్రభు కాలి సవ్వడి ప్రాంత మ్మైనంతనే, శిల కొక్క దానికిఁ జెవులు గలిగె
ప్రభు మేని నెత్తావి పరిమళించిన తోన, యశ్మంబు ఘ్రాణేంద్రియంబుఁ జెందె
ప్రభు నీల రత్న తోరణ మంజు లాంగంబు, గనవచ్చి ఱాతికిఁ గనులు గలిగె
ఆ॥ ఆ ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక, రించినంత నుపల హృదయ వీథి
నుపనిష ద్వితాన మొలికి శ్రీరామ భ, ద్రాభి రామమూర్తి యగుచుఁ దోచె.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల.5- 54)

శ్రీరాముని మేనిపై గాలి వచ్చుట, కాలి సవ్వడి ప్రాంత మగుట, మేని నెత్తావి పరిమళించుట, దేహదర్శన మగుట, ఆతిథ్య స్వీకారము అనువాని వలన క్రమముగా రాతి యందు స్పర్శ, చెవులు, ముక్కు, కనులు, మనసు అనునవి కలిగినట్లుగా వర్ణించుట, వారి నిరుపమాన కవితా శిల్పమునకు నిదర్శనము.

కవిత్వ మల్లుట పలువురకు సాధ్య మగు నేమో కాని కవితా శిల్ప నిర్మాణము గావించుట యొక్క మహాకవికే సాధ్యము. శిల్ప రామణీయకముచే నొప్పు కావ్య కళా సంభరిత మగు మహాకావ్యము సహృదయుని మనస్సును, అటనుండి ఆత్మను చేరి అంతరాంతరములను జాగృతము చేయును. బాహ్య జగత్తును మరపింప జేయు నొక ఆనంద సమాధిని కల్పించును. అనగా హృదయ గత సాత్త్విక భావమును చైతన్య

వంతము కావించి ఆ వ్యక్తిని లౌకిక జగత్తున కతీత మైన ఆనంద జగత్తునకు గొంపోవును. అదియే బ్రహ్మానంద సబ్రహ్మచారి యైన కావ్యానందము. ఇది ఇతివృత్త నిర్మాణము,పాత్ర పోషణము, రస నిర్వహణము, ఔచిత్య పాలనము ఇత్యాది కావ్యగ తానేక విషయ సంపుటీకరణముచే లభ్యమగును. దాని నాస్వాదించుట సహృదయ హృదయ సంస్కారమును బట్టి యుండును. ఇటువంటి కావ్య కల్పన యందు ఈనాడు ప్రథమ గణ్యుడు 'విశ్వనాథ' యని కల్పవృక్ష ముద్ఘోషించుచున్నది. ఇట్టి ఉత్తమ కావ్య లక్షణముల కీ క్రింది సన్నివేశ వర్ణన మొక దృష్టాంతము.

శ్రీరాముడు తామస రూప యగు తాటకను సంహరించి, రజో గుణ చిహ్నిత యైన అహల్య నుద్ధరించి, సత్వ గుణ భూషితయైన జానకిని చేపట్ట సంకల్పించెను. జనక సభా భవన మందలి ప్రాగ్దిశా సౌధంబు పై యంతస్థున, నంతఃపుర స్త్రీల కదలిక గుర్తు పట్టి తల యెత్తిన రామచంద్రునకు -

సీ॥ ఇదమిత్థ మని న్నిర్ణయింపగా రాని దే, కోర్కియో రూపుగైకొన్నయట్లు
జన్మ జన్మాంతర సంగతమ్మైన యా, శా బలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటకి వచ్చి ముగ్ధాకార, మెనయించి దర్శన మిచ్చినట్లు
తన సృష్టిలోని యుత్తమ భావ మానంద, ముగఁబొంగి బింబమై పొడిచినట్టు
తే॥ లల యరుంధతియును నహల్యయును గోస, లాత్మజాతయు మువ్వురి యాననముల
కన్నను బవిత్ర మగుచు శృంగార భావ, మొడిసిపట్టిన ముఖ చంద్రుఁ డొకడు తోఁచె.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల. ధనుస్సు. 299)

ఇది దశరథాత్మజునకు దర్శనమైన జనకాత్మజ వర్ణనము. ఆయన కామె న్నిర్ణయింప జాలని ఏదో భావము యొక్క రూప మైనట్లు జన్మ జన్మాంతరముల నుండి అవధికి చేరిన దృఢమైన యాశ యైనట్లు, తన ప్రాణమే బయటకు వచ్చి ముగ్ధాకారము దాల్చి దర్శన మిచ్చినట్లు, తన పుట్టుకకు ధ్యేయ మైన ఉత్తమ భావము ఆనందముగా పెల్లుబికి బింబాకృతి దాల్చి ఆకసమునం దుదయించి నట్లు తోచినది. అంతే గాక ఆ ముఖ బింబము అరుంధతి అహల్య కౌసల్యల ఆననములకంటె పవిత్రమై ఒప్పినదట. ఇచట సీతారాములు లక్ష్మీనారాయణులగుటను పై యంశముతో పాటు ఆమెయం దాయనకు శృంగార భావ ముదయించిన దని వర్ణించుటవలన కూడ వ్యక్త మగుచున్నది. సీతాపతికి రామావతారమును సంపూర్ణత్వము కావించుకొను భావమును, ఆమె సాక్షాత్తు లక్ష్మి యగుటయు, వారిరువురు పరమాత్మ జీవాత్మల ప్రతీక లగుటయు, రామావతార

ధ్యేయమైన ధర్మ సంస్థాపనమును, జానకి పవిత్రతను మించిన పరమ పవిత్ర రూప మగుటయు నిందు ధ్వనించుచున్నవి.

మహాకవి వాల్మీకి ముని విరచిత శ్రీమద్రామాయణము పలువురచే పలు భాషల పలు విధముల అనూదితమై యుండుటచే ఆ కథనే గైకొని సహృదయులను రంజింపజేయు రచన చేయుట అంత సామాన్యమైన విషయము కాదు. ఇట్టి కావ్య నిర్మాణ రహస్యముల నెరిగిన విశ్వనాథవారు శబ్ద ప్రయోగము, వాక్య నిర్మాణము, లోకోక్తి ప్రదర్శనము, కథా కథన పద్ధతి మొదలగు వాని యందు సౌందర్యోపేతమైన విలక్షణతలను పాటించి అద్వైతామృత భాండమువలె కల్పవృక్షమును తీర్చిదిద్దిరి.

'నాది వ్యవహార భాష', 'రసము పుట్టింపఁగ వ్యవహారము నెఱుంగఁజనును' అని విశ్వనాథవారు లోక వ్యవహారమునకు ప్రాధాన్యమిచ్చుట, కల్పవృక్ష నిర్మాణ రహస్యములం దొకటి. శ్రీరాముడు శివధనుర్భంగము కావించిన తరువాత, దశరథాదులు జనకుని కొలువునకు వచ్చి సీతారాముల కళ్యాణము జరిపించి, వారిని అయోధ్యాపురమునకు కొని తెత్తురు. అప్పటికి రామునికి సుమారు పండ్రెండేండ్లు. పదునెన్మిదవ యేడునుండి దాంపత్య జీవనమునకు సంకల్పింపబడినది. ఈ నడుమ నారేండ్లు సీతారాముల వర్తనము లోక సహజముగా నీ విధమున వర్ణింపబడినది.

సీ॥ అదుగొ రాముఁడు వచ్చు ననునంతలో దూసి, కోలువెట్టును చువ్వవోలె సీత
యా రామచంద్రుడే యరుగుదెంచిన లేచి, నిలుచుండుఁ బుత్రిక వలెను సీత
యెదురైన నతఁడు తానె చటేఁ ద్రపాహత, యగు వార్షుక సరస్సు నట్లు సీత
ఉల్లి పోయెడు రాము మొల్లంపుఁ జూపుల, గాంచు జాబిలి వెల్గు కరణి సీత
తే॥ కడు సమీపంబుగా సాగి కడచు రాము, నింత దగ్గరతనము సహించు సీత
యిట్టులే పోనుపోను దా నెదురుచూచు, వంచి తల సీత పతి పల్కరించునంచు.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల. కళ్యాణ.161)

ఇందారేండ్ల స్థితిని కవి లోక వ్యవహారమునుండి గ్రహించి క్రమముగా ప్రదర్శించుచున్నారు. ఆదిలో, అదుగో రాముడు వచ్చుచున్నా డనగా సీత చువ్వ వలె పరుగెత్తి పోవును. రెండవ సంవత్సరము, రాముడు వచ్చెనని తెలియగా లేచి నిలబడు చుండును. మూడవ యేడు, రాము డెదురుపడగా సీత సిగ్గు చెందును. నాల్గవ యేడు, కొంత దూరముగా పోవుచున్న రాముని సీతయే చూచుచుండును. ఐదవ సంవత్సరములో సమీపమున పోవుచున్న రాముని దగ్గరతనమును సీత సహించును.

ఆరవ యేడు, పతి పల్కరించు నేమో యని ఎదురు చూచును. ఈ విధముగా సీతా రాముల సంసార జీవితమునకు పూర్వ మందలి శృంగారము కడు మనోజ్ఞముగా పై పద్యమున వర్ణింపబడినది. ఇందలి మనోహరత్వమునకు కవి లోకజ్ఞతయే హేతువు.

అశోక వనమును నాశనము చేయు మారుతిని గాంచి, భయ కంపితులైన వన పాలురు రావణుని చేరి ఆ విషయము విన్నవించు సందర్భమున -

తే॥ ఓరి బాబోయి వాఁడు మహోగ్ర భుజగ,మఖిల కింకర సైన్యంబు నపహరించె
ననిన విన లేదు వారు తామరిగి వంద, మంది ప్రాసాద రక్షలో మడిసిరి ప్రభు.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. సుందర. దివా. 84)

అని పల్కుటలోని భావస్ఫోరక మైన వ్యావహారిక సరణి పాఠకులచే నోహోయని అనిపింపక మానదు.

ఇవి స్థూలముగా ప్రదర్శించిన ఉదాహరణలే కాని కావ్యమం దే సన్నివేశమును గాంచినను ఇటువంటి లోక వ్యవహారము ననుసరించెడి రచనా పాటవము కనబడును. ఇట్టి శైలి రసానుకూలమై 'మఱల నిదేల రామాయణం'బను ప్రశ్న పొడచూపుట కవకాశ మిచ్చుట లేదు. విశ్వనాథవారి కవితా కళకు, దార్శనిక ప్రతిభకు, తాత్త్విక సందేశమునకు ఈ కావ్యము ప్రతీక. వారే కల్పవృక్ష రహస్యములను వెలయించుట దాని వైశిష్ట్యమునకు నిదర్శనము. ఈ విధముగా నీ 'రామాయణ కల్పవృక్షము' కావ్య రసామృతమును గ్రోలజాలు సహృదయులకు కల్పవృక్షమే అగుచున్నది.

శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహా కావ్యాంతర్గత తత్త్వము నావిష్కరించుచు వారు 'నా రాముడు' అను మరొక కావ్యమును సవ్యాఖ్యానముగ రచించిరి. ఇది కల్పవృక్షమునకు భాష్యము వంటిది. శ్రీరాముని పరబ్రహ్మ తత్త్వము, కల్పవృక్షములోని సౌందర్య రహస్యములు 'నా రాముడు'నం దావిష్కరింపబడినవి.

ఈ విధముగా విశ్వనాథవారు మహాకావ్య శిల్ప నిర్మాణము నందును తదనుగుణ మైన రసపోషణ, శైలీ నిర్వహణ, పాత్రచిత్రణాదులయందును, మహార్థములతోను తాత్త్విక రహస్యములతోను కూడిన కావ్య కల్పన మందును కృతకృత్యులై నన్నయ, తిక్కనాది మహా కవుల సరసన నిలిచిరి.

# 4. తత్త్వవేత్త విశ్వనాథ

ఆ॥ అచ్చమైన యమృత మమరులు త్రావి నా, రోయి! దానికే నసూయ పడను
పరమమౌనియైన వాల్మీకికృత రామ, సత్కథాసుధారసంబుఁ ద్రావి.
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము. అవతారిక 32)

ఇది విశ్వనాథవారి భక్తి భావ సాగరమునం దొక తరంగము.

నాలోన నెంతగాఁ ద్రవ్వుకొన్నఁ బినాకి! కన్పడవు
ఆలోక రమణీయ శారదాంభోధరా స్నిగ్ధ మూర్తి
నీలోనఁ ద్రవ్వి నీలోఁతు తెలియుగానేర, నిన్నెంచి
సోలిపోఁజాల శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (శ్రీగిరి శతకము 3)

ఇది విశ్వనాథవారి తాత్త్విక భావ జ్యోతిలో నొక వెలుగు రేఖ. విశ్వనాథ ఎంత భావుకుడో అంత కవి. ఎంత కవియో అంత భక్తుడు. ఎంత భక్తుడో అంత దార్శనికుడు మరియు తాత్త్వికుడు. భగవద్గీతయందు శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన ట్లు[1] వారు, ఉన్నతాత్ములై కర్మ, ధ్యాన, భక్తి, జ్ఞాన, యోగములను నాచరించిన ముముక్షువు. ఈ విషయము వారి సాహిత్య జీవితమును పరిశీలించిన స్పష్టము కాగలదు. వారి మధ్యాక్కర శతకములందు సంపూర్ణముగ నీ విషయమే గోచర మగును.

కవియైన వాడు భక్తుడు కావచ్చును కాకపోవచ్చును. నిజమునకు భక్తు డగుటకును, కవి యగుటకును సంబంధము లేదు. నిరంతరము ఈశ్వ రార్చన మొనర్చుచు ఆత్మ పరమాత్మల తాదాత్మ్యముచే నిరతిశ యానందము నందువాడు భక్తుడు. ద్రష్టయై తన అనుభూతిని చమత్కా రాపాదకముగా వెల్లడించుచు భావుకుల కానందము నందించువాడు కవి. కాగా భక్తునిది 'లోచూపు', కవిది 'వెలిచూపు'.

---

[1] మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తస్సంగ వర్జితః
నిర్వైరస్సర్వ భూతేషు యస్సమామేతి పాండవ! (భగవద్గీత 11-55)
(అర్జునా! ఎవడు నాకొరకే కర్మలను చేయునో నన్నే పరమ ప్రాప్యముగా నమ్మియుండునో, నాయందే భక్తి కలిగి యుండునో, సమస్త దృశ్య పదార్థములందును సంగమును విడిచివేయునో సమస్త ప్రాణుల యందును ద్వేషము లేక యుండునో, అట్టివాడే నన్ను పొందుచున్నాడు.)

ఈ రెండు లక్షణములు ఏక వ్యక్తి నిష్ఠము లైనచో ఆతడు కారణ జన్ముడే. అట్టివాడు తన జీవితమును ధన్యము చేసికొనుటతో పాటు కవిత్వము ద్వారా లోకులకు కూడ మోక్ష మార్గమును సుగమము చేయును. విశ్వనాథవా రిట్టి ఉత్తమ శ్లోకులు. వారు తమ రామాయణ స్వరూపమును గురించి ఇట్లు వ్రాసిరి: ''నా తరువాత మళ్ళీ కొన్ని వందల యేండ్లకు గాని ఇట్లా వ్రాసే కవి పుట్టడు. బహు ప్రయత్నం చేసి నా జీవితానుభవాలను, సర్వస్వాన్ని పిండి రమ్యమైన కల్పనలు చేశాను. అనంతమైన పోకడలు పోయాను. శ్రీరామచంద్రుని చరణాలపై సర్వస్వము అర్పించాను. అయినా నేను ఇలా వ్రాశానా? పరమేశ్వరు డల్లా నాచేత వ్రాయించాడు. వ్రాయరా అంటే వ్రాశాను. మానేయరా అంటే మానేశాను. విశ్వసిస్తే విశ్వసించండి. లేకపోతే లేదు'' (విమర్శిని 1977 : 44). ఈ వాక్యములు వారి కవితా స్వరూపముతోపాటు, వారి అనన్య భక్తి భావమును కూడ వెల్లడి చేయుచున్నవి.

విశ్వనాథవారి భక్తి భావ మాజన్మ సిద్ధ మైనది. వీరి తండ్రి నిత్య రామ మంత్రోపాసకులు, శివ పూజాపరులు. వారి సంప్రదాయ జీవితముతో పాటు వారి దైవభక్తి, జప తప శ్శీలము, వేదాంత జ్ఞానము మొదలగు గుణము లన్నియు వీరికి అబ్బినవి. వీరుకూడ రామ,హనుమ న్మంత్రోపాసకులు. వీరు కొన్ని కోట్ల రామ హనుమ న్మంత్రములను జపించిరి. వీరి సోదరులు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు గారీ విషయములను ప్రస్తావించుచు విశ్వనాథ.వారు నిత్యము శ్రీరామ హనుమ జ్జప యజ్ఞ పరాయణులై యుండెడివా రనియు ఆ ప్రేరణ లేనిదే ఒక్క పాద మైనను వ్రాసెడి వారు కారనియు పేర్కొనిరి. (విమర్శిని 1977:313,330) విశ్వనాథవా రంతటి రామభక్తి సంపన్ను లగుటచేతనే ఆ నామ జప ప్రభావముచే వారు మహాకవి పదవి నందజాలిరి. రామ నామ ప్రభావము నిరుపమానము. సీతా రామాంజనేయ సంవాదమున శివుడు పార్వతికి రామ నామ మంత్రార్థమును వివరించి రామ నామము వలన కలుగు మాహాత్మ్యము నుగ్గడించును. శ్రీరామ మంత్రోపాసనము వలన ''ధర్మార్థులకు సర్వ ధర్మంబుల నొనగూర్చు, నర్థార్థులకుఁ జేయు నర్థములను...'' ఇత్యాది ఫలములు కలుగు ననియు, కడకా నామము నాశ్రయించిన భక్తులు ధర్మార్థ కామ మోక్షములలో దేనిని కోరిన దాని నొసంగు ననియు చెప్పి రామ నామము యొక్క మహిమ నుపన్యసించిన ట్లా కావ్యమున కలదు. (లింగమూర్తి :1-50,62,64) దీనిని బట్టి విశ్వనాథవారు రామ నామ జపముచే పవిత్రాత్ములై ఎంతటి ఔన్నత్యమును పొందిరో ఊహింప నగును. వారి కవితా ధారకును, మహాకావ్య నిర్మాణ చాతుర్యమునకును, ఆర్ష వాఙ్మయ విజ్ఞానమునకును, సంప్రదాయమును ప్రబోధించవలె ననెడి దీక్షకును, వారి రామ భక్తిమయ జీవితమే కారణ మనవలెను.

ఇచట 'భక్తి'యన నేమో తెలియవలెను. 'భజ సేవాయాం' అను ధాతువునకు భావార్థమున 'క్తిన్' ప్రత్యయము రాగా 'భక్తి' యను శబ్ద మేర్పడుచున్నది. దీనికి సేవించుట యని అర్థము. పరమేశ్వరుని గూర్చిన మానసిక వ్యాపారమును భక్తి యని స్థూలముగా చెప్పవచ్చును. ఇది ఉపాసన శబ్దముచే గూడ లోకమునందును, శాస్త్రమునందును వ్యవహారమున కలదు. ''స్వ స్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే''(వివేక చూడామణి 32) అని ఆదిశంకరులు నిర్వచించిరి. ఇచట ఒక 'స్వ' శబ్దమునకు ఆత్మ యనియు, రెండవ 'స్వ' శబ్దమునకు ఈశ్వరుడనియు నర్థము. ఆత్మయందు ఈశ్వరత్వారోపణము జేయుట భక్తి. ప్రాపంచిక విషయములందు మక్కువ కలిగి యుండుటను రాగ మందురు. అదే భావము భగవంతునియం దున్నచో భక్తి యనబడును. ''పరానురక్తిరీశ్వరే! సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా'' అని నారద భక్తి సూత్రము లందలి నిర్వచనము. ఈశ్వరునియందు ఉత్కృష్టమైన యనురాగము కలిగియుండుటే భక్తి యని దీని యర్థము. (వేంకటావధాని 1980:49)

ఈ సందర్భమున జగద్గురు శంకరాచార్య విరచిత 'శివానంద లహరి'(61)లోని ఈ క్రింది శ్లోక భావమును అనుసంధించు కొనదగును.

> అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
> సాధ్వీ నైజ విభుం లతా క్షితిరుహం సింధుస్సరి ద్వల్లభమ్
> ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం
> చేతో వృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే.

ఇటువంటి భావము నిరంతరము కలవాడు భక్తిరసానందము పొంది ముక్తి నొందును. ధ్యానము,సాధనము,పూజ,జపము మొదలగునవి భక్తుని పట్టి ఇచ్చెడి గుణములు. భగవదర్చన సాకార నిరాకా రోపాసనలచే ద్వివిధము. సాకార పరబ్రహ్మమును పుష్పములచే పూజించుచు ధూప దీప నైవేద్యాదులచే సేవించుచు హృదయమున నిలుపుకొనుచు సదా ధ్యానము చేయుట మొదటి విధానము. ఇంద్రియములను నివృత్తి మార్గమున ప్రసరింపజేసి నిర్గుణ పరబ్రహ్మ నుపాసించుచు ఆత్మ సాక్షాత్కారమును పొందుట రెండవ విధము. భగవద్గీత యందు శ్రీకృష్ణు డర్జునునకు-

> మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే
> శ్రద్ధయా పరమోపేతా స్తేమే యుక్త తమా మతాః. (భగవద్గీత 12.2)

అని సగుణ బ్రహ్మోపాసనను గురించియు,

> యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
> సర్వత్ర గమచిన్త్యంచ కూటస్థ మచలం ధ్రువమ్
> సంనియమ్యేన్ద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః
> తే ప్రాప్నువన్తి మా మేవ సర్వభూతహితే రతాః. (భగవద్గీత 12.3,4)

అని నిర్గుణ బ్రహ్మోపాసనను గురించియు ప్రబోధించెను.

భగవంతుని యందు మనస్సు నిలిపి, అనగా సాకార రూపములగు శివ రామ కృష్ణాదులను నిరంతరము ధ్యానము చేయుచు మిక్కిలి శ్రద్ధతో కూడుకొనిన వారై ఎవరు పరమేశ్వరు నుపాసింతురో వారల కా భగవద్దర్శనము కలుగును. అట్లే ఎవరు ఇంద్రియములను స్వాధీనపరచుకొని అన్నిటియందును సమభావమును, సమస్త ప్రాణులకు హిత మొనర్చుటయందు నాసక్తిని కలిగి, నిర్దేశింప శక్యము కానిదియు, ఇంద్రియముల కగోచర మైనదియు చింతింప నలవి కానిదియు, నిర్వికార మైనదియు, చలించనిదియు, నిత్యమైనదియు, అంతటను వ్యాపించి యున్నదియు నగు అక్షర బ్రహ్మము నెవరు ధ్యానింతురో వారికి భగవత్సాక్షాత్కారము కలుగును. ఇది సగుణ, నిర్గుణోపాసనలను రెండు విధముల నొప్పు భక్తిని గురించిన భగవద్గీత సారాంశము.

సాధారణముగా నిందు మొదటి మార్గ మాచరించు వారిని భక్తులనియు, రెండవ మార్గ మాచరించు వారిని జ్ఞాను లనియు వ్యవహరింతురు. మొదటిది అందరకును నాచరణ సాధ్య మైనట్టిది. రెండవది పరిణత చిత్తు లగువారికి మాత్రమే సాధ్యము. 'మోక్షకారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ' అనియు, 'బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షః సిద్ధ్యతి నాన్యథా' అనియు శంకరాచార్యు లనుటకు భక్తి యొక్క ప్రాచుర్యమును జ్ఞానము యొక్క విశిష్టతయు హేతువు లన దగును. (వివేక చూడామణి. 32,58) కాగా, రెండు మార్గము లందును పవిత్ర చిత్తులు ముక్తిని బడయవచ్చును. ఈ రెంటియందు నే మార్గమున నైనను మోక్షప్రాప్తి కలుగుచుండగా, రెండు నొక్కని యందున్నచో వానికి బ్రహ్మానంద పదవి కరతలామలకము కాక మానదు కదా! విశ్వనాథ వారీ రెండు విధములుగను భగవంతుని నారాధించిన మహితాత్ములు.

> ఆయన యహిరాజ శయ్య నిద్రించె నా యహిరాజె
> నీయెడ భూషణంబయ్యెఁ, గొడు కయ్యె నీ వాని యొకటి
> యై యున్న తత్త్వంబొ, మీరలిద్దఱా! యధికమా యేదొ
> యైయున్కి తోచు శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (శ్రీకాళహస్తి శతకము. 7)

'ఓ శ్రీకాళహస్తీశ్వరా! అహిరాజు శ్రీమహావిష్ణువునకు తల్పము కాగా, నీకు భూషణముగను, పుత్రుడుగను అయ్యెను, మరి మీ యిరువురి తత్త్వము నొక్కటియా లేక భిన్నమా? ఏదో అధికమై యున్నట్లు తోచును. మహాదేవా!' అని పై పద్యమున విశ్వనాథవారు నుతించుచు హరి హర రూపమును ధ్యానించిరి. తిక్కన (విరాట పర్వము.1.35) హరి హర స్వామికి ప్రయోగించిన 'భుజగ సమాచరిత శయన భూషణ' అనెడి విశేషణ మిచ్చట స్ఫురించుచున్నది. ఇది వారి శివకేశవాభేదముతో కూడిన సాకార పరమేశ్వరారాధన కొక నిదర్శనము. కాగా, నీక్రింది పద్యము వారి నిర్గుణోపాసనను తెలియజేయుచున్నది.

మంటిలో గాలిలో నీటిలో నిప్పుమంటలో బయలి
మింటిలో నాగుండెలోన నేదేది మేలైన పాడయొ
నంటి యుండెదు దాని నంచు నిను దాన నావిష్కరింతు
నంటిరా! స్వామి! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (శ్రీకాళహస్తి శతకము. 29)

శ్రీకాళహస్తీశ్వరా! పంచ భూతములందును, నా ఆత్మలోను నిన్నావిష్కరింతును స్వామీ! అని ఈ పద్యమున విశ్వనాథవారు ఆత్మ పరమాత్మల తత్త్వములను, ఆరెండిటి ఏకత్వమును ప్రకటించు విధమున నిరాకార బ్రహ్మము నుపాసించిరి. ఈ విధముగ మధ్యాక్కర శతకములు, సంపూర్ణముగ విశ్వనాథవారి సగుణ నిర్గుణోపాసనాత్మకమైన భక్తితోను, దానికంటె నధికముగ వారి ఆత్మ తత్త్వావిష్కరణాత్మకమైన జ్ఞానముతోను నిండియున్నవి. స్థూలముగ సగుణోపాసనమునకు సంబంధించిన మనఃప్రవృత్తిని భక్తి యని చెప్పవచ్చును. అయినచో నిర్గుణోపాసనకు సంబంధించిన మానసిక వ్యాపారము జ్ఞానమగుచున్నది. పర్యవసానమున రెండును ముక్తి ప్రదము లైనను అనుష్ఠానము నందు భేదించుచున్నవి. సాధారణముగ జ్ఞానులు భక్తి భావయుతులై యుందురు. కాని భక్తులు జ్ఞానులై యుండుట యరుదు. అనగా కేవల భక్తులును, భక్తి భావము కూడ నున్న జ్ఞానులు నుందురని భావము. అట్టి భక్తియు, జ్ఞానమును కలిగిన విశిష్ట వ్యక్తి విశ్వనాథవారు.

ఇచ్చట 'భక్తి' భావమా, రసమా అను విషయమును చర్చించిన ఆలంకారికుల అభిప్రాయములను సమీక్షించుట యుక్తము. మానవులు లౌకిక ప్రవృత్తి ననుసరించి పుత్ర మిత్రాదుల యెడ చూపు గాఢమైన హృదయాభిమానమును సాధారణముగ ప్రేమ యని యందురు. ఇదియే ఆలంబన మగువారిని బట్టి వాత్సల్యము, అనురాగము ఇత్యాదిగా వ్యవహరింప బడును. అదే విధమున ప్రేమకు భగవంతు డాలంబన మైనచో

భక్తి యని యందురు. ఈ భక్తిని ఆలంకారికులలో కొందరు భావ మనియు, కొందరు రస మనియు నచించిరి. ధనంజయుడు హేమచంద్రుడు మొదలగువారు రసము గాదనిరి. మమ్మటుడు భావమే నని ప్రకటించెను. జగన్నాథుడు భక్తికి రసత్వమును కలిగింప యత్నించి కడకు నిర్ణయించలేకపోయెను. భక్తి రస మని తొలుదొల్త ప్రతిపాదించినవాడు 'ఉజ్జ్వల నీలమణి' కర్త యగు రూపగోస్వామి. ఇతడు ''పృథగేవ భక్తి రసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః'' అని యారంభించి భక్తిని యొక రసముగా స్థాపించెను. ఈతని భక్తి గోపికా శ్రీకృష్ణులకు సంబంధించినదై శృంగార పరమైన దగుచున్నది. చిత్త ద్రుతిస్థాయిగా గల శ్రీకృష్ణ గోపికల శృంగారము భక్తి రసమని రూపగోస్వామి యభిప్రాయము. ఇది భక్తి యందలి యొక భాగమే కాని సంపూర్ణము గాదు. (సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానం 1965:307) ఈతని తరువాత మధుసూదన సరస్వతి యను పరివ్రాజకాచార్యుడు భక్తిని ఒక సంపూర్ణ రసముగా ప్రతిపాదించి యిట్లు ప్రకటించెను. ''కాంతాది విషయకము లగు నే రసములందును భగవద్రతియందు వలె పూర్ణ సుఖము లేక ఆనందము కలుగదు కాన వానియందు తగిన రసపుష్టి లేదు. అవి క్షుద్ర రసములు. భగవద్రతి పూర్ణ రసము. అది మిణుగురు పుర్వులకన్న సూర్యకాంతి ఎట్లు బలవత్తరమో అట్లే మిగిలిన రసముల కన్న శ్రేష్ఠతరము, బలవత్తరము''. (సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానం 1965:308) దీనిని బట్టి భరతుడు ప్రతిపాదించిన శృంగారాది రసము లల్పములు నశాశ్వతములు ననియు, అనల్పమైన బ్రహ్మానందమును కూర్చు భక్తియే ఉత్తమమును శాశ్వతము నైన రస మనియు నిర్ణయ మగుచున్నది. శృంగారాది రసములు లౌకిక విషయములకు సంబంధించినవి యగుటచే నవి లౌకిక రసములు. భక్తి రస మొక్కటియే భగవంతునికి సంబంధించినదై పరమ యోగులు మాత్రమే పొందగలిగిన సచ్చిదానందమును కలిగించును. అందుచే నిది అలౌకిక రస మని చెప్పవచ్చును. మధుసూదన సరస్వతి తన భక్తిరసాయన గ్రంథమున స్థాయి విభావాదులను నిర్దేశించి భక్తి రసమును నిరూపించెను. దీనికి భగవదాకారతారూపమైన చిత్తవృత్తి స్థాయి భావము. భగవంతు డాలంబన విభావము. తులసీ చందనాదు లుద్దీపన విభావములు. తత్కాలమందలి నేత్ర భ్రూ విక్షేపాదు లనుభావములు. నిర్వేద హర్షాదులు సంచారీ భావములు. విభావానుభావ సంచారీ భావములు స్థాయి యైన భగవదాకార మనోవృత్తిని పరిపోషించుటచే భక్తి, రసముగా పరిణమించును.

తెలుగున భక్తి రసమునకు పోతన భాగవతము పెట్టినది పేరు. అనంతరము శతక దండక కావ్యములలో భక్తి రసాత్మకమైనవి అధిక సంఖ్యలో గలవు. కీర్తనలు మొదలగు గేయాత్మక రచనలలో నధిక శాతము భక్తి రసోదంచితములే. విశ్వనాథవారి మధ్యాక్కర

శతకములందు లోకపరిశీలనాది విషయములతోపాటు భక్తి భావన, తాత్త్విక చింతన గల పద్యములు నధిక సంఖ్యలో కలవు. వీరి భక్తి రచనలలో కాల సరణినిబట్టి తొలు దొల్త పేర్కొనదగినది 'విశ్వేశ్వరా!' యను మకుటముగల 'మా స్వామి' శతకము. ఈ శతకము నందలి భక్తి భావ నిర్భరము లైన పద్యములు వీరి కవితా కౌశలముతో పాటు ఆత్మ తత్త్వ నిరూపణమును కూడ ప్రకటించుచున్నవి. విశ్వేశ్వరాత్మకమైన పరబ్రహ్మోపాసనము తోపాటు సాకార రూప దేవతారాధనము కూడ నీశతకము ద్వారా వీరు కావించిరి.

'శ్రీవాణీ గిరిజాధి నాథుల జగత్స్థిత్యుద్భవాంతః క్రియా ప్రావీణ్యాత్ములం ....'(మా స్వామి శతకము) అను పద్యమావిశ్వేశ్వరుని పరబ్రహ్మ తత్త్వము నావిష్కరించుచున్నది. పరబ్రహ్మము త్రిగుణాత్మకమైన ప్రకృతి యొక్క సంబంధముచే వికారము నొందును. అది రజోగుణ రూపమున సృష్టిని, సత్వగుణ రూపమున స్థితిని, తమోగుణ రూపమున లయమును పొందుచుండును. ఇదియే బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపకము. బహువిధ రూపముల నొందుచు అనంత విశ్వముగ రూపమును దాల్చు నా విశ్వాత్మను విశ్వనాథవారీ పద్యమున స్తుతించుచున్నారు. ఈ పద్యగత విషయము ఉపనిషచ్ఛ్రుతిపాదితాంశమై వారి తాత్త్విక దృష్టిని ప్రకటించుచున్నది. ఈ విధముగ నీ శతకము విశ్వనాథవారి మహోదాత్త మైన భక్తి భావముతోను లోకపరిశీలనాది విషయములతోను నొప్పుచున్నది.

భాగవతమునందలి గోపికల భక్తిని వర్ణించుచు వీరు రచించిన 'గోపికాగీతలు' 'భ్రమరగీతలు' 'శ్రీకృష్ణ సంగీతము' అను కావ్యములు వీరి భక్తి తాత్త్విక భావముల సంగమములు. ఇక మధ్యాక్కర శతకములందు వీరు తమకు గల వేదోపనిషచ్ఛాస్త్ర పాండిత్యముతో సగుణ నిర్గుణోపాసనల ద్వారా పరమాత్మను స్తుతించుట ప్రధానాంశము.

ఈ మధ్యాక్కర శతకములు విశ్వనాథవారి స్వభావమును లోకజ్ఞతను కవిత్వ తత్త్వమును ప్రకటించుచు వారి పరిశుద్ధాంతఃకరణమును వెల్లడి చేయుచున్నవి. వారి నొక మహా తాత్త్వికునిగను మహా భక్తునిగను పాఠకుని ముందు నిలుపుచున్నవి. కల్పవృక్షావతారికలో (1-5)''...తలచిన రామునే తలచెద నేనును నా భక్తి రచనలు నావి గాన'' అని ప్రకటించి తమ రామాయణ రచనకు గల ప్రధాన హేతువు భక్తి యని స్పష్టము చేసిరి. తరువాత 'దూసిన స్వర్ణువు' తమ తండ్రిగారి యౌదార్యమును వర్ణించి ''అట్టి తండ్రికిఁ బరమ భక్తాగ్ర గణ్యుడైన పుత్రుడ నేను''(1 - 12) అని ప్రకటించు కొనుటను బట్టి వారి భక్తిని గురించి వేరుగ చెప్ప నవసరము లేదు. 'నారాముడు' అను కావ్యము విశ్వనాథవారి బ్రహ్మజ్ఞానమునకు అద్దము పట్టుచున్నది.

ఇందు వారు శ్రీ రాముని పరబ్రహ్మతత్త్వమును ప్రతిపాదించుచు తమ ఆంతర భక్తిని, ఆత్మజ్ఞానమును ప్రకటించిరి. ఇది కల్పవృక్షమునకు మహాభాష్యప్రాయమై విశ్వనాథ వారి ''జాగ్రదవస్థ నేమి యన స్వప్న సుషుప్తులఁ గూడ రామనామ గ్రహణంబ నా వయిన మానస జిహ్వలు సేయు'' (కల్పవృక్షము 1-6) అనెడి విషయమును చిత్రించు చున్నది. ఈ కావ్యమున పది భాగములు కలవు. తొలి మూడు భాగములు రాముడు పరబ్రహ్మమను విషయమును, కడమవి రాముని వివిధ నామముల ననగా బలరాముడు, ఆత్మారాముడు వంటి వాని యౌచిత్యమును విశదీకరించుచున్నవి. 'నారాము'డను కావ్యమునందు ఏ కథా సూత్రము లేక అది విశ్వనాథవారి బ్రహ్మ జ్ఞానమును వారికి శ్రీరాముని యెడల గల జ్ఞానభక్తిని, వారి రామాయణ రచనా శిల్ప చాతుర్యమును ప్రకటించుచున్నది. ఇట్టి కథా వస్తువు గల కావ్య ముండుట అరుదు. ఉపనిషత్ప్రతిపాదితమైన బ్రహ్మమును శ్రీరాముడు నొక్కటియే యను విషయమును దెల్పుచు, ఈ కావ్యము నందలి నిగూఢార్థము తెల్లమగునట్లు వారే దీనికి వ్యాఖ్యను కూడ సంతరించుట యొక విశేషము. విశ్వనాథవారిని మహాకవిగానే కాక ఒక భక్తునిగా, ఒక తాత్త్వికునిగా నిలుపుటకీ కావ్య మొక్కటి చాలును.

విశ్వనాథవారు కల్పవృక్షావతారికలో (1 -7) ''వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచనిపించుకో వృధాయాసము గాక కట్టుకత లైహికమా? పరమా? యటంచుఁ దాఁ జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమై నా సకలోహ వైభవ సనాథము నాథ కథన్ రచించెదన్'' అని తమ రామాయణ రచనా సముద్దేశమును వ్యక్తపరచిరి. ప్రపంచమున భారతదేశ సాహిత్యమున కొక విశిష్టత కలదు. మానవుని ఇహ లోక ప్రయోజనము కంటె పార లౌకికౌన్నత్యమును కాంక్షించి వ్యక్తిని జీవన్ముక్తుని చేయుటయే భారతీయ కావ్య తత్త్వము. ఇదియే వైశిష్ట్యము. ఇదియే నిన్న మొన్నటి వరకును కావ్య పరమార్థముగ నెంచబడిన సంప్రదాయము. ఇచ్చటి పద్యమున మూడంశములు కలవు. మొదటిది తండ్రి యానతి, రెండవది జీవుని వేదన, మూడవది పై రెండిటి కలయికచే కలిగిన సమస్తమైన ఊహల వైభవమునకు పరిపూర్ణమైనట్టి నాథుడగు రాముని కథను రచించుట.

మొదటిదైన తండ్రి యానతికి భారతీయ తత్త్వమగు శాశ్వతానందప్రదము నొందుట యనునది ఆలంబనము. ఈ అంశము 'వ్రాస్తే రామచంద్రుని కథే వ్రాశానని అనిపించుకో గాని ఏవో కట్టుకథలు వ్రాయడం వృథా ప్రయాస గాక.ఇహమా? పరమా?' అని తండ్రిగా రన్నట్లు విశ్వనాథవారు పై పద్యమున స్పష్ట పరచుటను బట్టి తెలియుచున్నది.

రెండవది జీవుని వేదన. జీవు డనగా జీవాత్మ. ఉపాధి ప్రవిష్టుడగు బ్రహ్మము. వేదనకు తపన, బాధ అను సాధారణార్థములతోపాటు జ్ఞానము, తెలివి యను నర్థములు కూడ కలవు. ఈ వేదన శబ్దము జీవ శబ్దముతో కూడి జీవుని వేదన యగునపుడు దానికి ఆత్మజ్ఞాన మనియే అర్థము చెప్పుట సముచితము. ఆత్మజ్ఞానము వలన అజ్ఞానము నశించి జ్ఞానము కలుగును. ఆత్మ, అంతరాత్మ, జీవుడు, జీవాత్మ, చైతన్యము అనునవి పర్యాయకములు. అట్లే విశ్వాత్మ, పరమాత్మ, విశ్వ చైతన్యము అనునవి. అంతరాత్మ యగు పరమ పురుషుడు అంగుష్ఠ మాత్రమున ప్రాణుల హృదయములందు నివసించును. గడ్డినుండి లోపలి పోచను తీసినట్లు తన శరీరమునుండి ఆ ఆత్మను పట్టుదలతో వేరుచేయవలెను. ఆతడే పరిశుద్ధుడును, అమరుడునని తెలియవలెనని ఉపనిషద్బోధ.[1] అనగా ఆత్మానాత్మ వివేకముతో అంతశ్చైతన్యమును విశ్వ చైతన్యములో కలుపవలెను. ఇట్టి దీక్షయే జీవుని వేదన. ఇంకను మానవ హృదయ స్థితమైన ఆత్మను గురించి ఉపనిషత్తిట్లు చెప్పుచున్నది. అణువు కంటె సూక్ష్మమైనదియు మిక్కిలి పెద్దదానికంటె మరింత పెద్దదియు నైన ఆత్మ, ప్రాణుల హృదయములందు కలదు. కోరికలు లేనివాడై, శోకరహితుడై తన ఇంద్రియములయొక్కయు, మనస్సు యొక్కయు పవిత్రత ద్వారా ఆ ఆత్మ మహిమను సాక్షాత్కరించుకొనును.[2] ఇట్టి యత్నమే జీవుని వేదన.

జీవుడే సంసారమున బడి అవిశ్రాంతుడై అనేక విధము లైన రూపములు దాల్చుచు సుడిలో పడిన కీటకము వలె ప్రవర్తించుచున్నాడు. సముద్రము నందలి నీరు మేఘ రూపమును ధరించి తిరిగి వర్ష రూప మగు జలముగా సముద్రమును చేరినట్లే పరమాత్మ నుండి విడువడిన జీవుడు తిరిగి పరమాత్మను చేరినపుడే జీవునికి శాంతి. విశ్వ చైతన్యమున కలియవలె ననెడి జీవ చైతన్యముయొక్క ఆర్తియే జీవుని వేదన. ఇంకను చెప్పవలె నన్న బ్రహ్మానుభవమే జీవుని చరమ లక్ష్యము. అట్టి సచ్చిదానందాత్మానుభూతియే జీవితముయొక్క పరమావధి. అఖండానంద

---

[1] అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః।
తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహే న్ముంజాది వేషీకాంధైర్యేణ
తం విద్యా చ్ఛుక్రమమృతం తం విద్యా చ్ఛుక్రమమృత మితి॥ (కఠోపనిషత్ 2-3-18)

[2] అణోరణీయాన్ మహతో మహీయా నాత్మాఽస్యజంతోర్ని హితో గుహాయాం।
త మ క్రతుః పశ్యతి వీత శోకో ధాతుప్రసాదాన్మహిమాన మాత్మనః॥ (కఠోపనిషత్ 1-2-20)

స్వరూప మగు ఆత్మ తత్త్వము నెఱుగుటయే అనగా ననుభవించుటయే జ్ఞానము. తచ్చింతనయే జన్మ సాఫల్యము. ఇదియే జీవుని వేదన. ఇదియే ఉపనిషత్సారాంశము. దీనినే మోక్షమని తత్త్వజ్ఞు లందురు. దీనినే ఉపనిషత్తులు, భగవద్గీత వంటి గ్రంథము లుద్ఘోషించుచున్నవి. విశ్వనాథవారి సాహిత్యమునం దేకోశమును పరిశీలించినను వారి మోక్షగామిత్వమే వెల్లడి యగును. జ్ఞాన మనిపించుకొను ఆత్మానాత్మ వివేకమును పరమాత్మానురక్తియు రామాయణము, నారాముడు, మధ్యాక్కర శతకముల వంటి కావ్యముల అంతస్స్రోతము.

ఇక మూడవది, తండ్రి యానతి జీవుని వేదన యను రెండింటి కలయికచే కలిగిన సమస్త మైన ఊహల వైభవమునకు పరిపూర్ణమైనట్టి నాథు డగు రాముని కథ రచించుట. మోక్షప్రద మగు రామ కథను వ్రాయు మనునది పితృాజ్ఞ. ఆనంద మయమగు బ్రహ్మము యొక్క అనుభూతిని, అనగా శ్రీరామ సాక్షాత్కారమును వారు రెండు మూడు పర్యాయములు పొందుటచే (నా రాముడు. 1-4) అట్టి ఆత్మానురక్తియే విశ్వనాథవారి జీవుని వేదన .[1] విశ్వనాథవారి సహజ ప్రవృత్తి యగు కావ్య నిర్మాణమునందు, ఈ రెండును కలిసిన భావజాలమంతయు రామునిపై, రామ కథపై కేంద్రీకృతము కాగా వారు రామాయణ కల్పవృక్షమును రచించిరి. ఈ పరిశీలనముచే విశ్వనాథవారు భక్తులును, జ్ఞానులును, తాత్త్వికులు నని తెలియుచున్నది.

విశ్వనాథవారు తమ రామాయణ కల్పవృక్షమును గురించి '' ఈ గ్రంథ మంతయు శబ్దవములు, సమాసవములు, తెలుగు పలుకుబడులు, వ్యాఖ్యానవములు, తత్త్వబోధనములు, కావ్య లక్షణములు. వీని నన్నింటిని శ్రీరామచంద్రాత్మగా భావన చేసి యీ గ్రంథమున వ్రాసితిని. నేను పడిన ఈ శ్రమ యంతయు నా సాధన. లోకమున కది యొక కావ్యము. వారు మెచ్చుదురు, మెచ్చరు. నాకు దానితో నవసరము లేదు. ఈ రామాయణ కల్పవృక్ష ఫలముగా నేను వాంఛించునది ఆ ఆనందము. నాయందు నిత్యమై యుండవలయునని. ఇంకొక కోరిక లేదు.'' (నా రాముడు పుట.10) అని వ్రాయుటను బట్టి వారి నిరుపమాన మైన జ్ఞాన భక్తి ద్యోతక మగుచున్నది. ఈ విషయము లన్నియు విశ్వనాథవారిని ఒక మహా తత్త్వవేత్తగా మనముందు నిలుపుచున్నవి. విశ్వనాథవారి కంటె గొప్ప పండితు డుండవచ్చును. కవి యుండవచ్చును. సాధకు డుండవచ్చును. కాని ఈ మూడు గుణములు ఏకత్ర పుంజీభూతమైన వీరివంటి జ్ఞానులుండుట యరుదు. వీరు భారతీయ తత్త్వమును ముఖ్యముగా వేదాంతమును,

---

[1] ఇచ్చట జీవుని వేదన అనుదానిని శ్రీ దూళిపాళ శ్రీరామమూర్తి గారు, డా॥ కోవెల సంపత్కుమారాచార్య గారు ఒక కావ్య కళా దృక్పథముగా గ్రహించిరి.

విశేషించి అద్వైతమును జీర్ణించుకొని తెలుగుభాషా జీవమునందు పదిలపరచి కవిత్వ మనెడి ఉపాధి ద్వారా హృదయంగమముగా అందించిన తాత్త్విక కవి. కల్పవృక్షము, మధ్యాక్కర శతకములు, నా రాము డను కావ్యములు ప్రధానముగా ఈ అభిప్రాయమునకు ప్రబలాధారములు.

---

# 5. శతక సారస్వత సమాలోచనము

ఆంధ్ర వాఙ్మయ కల్పవృక్షమున శతక కావ్య శాఖ కొక విశిష్టత కలదు. పండిత పామరు లను భేదము లేక సర్వులకు నాదరణ పాత్ర మగుటయే దీని విశిష్టత. ఆధునిక కావ్య విభాగము ననుసరించి శతకములు ఆత్మాశ్రయ ప్రక్రియకు చెందును. ఈ విభాగము ప్రాథమిక దశయందు స్తోత్రపూర్వకము లైన రచనల రూపమున నుండి కాలక్రమమున వస్తు బాహుళ్యమును, స్వరూప నిర్దుష్టతను సంతరించుకొని శతకము లను పేర ప్రత్యేక సారస్వత శాఖగా రూపొందిన దని ఊహింపవచ్చును. శతక మను నామము శత సంఖ్యను సూచించుచుండ, ఆనుపూర్వి గల వస్త్వైక్యము లేక, ఏ పద్యమున కా పద్యమే భావ స్వాతంత్ర్యమును కలిగియుండుట దీని అంతర్లక్షణ మగుచున్నది. కాగా, మకుట నియమ ముండుట దీని బాహ్య లక్షణము.

పద్య రచనాభ్యాసమును, చాటు పద్య రచనాభిలాషయు శతకముల రచనకు దోహదములు. ఈ విధముగ కవులు కావ్య సృజనాభ్యాసమున ధారా శుద్ధియు భావ స్పష్టతయు నలవడుటకు తొలి దశలో శతకములను రచించెద రనియు ప్రతీతి. శతకములు మహా కావ్య నిర్మాణమునకు చక్కని భూమిక నేర్పరచు చున్నవి. అయినప్పటికిని ఉత్తమ కావ్యములతో పోటి పడగల ప్రౌఢిమ కలిగి, భావ బంధురము లైన శతకములు చాల కలవు. అట్లగుటచేతనే శతకములకు ప్రధాన ప్రక్రియా ప్రతిపత్తి కలిగినది.

ప్రాయికముగా శతకములు భగవన్నుతి పూర్వకము లైన రచన లని చెప్పవచ్చును. వేదములు మహర్షుల స్తోత్ర సముదాయము. పురాణ వాఙ్మయమున కూడ స్తోత్ర

ప్రాయమైన రచనలు కలవు. సంస్కృతమున వివిధ దేవతల నుద్దేశించిన సహస్రనామ స్తోత్రములు, అష్టోత్తర శత నామ స్తోత్రములు బహుళ ప్రసిద్ధి నొందినవి. వీనియం దున్న స్తోత్ర లక్షణమును, సంఖ్యానియమమును గుర్తింపదగినవి. తదుపరి సంస్కృత కావ్యములం దొక సర్గమున కొకే వృత్తము గ్రహించెడి విధానము కలదు. ఇట్లే తెలుగున కంద రామాయణము, గీత రామాయణము వంటివి ఒకే పద్యమును గ్రహించి రచింపబడినవి. ఇట్టి విధమైన లక్షణముల సమాహార రూపమే ప్రత్యేకమైన శతకమను కావ్య ప్రక్రియా భేదముగ పరిణమించి ఉండవచ్చును.

శతకములకు స్తోత్ర లక్షణము ప్రాథమికగుణ మైనను భక్తి, ఆధ్యాత్మిక శతకములతో పాటు, నీతి శతకములు మున్నగునవి కూడ కలవు. శతకమను నామమును బట్టి నూరు పద్యము లుండుట సామాన్య లక్షణ మైనను నూటొకటి, నూటయెనిమిది పద్యము లుండుట కూడ పరిపాటియే. సంస్కృతాంధ్రములలో శతకమునకు సామ్య ధర్మము లున్నట్లే, సంస్కృతమున మకుటము లేకుండుట తెలుగున మకుట నియమ ముండుట వంటి వైషమ్యములు కూడ కలవు. సంస్కృతమున శతక రచన మిక్కిలి పరిమితము కాగా తెలుగున నిది విశేషముగ ఆదరింపబడినది.

'పరఁగు ముక్తక మేక పద్యంబు...' అని పద్య సంఖ్యా భేదముచే నేర్పడు కావ్య భేదములను చెప్పుచు విన్నకోట పెద్దన (కావ్యాలంకార చూడామణి 4.9) 'శతకమున నొప్పు మఱి పద్య శతము గూడ' అని శతకమును నిర్వచించెను. ప్రబంధము, చాటు ప్రబంధము అని కావ్యము ద్వివిధ మనియు చాటు ప్రబంధము లందు ముక్తకాదులు పద్య సంఖ్యా బద్ధము లనియు అప్పకవి (అప్పకవీయము 1-31) చెప్పుచు, ఇందు నూరు పద్యము లున్న యెడల శతక మగు నని చెప్పెను.

పద్య సంఖ్యా నియమము గల చాటు ప్రబంధము లందలి పంచ రత్నములు నవ రత్నములు, నక్షత్ర పంక్తీత్యాది కావ్య భేదము లన్నియు ముక్తక మను పేరు గల కావ్యము యొక్క లక్షణముతో సంఖ్యాధిక్యము గల పద్యములచే నేర్పడుచున్నవి. ముక్తకము, స్వతంత్రమును భావ సంపూర్ణమునైన ఏక పద్య యుతమైన కావ్యము. అట్టి లక్షణములు గల బహు పద్య యుతములు పంచ రత్నాది కడమ కావ్యములు. శతకము కూడ చాటు ప్రబంధ మందలి ఒక కావ్య భేద మగుట వలన నిదియు నిట్టి లక్షణములతో నొప్పుచున్నది. అనగా శతకమున స్వతంత్రమును, భావ సంపూర్ణము నైన నూరు పద్యము లుండును. ఆ నూరు పద్యములందు పద్య లక్షణమునం దేకత్వ ముండినట్లు భావ సారూప్య ముండవచ్చు నేమోకాని, కథా సూత్రత వంటి బంధ మేమియు నుండదు. శతకము నందలి నూరు పద్యములలో దేని నైనను ఎచ్చట నైనను ఉంచి వానియం దెట్టి క్రమము నైనను పాటింపవచ్చును.

అనగా ఒక్కొక్క పద్యము నొక్కొక్క ముక్తక కావ్యముగా కూడ నేర్పడు ననుట. ఇది శతకముల సాధారణ లక్షణము.

నన్నయ భట్టారకుని ఆది పర్వమున ఉదంకుడు, నాగరాజును స్తుతించు సందర్భమున 'మాకు ప్రసన్నుఁ డయ్యెడున్' అను మకుటముతో కూడిన నాలుగు పద్యములు కలవు. ఇది తెలుగు శతకములకు మకుట ముండుట యను లక్షణమునకు ప్రథమోదాహరణము. మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్వ సారము' సంపూర్ణ శతక లక్షణములు గల తొలి కావ్యము. పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము అనునవి తెలుగున వెలసిన తొలి శతకములు. ఇవి భక్తి, నీతి ఆధ్యాత్మికాది విషయముల ద్వారముననే ఎక్కువ ప్రచారమునందుండును. ఆ విధముగా శతకములు విషయ గంభీరముల్తై జనాదరణమునకు పాత్రము లైనవి.

శతకములలో ప్రచురముగా కవుల ఆత్మ ప్రబోధము గోచరించును. భక్తి నీతి మొదలగు విషయములపై కవులు తమ అభిప్రాయములను, అనుభూతులను, సందేశములను, ప్రార్థనలను శతకము ద్వారమున ప్రకటింతురు. ఉపనిషత్సంబంధ మగు నిగూఢ మైన రహస్యములను సులభ మార్గమున ప్రజలకు బోధింతురు. ఈ విధముగా శతకము ఆత్మాశ్రయ కవిత్వమునకు చెందిన దగుచున్నది.

తెలుగులో ప్రబంధ కావ్య ప్రక్రియ పండితులలోను గేయ ప్రక్రియ సామాన్యులలోను ప్రచారమునకు రాగా, శతక ప్రక్రియ ఇరు వర్గముల వారి నాకర్షించినది. శతక కర్తలలో మహా కవులతోపాటు సామాన్య కవులు కూడ కలరు. లాక్షణికులు శతక పద్యములను తమ గ్రంథములందు లక్ష్యములుగా ప్రదర్శించిరి. ప్రబంధ కావ్యములందు కానరాని హాస్య రసము, శతకములందు పుష్కలముగా లభించును. సమకాలీన సాంఘిక విషయములు శతకములో వెల్లడి యగును. తద్వారా చరిత్ర నిర్మాణమున కుపకరించు సాహిత్యమునందు శతకముల కగ్ర స్థానము కలదు. ఇవి లోకోక్తులకును, సామెతలకును, నుడికారములకును కాణాచి. అనుప్రాసము, అర్థాంతరన్యాసము, దృష్టాంతము మొదలగు అలంకార కుముదములకు శతకములు శరత్పూర్ణిమలు. వీనిని ప్రధానముగా భక్తి శతకములు, నీతి శతకములు, తత్త్వ శతకములు, ఇతరములు అని నాలుగు తరగతులుగా విభజింపవచ్చును. భగవన్నుతి పూర్వకములైనవి భక్తి శతకములు. వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, ఒంటిమిట్ట రఘువీర, శ్రీకాళహస్తీశ్వర, దాశరథి, కృష్ణ ఇత్యాదివి బహుళ వ్యాప్తి గల భక్తి శతకములు. వీనియందు కవు లాయా దైవతములను భక్తి ప్రపత్తులతో స్తోత్రము చేయుచు హృద్యముగను రసవంతముగను భక్తి భావమును ప్రకటించిరి. భక్తి రస

వాహినిచే ఆంధ్రుల హృదయ కేదారములను పండించిన కావ్యములలో పోతన భాగవతముతో సమమైన వీ భక్తి శతకములు. జన జీవితమును క్రమ బద్ధమును, శ్రేయోదాయకమును గావించుట కుపకరించు సాంఘిక నియమములను నిర్దేశించునవి నీతి శతకములు. నీతులు వైయక్తికమైనవి, సాంఘిక పరమైనవి, రాజనీతి పరమైనవి ఇత్యాదిగా నుండును. ఈ వర్గములో సుమతీ శతకము, భర్తృహరి సుభాషిత త్రిశతికి ఏనుగు లక్ష్మణ కవి కావించిన అనువాదము, భాస్కర శతకము, జగన్నాయక శతకము మొదలగునవి ప్రసిద్ధమైనవి. వేదోపనిషత్సారము నవగతము చేసికొనుట కా విషయములను తేటైన మాటలతోను, చక్కని ఉపమానములతోను సుబోధ మైన రచనతోను వెల్లడి చేయునవి తాత్త్విక శతకములు. వీనియందు తాత్త్వికాంశముతో పాటు సగుణ భక్తి, నీతి అనునవి కూడ నుండును. నారాయణ శతకము, సంపగిమన్న శతకము, మానసబోధ, చిత్తబోధ శతకములు నీ శాఖకు చెందిన కొన్ని ప్రసిద్ధ శతకములు. ఇవియే కాక వ్యాజస్తుతి, అధిక్షేప, శృంగారాది శతకములు కూడ కలవు. చాల శతకములు భక్తియు నీతియుగాని, నీతియు శృంగారమును గాని, అధిక్షేప వ్యాజ స్తుతులను గాని కలిగి యుండును. ఇట్టి వానిలో వేమన శతకము, కవి చౌడప్ప శతకము ముఖ్యమైనవి. అధిక్షేపము నాధారముగా గొని ఈ శతకము లనేక సాంఘిక తాత్త్విక విషయములను ప్రకటించి, జన హృదయములలో భక్తి శతకములతో సమానముగా శాశ్వత స్థానమును సంపాదించినవి.

ఈ విధముగ శతకములు బహువిషయ సమన్వితము లై చదువరుల కానందమునే గాక మనో వికాసమును, బుద్ధి వికాసమును కూడ కలిగించుచున్నవి. వీనియందు కొండ అద్దమందు కొంచెమై కనిపించు రీతి నాల్గు పాదములలో నల్గడల విషయము లిమిడి యుండును. ఇదియే దీని గొప్పతనము. దాశరథీ యని రామదాసును, నారసింహా యని కూర్మదాసును స్తోత్ర శతములు చేయగా, క్రమముగా నాయా దైవములు రామదాసుకు చెర విముక్తియు, సింహాద్రికి యవన విముక్తియు ప్రసాదించెనని ప్రతీతి. శతకము లిట్లు పరమ ప్రయోజనమును సాధించియుండగా ఇక నీ ప్రక్రియయొక్క వైశిష్ట్యమును గూర్చి వేరుగా చెప్పనక్కరలేదు.

ఇటువంటి ప్రత్యేక సాహిత్య శాఖ యగు శతక ప్రక్రియను చేపట్టి విశ్వనాథవారు విరళమైన మధ్యాక్కర పద్యములో నవిరళముగా ఒకటి కాదు, రెండు కాదు, పది శతకములను రచించిరి. అనగా సమారు వేయికి పైబడిన మధ్యాక్కరలను వీరు రచించి శతక సారస్వత శాఖ కొక విశిష్టతను చేకూర్చిరి. వీరి శతకములలో భక్తి తత్త్వములు ప్రధాన వస్తువులు. ఈ అంశములచే నా విశిష్టతతోపాటు ఒక విలక్షణత కూడ కలుగుచున్నది. ప్రసిద్ధము లైన శ్రీకాళహస్తీశ్వర శతకము, దాశరథీ

శతకము మొదలగువానిలో ప్రధానముగా సగుణోపాసనా రూపమైన భక్తి యుండును. విశ్వనాథ మధ్యాక్కరలలో నిట్టి భక్తి కంటె నిర్గుణోపాసనాత్మక మైన భక్తి కధిక స్థాన మీయబడినది. పూర్వము వెలువడిన నారాయణ, రామరామ, శివముకుందేత్యాది శతకములు కేవలము వేదాంత తత్త్వమును వెల్లడించుచున్నవి.

విశ్వనాథవారు మధ్యాక్కర శతకములను రచించుటకు పూర్వము విశ్వేశ్వరా! అను మకుటముతో నొక శతకమును రచించిరి. ఇందున్నవి శార్దూల మత్తేభ వృత్తములు. పాండిత్య ప్రౌఢిమయందును, రచనా శిల్పమునందును, ఆధునిక యుగమున వెలువడిన శతకములలో దీని కగ్రస్థానము కలదు. ఇందలి తొలి రెండు పద్యములు వీరి రామాయణ కల్పవృక్షమున మొదటి పద్యములుగా గ్రహింపబడినవి. ఇది ఈ శతకముపై వారికి గల ప్రత్యేకాభిమానమునకును, వారి రచనలలో దీనికి గల విశిష్టతకును నిదర్శనము. ఈ భక్తి శతకమున వారు సగుణరూపు డగు విశ్వేశ్వరు నర్చించియు, అక్కడక్కడ పరబ్రహ్మ తత్త్వమును కూడ నావిష్కరించిరి. మధురభక్తి నాలంబనముగా చేసికొని వారీ క్రింది పద్యమున భక్తి భావమును పరమోదాత్తముగ చిత్రించిరి.

శా॥ స్వాంతంబన్ మృదు శయ్యపైఁ బఱచితిన్ భక్తి ప్రధా వస్త్ర మ
త్యంతంబున్ బయిఁ జల్లితిన్ మృదుల భావాఖ్య ప్రసూనాళి, నా
యంతర్గేహము బాగు చేసితిని నీకై కంటి దారిన్ బ్రతీ
క్షింతున్ వాసవసజ్జకంబలె నుమా చిత్తేశ! విశ్వేశ్వరా! (మాస్వామి శతకము)

ఈ భక్తి భావమే వారిచే పది మధ్యాక్కర శతకములను వ్రాయించినది. ప్రబంధ కావ్యములలో కాననగు అనల్పమైన కల్పనా సంవిధానము, ఉక్తి చాతుర్యముచే విషయము నభివ్యక్తీకరించు నేర్పు ఈ శతకమున వారు ప్రదర్శించిరి.

'విశ్వనాథ మధ్యాక్కఱ' లలో కేవలము తత్త్వమే కాక, తాత్త్వికాంశములు భక్తితో మిళితమై ఒకే శతకమునం దుండును. వీనితోపాటు లోక ప్రవృత్తి, వారి ఆత్మ కథనము మొదలగునవి కూడ యుండును. పదిమంది దైవముల నుద్దేశించి పది శతకములలో భక్తి తాత్త్విక భావములు, భావ సౌష్ఠవముతోను చమత్కార యుతముగను రచించుట వలన నీ శతకములు, వారిని మహాకవిని చేయుచున్నవి. యోగ విద్యలో తారక మంత్రమున కధిక ప్రభావము కలదు. రామనామము ప్రణవము వంటి దని జ్ఞానులు చెప్పుదురు. రామనామము యొక్క తత్త్వమును వారీ క్రింది మధ్యాక్కరలో భక్తి భావముతో ప్రకటించిన తీరు వారి తత్త్వజ్ఞానమునే గాక వారి కమనీయ కవితా వైశారద్యమును కూడ ప్రకటించుచున్నది.

సకలవేదమ్ములు నుపనిషత్తులు సకలాగమములు
నొకయెత్తు, నాస్వామి! రామ యను నామ మొకయెత్తు, రత్న
శకలమ్ము రఘుపతి, చీఁకటి నెఱుక చాలమి యను ని
శికిఁ జందమామ శ్రీవేంకటేశ్వరా! శేషాద్రినిలయ! (శేషాద్రి.62)

భక్తి శతకములలో భక్తి రసప్రవాహము కవి హృదయపుటంచు లొరసి ప్రవహించి, ప్రవహించి పాఠకులను కూడ ముంచెత్తును. భక్తి భావోద్దీప్తికి తెలుగునాట ఏనోట వినినను ముందుండునవి శతక పద్యములే. ఇచ్చట రాముడు సాక్షాత్పరతత్త్వమగు పరబ్రహ్మమేయను నంశము స్థాపింపబడినది. రాముడు అనంతమగు ఆనంద స్వరూపము. 'చీకఁ టినెఱుక చాలమి యను నిశికిఁ జందమామ' అని ప్రయోగించిన ఉపమానమునకు వారి నా రాము డను కావ్యము వ్యాఖ్యానమని చెప్పవచ్చును. ఈ వేయి మధ్యాక్కరలలో నిటువంటి తత్త్వజ్ఞానముతో కూడినభక్త్యావేశము గల పద్యము లెన్నియో కలవు.

విశ్వనాథవారీ మధ్యాక్కర శతకములలో ముక్తకములను పోలు స్వతంత్ర భావము గల పద్యములు వ్రాయుచు నచ్చటచ్చట ఒకే విషయముతో సంబంధ ముండు నట్లుగా మూడు నాలుగు పద్యముల వరకును వ్రాయుదురు. శ్రీగిరి శతకములో శ్రీశైలమల్లి కార్జున స్వామిని స్తుతించుచు తన్మయత్వముతో 'స్వామీ! కనుమూసినంతనే, నాఅంతట నేనే నీ గర్భగుడిలో లింగము ముందర తలవంచి శిరస్సు పానవట్టము దగ్గరకు చేర్చినట్లుగా ననుపించుచున్నది' అని వారీ క్రింది విధముగ వ్రాసిరి.

కనుమూసినంత నీ గర్భగుడి లోన కన్పించుచుంటిఁ
గనఁగ నేనే నాకు నింద్రలీల లింగంబు ముంగలను
తనువువంచి శిరంబు పానవట్టంబు దగ్గరఁ జేర్చి
సునిరత మూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (శ్రీగిరి. 18)

పూర్ణ భక్తితో వారు పై పద్యమున ప్రకటించిన భావమును తరువాత పద్యములతో ననుసంధించుచు

'అటవ్రాలియున్నట్టు లభవ యూహించి నప్పుడే నా సు
ఘటన నిత్యమ్ముగా నున్న దామాయ క్రమ్మి నే నెఱుగ
నటులైన నీ నిత్యసన్నిధాన ధైర్యము వహించెదను
స్ఫుటము సేయఁగదె శ్రీశైలమల్లికార్జున మహాలింగ! (శ్రీగిరి. 19)

అటుప్రాలియున్న నావీపుపై నెంద రభవ త్రొక్కెదరొ
త్రుటినైన నొక బాధ కలిగినట్లుగాఁ దోచదునాకు
నిటలాక్ష నీసన్నిధియును నీసేవ నెరయు వేఁడి తఱి
చుట తోచనీదొ శ్రీశైలమల్లికార్జున మహాలింగ! (శ్రీగిరి. 20)

అని తన్మయ భావమును ప్రకటించిరి. ప్రతి క్షణము పరమేశ్వర ధ్యానముతో క్షణికమగు దేహముపై భ్రాంతిపోయి శాశ్వతమగు ఆత్మయే తానను అనుభూతి కల్గుట, అట్టి అభ్యాస ప్రాబల్యముచే ఉపాధిగతమైన సుఖదుఃఖాదులు మానవునకు చెందక పోవుట అనెడి తమ స్వానుభవమును విశ్వనాథవారు పైపద్యములలో వ్యక్తపరచిరి. ఇట్టి విధమైన ఆధ్యాత్మికాంశము లీ శతకములలో దృష్టాంత పూర్వకములుగా వారు సర్వసుబోధము కావించిరి.

శతకములలో తరచు కవి తన ఆత్మ ప్రబోధము కావించుచుండును. తాను దైవము తో సంభాషించుచున్నట్లు వ్యక్తిగత, సామాజిక విషయముల నేకరవు పెట్టును.

ఒనరగా నల్వురు నన్నుఁ జూచి యయ్యో పాప మంచు
ననిపించుకోలేన బయటి నా వ్యవహార నిష్ఠతయు
ననుఁగట్టు పొగరుబోతనియు యనిపించు నా గుండె వ్రయ్య
నిను నెంచుచును గూడ భద్రగిరి పుణ్యానిలయ! శ్రీరామ! (భద్రగిరి.52)

అను పద్యమున విశ్వనాథవారు తమ హృదయము వ్రయ్యలగునట్లుగా భగవంతుని తలచుచుండినను ఏలనోతాము లోకము సానుభూతి పొందలేక పోయితి ననియు, తమ బయట వ్యవహారముచే కట్టు పొగరుబోతని నలుగురు ననుకొందురనియు ప్రకటించిరి. శతకములలో సర్వసాధారణముగా కనబడు ఆత్మ కథనమున కీ పద్యము చక్కని ఉదాహరణము. ఈ విధముగ అనేకమైన స్వీయ విషయములను వారీ మధ్యాక్కర శతకములలో ప్రకటించిరి.

ఆంధ్రమున శతక సారస్వతము జాతీయములు, నుడికారములు మొదలగువానికి నాటపట్టు. వీని ఆధారముచే కవి లోకమున కద్దము పట్టును.

అన్నాను నీ భక్తుడ నని పైకి, నీ యడుగుల నందు
కొన్నానొ, అది లేదు, గ్రుడ్డి గుఱ్ఱాలకుం బండ్లు తోము
చున్నాను యమ నియమములు ధ్యానంబు నొక యింత లేవ
యన్న ఖాదినయి శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (శ్రీకాళహస్తి. 64)

ఈ పద్యమున వారు లోకోక్తి ఆధారముచే వ్యర్థ జీవిని చిత్రించిరి. భగవత్సేవ చేయక, యమనియమాదుల నాచరింపక ధ్యానములేక మూడు పూటల మెక్కుచు పైకి భక్తుల మని చెప్పుకొనుచు వృథగ కాలము పుచ్చువా రిచ్చట అధిక్షేపింపబడిరి. సమాజములో అట్లు కాలయాపన చేయుటకు ఎగతాళిగ 'గ్రుడ్డి గుఱ్ఱాలకు పండ్లు తోముట' యనునది వ్యాప్తియందుండి లోకోక్తిగ స్థిరపడినది. బలీయమైన భావప్రకటనకు లోకోక్తులను వాడుట నిశితశర ప్రయోగము వంటిది. ఇచ్చటి లోకోక్తి ప్రయోగముచే భక్తుల మని చెప్పుచు వ్యర్థముగా కాలము గడుపువారిని కవి మందలించుచున్నారు. ఇది శతక లక్షణములలో నొకటి. వేయి మధ్యాక్కరలలో నధిక పద్యములం దిటువంటి లోకోక్తులు, సామెతలు, అధిక్షేపములు కలవు.

కవి ఆత్మకథనము శతకముల ప్రత్యేక లక్షణములలో నొకటి. సాధారణముగ కవులు తమ సామాజిక విషయములను, సుఖదుఃఖములను శతకములద్వారా లోకమునకు తెలియజెప్పుదురు. విశ్వనాథవా రిట్టి విషయములను భక్తి తాత్త్విక భావములతో జోడించి మధ్యాక్కరలలో చెప్పిరి. భక్తి కవిత్వము నల్లకయున్న తమకు బ్రతుకే లేదను తమ ఆత్మ ధర్మము నీ క్రింది పద్యములో వారు చెప్పిన విధము పాఠకుల కాశ్చర్యానందములను కలిగింపక మానదు.

> నిన్నుదలంచుటయన్న భావముల్ నెగడుట కాదె
> పన్నిన మధ్యాక్కఱలుగ భావముల్ వచ్చెడు స్వామి!
> యెన్న నీకవనంబు లేకయున్న నే నేమయి యుందు
> నిన్నెన్నఁ జాలక భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ! (భద్రగిరి. 92)

విశ్వనాథవా రీ మధ్యాక్కరల రూపమున పండించిన భక్తి తత్త్వ కవిత్వ సస్యముల జీవ రహస్యము నీ పద్యమున నిక్షిప్త మొనర్చిరి. భగవంతుని తలంచుట యనగా భావములు 'నెగడుట' యని ఒక మహాభక్తుడు ఒక మహాకవి మాత్రమే అనగలడు. భగవంతునిపై వారి భావములు మధ్యాక్కరల రూపమున వెల్వడినవవి. ఈ దశశతక నిర్మాణ రహస్యము నిచ్చట వాచ్యమొనర్చిరి. సమాధి నిష్ఠులైన ఋషులు పరమేశ్వరుని దర్శించి నప్పుడు దర్శనీయమైనది వారి ముఖము నుండి వేదఋక్కుల రూపమున వినిర్గతమైనది. ఆ విధముగ వేదసారము పరమాత్మ యగుచున్నది. విశ్వనాథవారి భక్తి ప్రపత్తులు, ఆత్మజ్ఞానము, తద్ద్వారా పొందిన ఆనందానుభూతి ఆ శతకముల మూలమున వెల్లడి యగుచున్నది. అటువంటి పరమేశ్వర సాక్షాత్కారానుభూతితో వారు చేసిన స్తోత్రములే మధ్యాక్కరలుగా వెలువడినట్లు పై పద్యమున చెప్పబడినది.

ఇట్లనుటచే వేయి మధ్యాక్కరలు వేదబుక్కలుగను, మధ్యాక్కరలు ప్రతిపాదించునది వేద ప్రతిపాదిత మగు పరబ్రహ్మముగను నగుచున్నది.

ఇంతటి పరమోత్కృష్టమైన భావముతో మధ్యాక్కర శతకములను వెలయించుటచే విశ్వనాథ ప్రశస్తియు, మధ్యాక్కర విశిష్టతయు వేయి విధముల నెగడుచున్నది. 'ఈ (నీ) కవనంబు లేకయున్న నేనేమయియుండు' నని వారు భగవంతుని అడుగుటలో వారి భక్త్యాత్మకమైన కవితాత్మ వెల్లడి యగుచున్నది. వారి హృదయాంతరాళములలో సదా పరమేశ్వరార్చనతో కూడిన కావ్య సృజనా తపన కొట్టుమిట్టాడుచుండునని తెలియుచున్నది. ఇచ్చట రెండంశములు కలవు. ఒకటి: కవనము. రెండు: ఆ కవనమునకు పరమాత్మ లక్ష్య మగుట.

ఈ రెండంశములు వారి జీవలక్షణము. కావుననే ఆ లక్షణము లేనిచో తానేమై యుండునో అన్న శంక. అదియే జీవుని వేదన. దీనికి వ్యాఖ్యానప్రాయమీ శతకములు. ఈ రీతిని పది శతకములుగ విభక్తమైన 'విశ్వనాథ మధ్యాక్కరలు', శతక ప్రక్రియకు విశిష్టతను చేకూర్చుచు, సారస్వతమును సుసంపన్నము చేయుచున్నవి. ఈ వేయి మధ్యాక్కరలలో నీ విధముగ భక్తి, ఆధ్యాత్మిక తత్త్వము, అధిక్షేపము, ఆత్మ కథనము, లోకవ్యవహార ప్రదర్శనము మొదలగువానియం దేదో యొకటి హృద్యముగ చిత్రితమై యుండును.

---

# 6. మధ్యాక్కర లక్షణ పరామర్శ

'మధ్యాక్కర' యందలి 'మధ్య' శబ్దము సంస్కృతము. 'అక్కర' శబ్దము తద్భవము. అట్లగుటచే మధ్యాక్కర యను రూపము వ్యాకరణ విరుద్ధ మగును. అక్కరకు ప్రకృతి 'అక్షరము'. అప్పుడు 'మధ్యాక్షరమ'ను సమాసము వ్యాకరణ సమ్మత మగును. కాని అక్కర శబ్దము సంజ్ఞావాచక మగుటచే సంస్కృత శబ్దముతో సమసించి మధ్యాక్కర యనునది కూడ సాధువగుచున్నది. ఆంధ్ర ఛ్ఛందోగ్రంథము లన్నిట మధ్యాక్కర, మహాక్కర వంటి రూపములే కలవు. వీనికి కన్నడమున దొరయక్కర, పిరియక్కర ఇత్యాది దేశి సమాస రూపము లున్నవి. 'కర్ణాటక

చ్ఛందోనుశాసనము'న మాత్రము సమానాక్షరమ్, మహోక్షరమ్ వంటి రూపములు కలవు.

సూర్యరాయాంధ్ర నిఘంటువు 'అక్కర'ను ఒక జాతి పద్య విశేషముగను, 'అక్కరము' అనుదానిని అక్షరమునకు వికృతిగను చూపుచున్నది. తదుపరి అక్కరమునకు అకారాది వర్ణముతోపాటు అక్కర అను నర్థములో 'మధ్యాక్కరంబు' వంటి ప్రయోగమును చూపుచున్నది. శబ్దరత్నాకరమున అక్కర శబ్దము లేదు. అక్కరము అనుదానికి అకారాది వర్ణ మను నర్థము కలదు. అక్షరమునకు కన్నడమున 'అక్కర', తమిళమున 'అక్కరం' అను తద్భవ రూపములు కలవు. తెలుగులో అక్షరమునకు తద్భవము అక్కరము. అచ్చర మని కూడా వ్యవహారమున కలదు. వాల్మీకి చరిత్ర మొదలగు కావ్యములందు అచ్చర మను ప్రయోగము కలదు. దీనికి తమిళమున 'అచ్చరం', కన్నడమున 'అచ్చర' అను రూపము లున్నవి.

తెలుగులో అక్కర శబ్దము మధ్యాక్కర/ మధ్యాక్కరము వంటి పద్య విశేషముగనే ప్రయోగింపబడును. అక్షరార్థమున మాత్రము 'అక్కర' అని కాక 'అక్కరము' అనియే ప్రయోగింపబడును. అందువలన అక్కర శబ్దము కన్నడ వికృతి యనియు, అదియే పద్య నామముగా రూఢి అయినట్లును ఒక ఊహ.

తెలుగు ఛందోగ్రంథములందును, నిఘంటువులందును అక్కర - అక్కరము అను శబ్దములు లఘురేఫ(ర)తోనే కలవు కాని అలఘు రేఫ(ఱ)తో లేవు. అలఘు రేఫము తత్సమ తద్భవములందు లేదనెడి బాలవ్యాకరణ సూత్ర మిచట లఘురేఫను సమర్థించుచున్నది. అలఘురేఫతో గల అక్కఱ శబ్దమునకు నిఘంటువులందు అపేక్ష, కొఱత మొదలగు అనేకార్థములు కలవు. ఒక పద్య నామ మని కాని, అకారాది అక్షరమని కాని లేదు. కాగా, పద్య విశేష మగు అక్కర శబ్దమున నున్నది లఘు రేఫయే కాని అలఘు రేఫ కాదని తెలియుచున్నది. 'తద్భవములందును నలఘు రేఫము గలదు' అనెడి ప్రౌఢవ్యాకరణ సూత్రమునకు లక్ష్యముగా కఱకంఠుడు వంటి రూపములు కలవు కాని 'మధ్యాక్కఱ'మను రూప మీయబడలేదు. తెలుగు ఛందో గ్రంథము లన్నిటియందును మధ్యాక్కర మొదలగు అక్కర లన్నియు లఘురేఫతోనే కలవు. ఆధునిక విమర్శ గ్రంథములందు కూడ సాధు రేఫమే గ్రహింపబడియుండగా విశ్వనాథవారు మాత్రము మధ్యాక్కఱలో శకట రేఫను గ్రహించిరి. కాని ఛందో గ్రంథములయు, నిఘంటువులయు ఆధారముచే మధ్యాక్కరలో లఘురేఫమే గ్రహింపవలసియున్నది. నేటి ఉచ్చారణలో లఘురేఫ అలఘురేఫలు అభేదత్వమును పొందినవి. అయినను, ఉభయ రేఫలు లేఖనమున నిలిచి యుండుటచే నింత చర్చ చేయవలసివచ్చినది.

లక్షణ గ్రంథములలో పంచ విధాక్కరలయందును ఉపయుక్తము లగు గణముల సంఖ్యను బట్టి మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర అను క్రమము చెప్పబడును. శబ్దరత్నాకర, సూర్యరాయాంధ్ర నిఘంటువులందు అక్కర శబ్దమున కర్థముగా మధ్యాక్కరతో నారంభించి మహాక్కరాదులు క్రమముగా చెప్పబడినవి. ఇది తెలుగులో ఇతర అక్కరల కంటె మధ్యాక్కరకు గల ప్రాముఖ్యమును సూచించుచున్నది. మధ్యాక్కరలో తప్ప కడమ నాల్గు అక్కర లందును చంద్రగణము లుండుటయు దీని కొక హేతు వై ఉండును.

మధ్యాక్కర నాలుగు పాదముల పద్యము. నాల్గు పాదములకు లక్షణము సమానము. ఒక పాదమునకు వరుసగా రెం డింద్ర గణములు ఒక సూర్య గణము మరల రెం డింద్ర గణములు ఒక సూర్యగణము ఉండును. నాల్గవ గణాద్యక్షరము యతి స్థానము. ప్రాస నియమము కలదు. మధ్యాక్కరలో తప్ప కడమ నాల్గు అక్కరల యందును చంద్రగణములు కలవు. ఇది కవిజనాశ్రయాది ఛ్ఛందోగ్రంథములలో చెప్పబడిన లక్షణము. కాని నన్నయభట్టారకునియు, నన్నయకు పూర్వము వెలసిన బెజవాడ యుద్ధమల్లుని శాసనము నందలియు, మధ్యాక్కరలలోని కొన్ని పాదములు పై లక్షణమునకు కుదురుట లేదు. వీని యందలి యతి స్థానము ఐదవ గణాద్యక్షరము. ఇదియు పై లక్షణమునకు విరుద్ధమే. ఇట్టి విధమైన ఛందోవైలక్ష్యణ్యముచేత మధ్యాక్కరకు విమర్శ యందు ప్రత్యేక స్థానము కలదు.

చంపకోత్పలాది వృత్తములకు కంద సీసాది జాత్యుపజాతులకు గల బహుళాదరణ ప్రశస్తులు అక్కరలకు లేవనవచ్చును. మధ్యాక్కరకు మధురాక్కరకు విరళముగ నైనను కావ్య ప్రయోగములు కలవు కాని కడమ అక్కరల కట్టి ఉదాహరణములు మృగ్యము. మధ్యాక్కరకు నన్నయ తరువాత ఆదరణ లేకపోవుటకు దానికి గమన సౌందర్యము లేకపోవుట ఒక కారణ మనెడి అభిప్రాయము కలదు. ఈ సందర్భమున ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు (1983:85) ''మధ్యాక్కఱలో గతి మందముగా నుండును. యతి ప్రాస లున్నను అది వచనము వలెనే నడచును. అందుచేతనే పూర్వ కవులు దాని నుపేక్షించియుందురు. ఉపేక్షిత మైన ఆ వృత్తములో వేయికి పైగా పద్యములు వ్రాసి దానికి గమన సౌష్ఠవము కల్పించి తిరిగి ప్రాణ ప్రతిష్ఠ గావించినవారు విశ్వనాథవారే.'' అని ప్రకటించిరి. అట్లయినచో నన్నయ మధ్యాక్కరలకు గమన సౌందర్యము లేదందుమా? దానిని నిరూపింప గలమా? విశ్వనాథ వా రెట్లు వేయి మధ్యాక్కరలను రచింప గలిగిరి? అనెడి అంశములను పరిశీలింపవలసియున్నది.

పద్యము యొక్క గమన సౌందర్యము అక్షర సంయోజనము, గణముల కూర్పు,

గణానుకూలమైన పదముల కూర్పు, యతి మైత్రి, పాదము ఎత్తుగడ మొదలగువానిపై ఆధారపడి యుండును. ఇందలి (1) అక్షర సంయోజన మనగా హ్రస్వ దీర్ఘములయు అల్పప్రాణ మహాప్రాణములయు, బిందు పూర్వకాక్షరములయు, సంయుక్తాక్షరములయు, క్రమ ప్రయోగము. అనగా నదే వర్ణము కాక అదే ధర్మము గల వర్ణము ఒక క్రమము నాశ్రయించి పునరావృత్తమగుట గమన సౌందర్య హేతువు కాగలదు. (2) గణముల కూర్పు అనగా నియమిత స్థానములలో గణము యొక్క క్రమ ప్రయోగము. మధ్యాక్కరకు రెండింద్రగణము లని నపుడు రెండును భగణములే అగుట వంటిది. మొదటి పాదములో నొక స్థానమున భగణ మున్నచో కడమ పాదములం దదే స్థానమున భగణ ముండుట వంటిది. పాద మధ్య మందలియు, పాదాంత మందలియు సూర్య గణము హగణ మగుట, నాలుగు పాదములు నట్లే కూర్చుట వంటిది. ఇదే విధమున గణ ప్రయోగమునం దొక క్రమమును పాటించుట గమన సౌందర్యమున కొక కారణ మని చెప్పవచ్చును. (3) గణానుకూలమైన పద ప్రయోగ మనగా ఒక గణమునకో లేక రెండు గణములకో ఒదుగు పదములనే స్వీకరించుట. గణాంతముతోను పాదాంతముతోను పదము ముగియుట . ఉదాహరణకు ''నాతల సర్పమంజీర నీపాద నాళీకమందు'' (శ్రీగిరి-4) అనెడి విధమున కూర్చుట గమన సౌందర్య సాధకము. (4) యతి మైత్రి అనగా పాదాద్యక్షరము పాద మధ్య నియమి తాక్షరముతో మైత్రి కల్గియుండుట. ఇది సాధారణ నియమము. వర్గజయతి వంటి అధిక సారూప్యతయు, శ్రవణ సుభగతయు కలిగిన యతి మైత్రి గూర్చుట. అక్షర మైత్ర్యాత్మక మైన యతితోపాటు పదచ్ఛేదాత్మక మైన యతియు కూర్చుట. యతి మైత్రి చెల్లెడి అక్షరములు రెండును గురువులుగను, లేక లఘువులుగను కూర్చుట. దీనితోపాటు వాక్య విరామము కూడ పద్య గమనమును నిర్ణయించును. (5) పద్యము ఎత్తుగడ అనగా పద్యము నారంభించుట లోని మెలకువలు. ఇది పదముపైనను గణము పైనను వాక్యముపైనను ఆధారపడి యుండును. పాదములను గురువుతో నారంభించిన దాని నడక కొక గాంభీర్యము చేకూరు ననవచ్చును. పద్యారంభము పద్యమునకు శిరసు వంటిది. అనగా పద్యము నారంభించుటలో నా వాక్యము యొక్క భావమును బట్టి గమనము నిర్దేశము గావలయును. ఇది కవి స్వేచ్ఛపై ఆధారపడియుండును. స్థూలముగా, గమన సౌందర్యమును నిర్దేశించుటకు వీనిని లక్షణములుగా చెప్పవచ్చును. ఈ లక్షణము లన్నియు లేక కొన్ని యుండినను గమన సౌందర్యము చేకూర గలదు. లేక, వేరైన లక్షణము లేవి యైన నుండవచ్చును. ఇదంతయు కవి ప్రతిభపై నాధారపడియుండును.

మధ్యాక్కర వంటి పద్యములు వాని ప్రాథమిక దశలో తాళలయాన్వితము లైన

గేయముల రూపమున నుండెడి వనియు, అవి శిష్టసాహిత్యమున ప్రవేశించినప్పటినుండి వానికా లక్షణము సన్నగిల్లిన దనియు జాత్యుపజాతుల చరిత్రను బట్టి తెలియుచున్నది. పద్యమునకు కూడ తాళలయానుకూల్యమబ్బినచో ఆ పద్యమునకు గమన సౌందర్యము కలుగును. ఈ విధమున మధ్యాక్కరలో మాత్రాగణ సమకత్వము దాని నడకకు సౌందర్యమును చేకూర్చుచున్నది. ఈ తాళ లయానుకూలత గణ సమకత్వముచే కూడ కలుగును. భీమనాదుల లక్షణము ననుసరించి మధ్యాక్కర పాదమును సమాన లక్షణము గల రెండు చిన్న పాదములుగా చేయవచ్చును. దీనిని పద చ్ఛేదముతో సూచించినచో నది కూడ పద్యము యొక్క నడకను నిర్దేశించును. అయిదవ గణాద్యక్షరముతో యతి మైత్రి కూర్చిన యెడల నచ్చట పద చ్ఛేద విరామము కూడ నున్నచో నదియు సౌందర్య హేతు వగును. ఇటువంటి కొన్ని నిర్దుష్టమైన లక్షణముల నేర్పరచుకొని మధ్యాక్కరలను పరిశీలించిన, ఆ పద్యముల గమన సౌందర్యము తెలియగలదు. 'అంతట రాములవారు అంగన సీతను గూడి, సంతస మందుచు వేగ స్వపురానికి చనుదెంచి' అను జానపద గేయమున 'స్వపురానికీ' అని దీర్ఘీకరించి పాడునపు డా పాట స్పష్టముగా రెండు మధ్యాక్కర పాదము లగుచున్నది. ఇందలి గమన సౌందర్యము సుస్పష్టము. గేయమగుటయే దాని విశిష్టత. దీని ననుసరించి పైని తెలిపినట్లు గమన సౌందర్య హేతువుల నూహించుటలో ననౌచిత్యము లేదు.

ధరణిఁ జరాచర భూత సంఘంబుఁ దమ విషవహ్ని
నురగంబు లేర్చుచు నునికి కలిగి పయోరుహగర్భుఁ
డురగ విషాపేత జీవ సంజీవ నోపదేశంబు
గరుణ గాశ్యపునకు నిచ్చి నఖిల లోక హితంబు పొంటె.

పై మధ్యాక్కర పద్యము నన్నయ భట్టారకుని భారత భాగము (2-185) నందలిది. దీనిలోని మొదటి పాదమున యత్యక్షరములు రెండును లఘువు లగుట చేతను, వర్గజ యతితో పాటు యతి స్థానమున పదచ్ఛేద రూపక విరామము కూడ పాటింపబడుట చేతను ఆ పాదమునకు ఒక సౌందర్యము కలుగు చున్నదని యనవచ్చును. కడమ మూడు పాదములలోనిట్టి లక్షణములు లేవు. పాద మధ్యమున పదచ్ఛేదమున్నది. గణానుకూలమైన పద ప్రయోగము వంటి ఇతర లక్షణములు ఈ పద్యమున లేవు. నాలుగు పాదములు లఘ్వాది గణములతోనే నారంభమగుచున్నవి. ఈ విధముగ పద్య గత లక్షణములు దాని నడకకు చెప్పుకొనదగిన ప్రత్యేకతను చేకూర్చుటలేదు. సుమారుగా నన్నయ మధ్యాక్కర లన్నియు నిదే విధముగ నున్న వనవచ్చును.

శ్రీనీరధి నిషంగ, భక్తజనతతి శ్రేయోఽనుషంగ
మానాథ శరసంగ, ప్రౌఢ వృషభరాణ్మాద్యత్తురంగ!
క్ష్మా నూతన శతాంగ సంగతోష్ణీష సౌరాంబు భంగ!
శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఈ పద్యము విశ్వనాథవారి మధ్యాక్కర శతకములలో మొదటి దగు శ్రీగిరి శతకములోని మొదటి పద్యము. ఇందధికముగ రెండింద్రగణముల కొక సమాసమును, ఒక సూర్య గణమున కొక ప్రత్యేక పదమును కూర్పబడినవి. చివరి పాదమున తప్ప మిగిలిన పాదములలోని యత్యక్షరమున్నియు గురువులే. నాల్గుపాదములును గుర్వాది గణములతో నారంభింపబడినవి. నాల్గు పాదములలోను మొదటి గణములు తగణములే. పదచ్ఛేద రూపక విరామము ఒకటి, మూడు పాదములలో యతి స్థానమునను, నాలుగు పాదములందును పాదమధ్యమునను కలదు. ఈ విధముగా నీ పద్యములోని లక్షణములు దాని గమన సౌందర్యమునకు హేతువు లగుచున్నవి. అధికముగా నంత్యప్రాస శ్రవణ సుభగత్వమును కూర్చుచున్నది. విశ్వనాథవారి మధ్యాక్కరలలో నెక్కువుగ నిట్టి లక్షణములను గాంచనగును.

ఇట్టి పరిశీలనము వలన నన్నయ మధ్యాక్కరలకు లేని గమన సౌందర్యము విశ్వనాథవారి మధ్యాక్కరలకు ఉన్నట్లుగ నిరూపిత మగుచున్నది. ఈ సందర్భమున నీ పరిశీలనములోని సామంజస్యమును ప్రశ్నింపదగును. నన్నయానంతర మీ పద్యమును కవు లెవ్వరు నాదరింపకుండుటకు దాని కింపైన నడక లేకపోవుటయే కారణమను అభిప్రాయము కలదు. ఈ ఆధారముచే మధ్యాక్కర లక్షణము ననుసరించి దాని నడక కొక ప్రత్యేకతను సూచింపవచ్చును. ఆ ప్రత్యేకతను అనగా గమన సౌందర్యము నా విష్కరించుటకు పైని పేర్కొనిన విధమున కొన్ని లక్షణముల నేర్పరచుకొనుట అయుక్తమనిపించదు. దీనివలన నన్నయ మధ్యాక్కరలకు గమన సౌందర్యము లేకపోవుటచే ఇతర కవు లాదరించలే దనియు దానిని విశ్వనాథవారు చేపట్టి గమన సౌందర్యమును కూర్చినా రనియు వెల్లడి అగుచున్నది. ఇట్లు చెప్పుటచే నన్నయ గౌరవము తగ్గింపబడినదని తలంపరాదు. ఏలన, నన్నయ గౌరవము తగ్గుట, హెచ్చుట యేమి? విమర్శయం దిట్టి అభిప్రాయము లుండవు. నన్నయ మధ్యాక్కరల లక్షణములలోని విలక్షణతల కింకను సరి అయిన ఆధారమును నిరూపింప వలసి యున్నది. అయినచో, గమన సౌందర్య నిరూపణమునకు పైని సూచించిన లక్షణములు నన్నయ మధ్యాక్కరలకు కుదరనిచో నందసామంజస్యము ఏమియును లేదు. ఆ మహాకవి తన మధ్యాక్కరల కెట్టి అపురూప మైన నడకలు నేర్పెనో!

దివ్య వస్తువులను గాంచుట కీ చర్మ చక్షువులు చాలనట్లు, ఆదికవి నన్నయ భట్టారకుని మధ్యాక్కరలను విమర్శించుట కీ విమర్శన సూత్రములు, ఈ రచయితయు చాలక పోవచ్చు. అనగా పండితు లింకను నన్నయ మధ్యాక్కరలను గురించి పరిశోధింప వలసియే యున్నదని తాత్పర్యము. అనగా పరిశోధకుల కంతు చిక్కని అంశము లున్నచో ఆ వస్తువునకు గౌరవము పెరుగునే కాని తగ్గదుకదా! మధ్యాక్కర యొక్క సౌందర్యమును నిర్ణయించుట కిదొక సూచన మాత్రమే. నన్నయ విశ్వనాథల మధ్యాక్కరల నీ దృష్టితో సంపూర్ణముగా పరిశీలించినయెడల దాని రచనలోని విశిష్టత సుస్థాపిత మగును.

విశ్వనాథవా రీ వేయి మధ్యాక్కరలలోను నన్నయ మార్గము ననుసరించి ఐదవ గణాద్యక్షరముతోనే యతి మైత్రి కూర్చిరి. కొన్ని పాదములందు ఐదవ గణాద్యక్షరముతోపాటు నాల్గవ గణాద్యక్షరముతోను యతి చెల్లించిరి. ఇది యాదృచ్ఛికము కావచ్చును. (అనుబంధము-1) కల్పవృక్షములోని మధ్యాక్కరలలో వారు నాల్గవ ఐదవ గణాద్యక్షరములు రెండింటితోను యతి మైత్రి పాటించిరి.

విశ్వనాథవారు తరచుగా గణానుకూలమైన పదమును, రెండు గణములకు పరిమితమగు సమాసమును ప్రయోగింతురు. అలతి అలతి పదములను గ్రహించి అనల్పార్థమును ప్రతిపాదింతురు. తరచుగా కొన్ని పాదముల నాల్గవ గణారంభమునందును, కొన్ని పాదముల ఐదవగణారంభమునందును కొన్ని పాదముల రెండు తావులందును పదచ్ఛేదము పాటించిరి. అట్లే పాదాంతములందు కూడను. నాలుగు పాదములందు ఒకే స్థానమున గణసామ్యమును కూడ నిర్వహించిరి. నాల్గవ పాదమున మకుట ముండుటచే దానియందు పరిమిత యతిమైత్రులు పాటింపవలసి యున్నది. వీరు తరచుగా స్వరప్రధాన, సరస, వర్గజ, అనుస్వారసంబంధ, అనునాసికాక్షర, అభేద యతులను; అరుదుగ ప్లుత మవర్ణ విరామము మొదలగువానిని ప్రయోగించిరి.

మధ్యాక్కర పద్యము యొక్క విశిష్టతయా అనునట్లు 'విశ్వనాథ మధ్యాక్కఱల' ముద్రిత ప్రతిలో కూడ కొన్ని పాదములు లక్షణమునకు కుదురుట లేదు. (అనుబంధము-2) పర్యవసానముగ, నన్నయ విశ్వనాథల మధ్యాక్కరలను వాని గమన సౌందర్యమును ప్రత్యేకముగా నింతకు మించి పరిశీలింప వలసియే యున్నదని తేలుచున్నది.

# 7. 'విశ్వనాథ మధ్యాక్కఱల' పరిచయము

'విశ్వనాథ మధ్యాక్కఱ' లనునది విశ్వనాథవారు మధ్యాక్కర పద్యములలో వెలయించిన పది శతకముల సంపుటి. తెలుగులో నీ పద్యమునకు గల విశిష్టతను పురస్కరించుకొని కవి ఆ పద్య నామమునకు తమ నామము జోడించి గ్రంథ నామముగా నుంచిరి. ఇది యొక ప్రత్యేకత. ఇవన్నియు భక్తి, ఆధ్యాత్మిక విషయములు ప్రధానముగా గల శతకములు. ఇందొక్కొక్క శతకమున సుమారు నూరు పద్యములు కలవు. ఒక్క మున్నంగి శతకములో మాత్రము నూటయేడు పద్యము లున్నవి. ఇవికాక ప్రతి శతకము చివరను దాని మొదటి పద్యమే తిరిగి ఈయబడినది. విశ్వనాథవారు ఈ శతక పద్యముల ద్వారమున పరమేశ్వరుని స్తుతించిరి. పరమేశ్వరానుగ్రహము కలుగువరకు స్తోత్రము ఆ వృత్తియగుచు స్తుతి కొనసాగుచునే యుండును. అందుచేత శతకాంతమున తొలి పద్యము తిరిగి వచ్చి శతకమూలక స్తోత్రము యొక్క ఆ వృత్తిని సూచించుచున్నది. అట్లు పునరావృత్తమైన పద్యములను వదలి లెక్కింపగా మొత్తము ఒకవేయియేడు మధ్యాక్కర లగుచున్నవి. తదుపరి కృతి భర్త నాశీర్వదించుచు వ్రాసిన నాలుగు పద్యములు కూడ మధ్యాక్కరలే. ఈ ఆశీఃపద్యములలో 'ఈ పుస్తకము నిల్వవచ్చును వృత్త వైశిష్ట్యంబు మహిమ' అని విశ్వనాథవారు వ్రాయుటను బట్టి మధ్యాక్కరను వారుద్దేశ పూర్వకముగా గ్రహించినట్లు తెలియుచున్నది. పూర్వము వెలువడిన భక్తి తత్త్వ శతకములు చంపక కోత్పలాదు లందునో, కంద సీసాదులందునో రచింపబడినవి. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారు వ్రాసినట్లు ఆంధ్రుల అభిమాన దైవతములు మధ్యాక్కరలలో స్తుతింపబడుట ఈ పద్యము యొక్క విశిష్టత. ఈ శతకమును గూర్చి వారు ''తిక్కన సోమయాజిగారి మార్గమును త్రొక్కి హరిహర అభేదమును అద్వైతమును ప్రతి పాదించునవిగా ఉండుట విశేషము'' అని ప్రశంసించిరి. (లక్ష్మీరంజనం.1970) ఈ అభిప్రాయమా గ్రంథముయొక్క సారాంశము నొక్క మాటలో చెప్పినట్లుగా నున్నది.

విశ్వనాథవారు నన్నయ తిక్కనల యందధికమైన ప్రత్యయము కలవారనియు, వీరిరువురిలో నన్నయపై వారికి ప్రత్యేకాభిమానమనియు నొక అభిప్రాయము కలదు. నన్నయ మాత్రమే మధ్యాక్కరలను రచించుటచేతను, అవి లక్షణ విలక్షణతను కలిగి యుండుట చేతను విశ్వనాథవారు ప్రతినబూనినట్లు ఆ పద్యమునే స్వీకరించి పది శతకములను రచించిరి. యతి విషయమున పనిగట్టుకొని లాక్షణికులను తిరస్కరించి, నన్నయ మార్గము ననుసరించిరి. తిక్కన హరిహరాభేద భక్తిని ప్రచారము కావించెను. తిక్కన భారతము యొక్క ఆశ్వాసాద్యంత్య పద్యములందు ఉపనిషత్ప్రతిపాదితమైన

నిరాకార పరబ్రహ్మతత్త్వము ప్రవచింపబడినది. విశ్వనాథవారీ విషయమును ప్రధాన వస్తువుగా స్వీకరించి మధ్యాక్కర శతకములను రచించిరి. ఈ విధముగ వీరు నన్నయ తిక్కనల ననుసరించినవా రగుచున్నారు.

ఈ మధ్యాక్కర ప్రాచీనమైన దనియు, విస్మృతమైన దనియు, దాని నడక అనాకర్షణీయమైన దనియు నొక అభిప్రాయముండుటచే దానికి గతి మాధుర్యమును కూర్చి, దానిని దైవస్తుతి పరముగను, ఆత్మతత్త్వనిరూపణైక పరముగను రచించి విశ్వనాథవారు దానికొక ప్రాశస్త్యమును కలిగించిరి. ఇటువంటి ఇతివృత్తముతో కూడిన మధ్యాక్కరల వలన నీ పది శతకముల పుస్తకము పది కాలములపాటు నిలుచునని విశ్వనాథవారు విశ్వసించిరి. ఇంకను వారు, కృతికర్త కృతిభర్తల, సచ్చరిత్ర వలనను కూడ నీ గ్రంథము నిల్వవచ్చునని యూహించినట్లు ధ్వనితమగుచున్నది.

ఇందలి శతకములు క్రమముగ శ్రీగిరి, శ్రీకాళహస్తి, భద్రగిరి, కులస్వామి, శేషాద్రి, ద్రాక్షారామ, నందమూరు, నెకరుకల్లు, మున్నంగి, వేములవాడ అనునవి. వీనిలో ఆరు శతకములలో శివుని, నాలుగు శతకములలో విష్ణువుని సంబోధించుచు కవి, అనన్య భక్తిని తత్త్వమును ప్రతిపాదించిరి. ఆశీః పద్యములలో విశ్వనాథవారు '' ఓపి యీ దైవ భావనయు, నొనరింప నూహింతువేని'' అనియు, ''మనసులో నీదైవములను మసలించుకొమ్ము నావలెనె'' అనియు, కృతిభర్త నాశీర్వదించుటనుబట్టి వారు గాఢభక్తిభావ తత్పరులనియు శతకములు భక్తి భావాంబుధులనియు తెలియుచున్నది. ఇందలి భక్తి కేవల సగుణోపాసనమేకాక, ఆత్మ జ్ఞానపూర్వకమైన నిర్గుణోపాసనము కూడ నగుచున్నది. ఇట్టి భక్తితోపాటీ శతకములలో ఉపనిషత్తులలో చెప్పబడిన ఆత్మ పరమాత్మల తత్త్వ మావిష్కరింపబడినది. భక్తి భావముతో పూర్వ కవులా భగవంతుని బాహ్యమున వెలుగొందు సగుణ మూర్తులుగనే స్తుతించిన ట్లధికముగ కనబడును. వారి యం దాత్మాన్వేషణ మరుదుగా కనిపించును. విశ్వనాథవా రంతర్ముఖులై ఆత్మ తత్త్వము నవగతము కావించుకొని, సగుణమూర్తులను అద్వైత భావములతో నిరూపిత మగు పరమ పురుషునిగ నుతించిరి.

ఈ శతకములందు మరి రెండు ముఖ్య లక్షణములు కలవు. ఒకటి: లోకోక్తులను, నుడికారములను ప్రయోగించుట. రెండు: వ్యవహారగతమైన వాక్యముల బాణిలో పద్యములను రచించుట. భాషా పరమైన ఈ రెండు లక్షణములు నీ శతకములందు పుష్కలముగా నున్నవి. ఏ పద్యమును చూచిన నది, లోకోక్తిగాని, నుడికారముగాని, సంభాషణ శైలిలోనుండు వాక్య ప్రయోగముగాని లేకయుండదు. వీని నీ దృష్టితో పరిశీలించినచో తెలుగు భాషాగత మైన జీవలక్షణ మంతయు నొకచో ప్రోవు చేసిన ట్లనిపించును. వ్యవహారగతమైన భాషలో నెంత చైతన్య ముండునో అంతయు వీరి శతకములలో గాంచనగును. ఈ కారణముచే నీ శతక పద్యములు చదివిన కొలది మన

కానంద మధిక మగుచుండును.

మౌఖిక వ్యవహారమునం దున్న వాక్యము యొక్క అవగాహన కా వాక్యార్థమే కాక వక్తకును శ్రోతకును గల సంబంధము, సందర్భము మొదలగు ఇతరాంశములు కూడ సహకరించును. ఆ విధముగ ఇతర విషయములు కూడ దోహదపడినప్పుడే వాక్యావగాహన యందు సంపూర్ణత సిద్ధించును. అటువంటి, వ్యవహారము లోని వాక్యములను గ్రంథస్థ మొనర్చినప్పుడు సన్నివేశగతమైనట్టి ఇతర లక్షణము లేవియు కనిపింపకపోవుటచే, కేవల వాక్యార్థము, ఒక్కొక్కప్పుడు సంపూర్ణావగాహనకు సరిపోదు. 'విశ్వనాథ మధ్యాక్కఱల' లో నిట్టి వ్యవహారగత భాషా ప్రయోగ మధికముగా నుండుట వలన నచ్చటచ్చట అనవగాహనత కూడ కనిపించుచున్నది. పుష్కలముగా నున్న నుడికారగత మైన మాధుర్యము ముందిది యంత చెప్పుకొన దగినది కాదు. ఈ విధముగ నీ శతక సంపుటి విషయమునందును భాషా ప్రయోగమునందును విశిష్టతను సంతరించుకొనినది.



## ఉత్తర ఖండము

# 'విశ్వనాథ మధ్యాక్కఱా' నుశీలనము

## 8. శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఇది 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను గ్రంథములోని మొట్టమొదటి దైన శ్రీగిరి శతకమును గూర్చిన విమర్శ. ఈ శతకమున విశ్వనాథవారు వేదోపనిషత్సిద్ధాంతములకు సారభూతమైన వ్యాఖ్యానము గావించిరి. ఆధ్యాత్మిక అంశముల నెన్నింటినో పద్య రత్నములుగా కూర్చిరి. కాగా, భక్తియు, తత్త్వజ్ఞానము నీ శతకమునందలి ప్రధాన వస్తువు. ఇందు విశ్వనాథవారు తమ భక్తి భావనను, ధ్యానము చేసిన విధానమును, తమ కనుభూత మైన భగవత్తత్త్వమును మనోహరముగా వివరించిరి. వ్యవహార వాక్యసరణిని శక్తిమంతముగా నిర్వహించిరి. 'శ్రీశైల మల్లికార్జున మహాలింగ!' అను మకుటము, పాదము యొక్క రెండవ ఇంద్రగణములోని చివరి గురువుతో నారంభ మగుచున్నది. 'మల్లికార్జున మహాలింగ' అనునది ద్వితీయార్ధభాగమై, పాద మధ్యమున విరుపుదల కలిగి, 'ర్జు' యతిస్థాన మగుచున్నది.

భక్తి సాకార నిరాకారోపాసనలచే ద్వివిధము. రెంటికిని తుల్య ప్రాధాన్యము కలదు. విశ్వనాథవా రీ శ్రీగిరి శతకమున రెండు విధము లైన భక్తి మార్గములను ఆశ్రయించి పరమేశ్వరు నర్చించిరి. అర్జునుడు శ్రీకృష్ణునితో, 'కొందరు భక్తు లెల్లప్పుడు నీ యందే మనస్సును నిలిపి నిన్నర్చించుచున్నారు. కొంద రింద్రియ గోచరము కాని అక్షర పరబ్రహ్మము నుపాసించుచున్నారు.' అని పలికి, ఈ ఇరు వర్గములలో యోగము బాగుగ నెరిగిన వారెవ రని ప్రశ్నింప, శ్రీకృష్ణుడు తొలుదొల్త సాకార పర బ్రహ్మము నర్చించు భక్తులను, పిదప నిరాకార అక్షర పర బ్రహ్మము నుపాసించు జ్ఞానులను చెప్పెను. అనంతరము నిర్గుణోపాసనా మార్గము దుర్లభమని కూడ చెప్పెను. (భగవద్గీత. భక్తి యోగము. 12.1-5) విశ్వనాథవా రిట్టి భక్తి

తత్త్వమునుబాగుగ నెరిగి భక్తి జ్ఞానములకు సమ ప్రాధాన్యము నొసగి, వానిని ఈ శతకమున ప్రతిపాదించిరి.

### పరబ్రహ్మ తత్త్వము

ఆవిల జాగ్రదవస్థయందు స్వప్నావస్థయందు
జీవుని యనుభవభేద మింతగాఁ జెందియు నొకఁడె
జీవాత్మ పరమాత్మ యట్లె భేదమ్ము చెందియు నొకఁడె
ప్రోవైన తెల్వి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (16)

ఈ పద్యమున విశ్వనాథవారు శ్రీశైలమల్లికార్జునుని అనిర్వాచ్యమగు పరబ్రహ్మముగా 'ప్రోవైన తెల్వి' యను విశేషణముచే సూచించిరి. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' ,'ప్రజ్ఞానం బ్రహ్మ' అను శ్రుతి వాక్యములచే 'తెల్వి' యనగా జ్ఞానము. 'ప్రోవైన తెల్వి' యన అఖండ జ్ఞానము. అనగా పరబ్రహ్మము. జాగ్రత్స్వప్న సుషుప్తు లనునవి అవస్థాత్రయము. తొలి రెండ వస్థల నీ కవి యిచ్చట ప్రస్తావించిరి. జాగ్రదవస్థయందు జీవాత్మ స్థూల శరీర తాదాత్మ్య భావము నొంది బాహ్యేంద్రియముల ద్వారా పొందెడి అనుభవము స్థూలార్థానుభవము. జీవుని సూక్ష్మ శరీరావస్థ స్వప్న మనబడును. ఈ స్వప్నావస్థయందు సూక్ష్మ శరీరము మాత్రమే ప్రకాశించును. 'స్వప్నమున ప్రత్యగాత్మ స్వయంప్రకాశుడై, బుద్ధి మాత్రమే యుపాధిగాఁ గలిగి సమస్త భావమునకు సాక్షీభూతుడై ఉపాధి కృత కర్మములచే తాకబడడు.' (ఆదిశంకరులు: వివేకచూడామణి శ్లో. 101) కావున జాగ్రత్స్వప్నావస్థల యందు జీవుని యనుభవ భేద ముండియు ఆత్మ మాత్ర మొక్కటియై ప్రకాశించును. అవస్థలు మూడింటి యందును అంతస్సార మగు ఆత్మ ఒక్కటియే అనియు, అన్ని వికారములు దాని యందు లయ మగుననియు, మాండూక్యోపనిషత్తునం(7)దిట్లు చెప్పబడినది. '... ఏకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః'. తదుపరి పరమాత్మ స్వయముగ సర్వాత్మకుడు సర్వస్వరూపుడై మిథ్యాత్మబుద్ధిచే కారణ దేహమందు జీవ భావము నొందును. ఇది మృత్తు వేరు ఘటము వేరు అనుకొను విధమున భ్రాంతియే కాని సత్యము నాలోచింప మూల మొక్కటియే; ఆత్మేతర మేదియు లేదు అని వివేక చూడామణి యందు చెప్పబడినది.[1] ఇట్టి ఆత్మానాత్మ వివేకమును తెలియ జెప్పు ఉపనిష ద్విషయమును

[1] స్వయం పరిచ్ఛేద ముపేత్యబుద్ధే ,స్తాదాత్మ్య దోషేణ పరం మృషాత్మనః
సర్వాత్మకః సన్నపి వీక్షతే స్వయం, స్వతఃపృథక్త్వేన మృదోఘటానివ। (ఆదిశంకరులు శ్లో.192)

విశ్వనాథవారీ పద్యమున నిక్షిప్తమొనర్చిరి. శ్రీశైల స్వామియందు పరమాత్మ తత్త్వము నారోపించిరి.

'నీ మేలి కదలికలోని క్రొవ్వెల్గు నీరధిలోన, నేమేమొ తరగలు లేవ వలయు...'(24) అను వాక్యమున విశ్వనాథవారు పరబ్రహ్మము యొక్క అనంత కాంతిమత్త్వమును చెప్పిరి. జీవాత్మ, పరమాత్మకు చెందునే కాని పరమాత్మ జీవాత్మకు చెందదను విషయమును, అద్వైతము నందు సముద్రమునకు చెందినవే తరంగములు కాని సముద్రము తరంగములకు చెందినది కాదనెడి దృష్టాంతముతో సమర్థింతురు. ఇట్టి అద్వైత తత్త్వము పై వాక్యమునకాధారము. భగవానుడే ఈ విషయమును 'మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా, మత్స్థాని సర్వ భూతాని నచాహం తేష్వవస్థితః' (భగవద్గీత. 9.4) అని చెప్పెను. అనగా జగత్తంతయు అవ్యక్తరూపమగు పరమాత్మచే వ్యాపింపబడి యున్నది. సర్వప్రాణులు పరమాత్మ యందున్నవి కాని అది అన్నిటియందుండుట లేదు. అయినను విశ్వనాథవారు తమ కవిత వేదోపనిషత్సార భూతమగు పరబ్రహ్మమును వచించు ననియు, అట్టి శ్రీశైల పతి అనాది బంధువనియు బ్రహ్మము - ప్రకృతి భిన్నములుగా తోచుననియు 'వేదాంతములలోని వేదములలోని విమలార్థ చయము వాదించు నా కైత...'(15) అను పద్యమున చెప్పిరి.

శ్రీశైల మల్లికార్జునుని యందు వారు పరబ్రహ్మమును కాంచిరి. అనగా సగుణరూపమునకును నిర్గుణ బ్రహ్మమునకును అభేదము చెప్పుట. ఇది జ్ఞాన భక్తులకు గాని సాధ్యము కాదు. విశ్వనాథవారిట్టి జ్ఞానులగుటచే 'తొలి వెలుంగా నీవు నన్ను రక్షింపం దూగుచున్నావు'(26) అని ధైర్యముగా పర బ్రహ్మమును ప్రశ్నించుచు, వేడుచున్నారు. శ్రీశైల స్వామిని 'తొలి వెలుంగా' అని సంబోధించుట సగుణ రూపమునకు బ్రహ్మముతో నభేదము చెప్పుటయే. చిద్రూపమగు పరబ్రహ్మము జగత్ప్రకాశము. తిక్కన తనకనుభవమైన అద్వైత రూపమును, 'కాంతి పూరము శోభిల్లు శాంతమూర్తి' యని చెప్పెను. విశ్వనాథవారిది కూడ, నిట్టి అద్వైత భావమే.

## యోగవిద్య

'అటు సుఖావధివౌచు నీవు, దుఃఖాని కవధియై నేను, ఘటియించు దుఃఖంబు చివరజ్యోతివై కన్బొమల్ నడుమ...' (66) అను పద్యమున ధ్యానమగ్నుడగు ముముక్షువునకు కన్బొమల నడుమ కాంతి పుంజము వలె కనిపించు ఆత్మ, తమకు ప్రత్యక్షమైన విషయము నిచ్చట చెప్పిరి. ' ఆనందో బ్రహ్మ' యను శ్రుతి వాక్యము ననుసరించి బ్రహ్మము ఆనంద మయము. కావున పరమాత్మ సుఖావధి. స్థూల, సూక్ష్మ దేహముల నాశ్రయించిన ఆత్మ, ఇంద్రియ జయము నొందువరకు

దుఃఖమయమే. అందువలననే కవి 'నేను దుఃఖానికవధి' యని వ్రాసిరి. ధ్యానమునకు యోగవిద్య సాధనము. యోగాభ్యాసము నందు భ్రూమధ్యమమున చూపు నిలిపి పైకి చూచుటను ఖేచరీ ముద్ర యందురు. ఇది పంచముద్రా లక్షణములలో నొకటి. (లింగ మూర్తి 1934:1.106) దీని ద్వారా కవి కనుబొమల నడుమ జ్యోతిని దర్శించిరి. దీని యనుభవమును వారు 35, 43 మొదలుగాగల పద్యములలో కూడ చెప్పిరి.

హృదయస్థానమునందు షట్చక్ర కమలమున నివసించిన ఆత్మయనబడు చిత్కళయే, పంచవిధ ముద్రల నభ్యసించిన సాధకునకు, అంతిమమున జ్ఞాన సూర్యోదయముగా భాసించును. మహాప్రకాశముతో వెలుగొందు ఆ జ్ఞాన సూర్యుడు మొట్టమొదట భ్రూమధ్యము నందాజ్ఞా చక్రమున ఉదయించును. అనంతరము హృదయాకాశ మధ్యభాగము నధిష్ఠించును. జ్ఞాన భాస్కరోదయమే జీవన్ముక్తి. ఇది ఫాల భాగము నందనుభూతమగును. (లింగమూర్తి 1.144) ఈ క్రింది పద్యము పై విషయములకు లక్ష్యప్రాయమై యొప్పుచున్నది.

ఒకటి నిశ్చయమయ్యె బయట నెచ్చటనుండియో నీవు
ప్రకట శైవానేక కథలలోని రూపాలతో రావు
ప్రకట మత్ఫాలంబు ఫట్టుమంచును బగిలి రావలయు
సుకమొ దుఃఖమ్మొ శ్రీ శైల మల్లికార్జున మహాలింగ! (48)

ఆధ్యాత్మిక జ్ఞాన మరుదుగా లభ్యమగుటచే, భగవంతుడు బయటనుండి వచ్చి, భక్తునికి మోక్షమను దానిని ప్రసాదించు ననెడి విశ్వాసమొకటి వ్యాపించి యున్నది. ఉపనిషత్తత్త్వము బాగుగ నెరిగిన వారికా విశ్వాసము పొరపాటని తెలియును. ఈ అభిప్రాయముతో విశ్వనాథవారు శైవానేక కథలలోని రూపాలతో భగవంతుడు రాడని నిశ్చయమైనదని తెలిపిరి. తదుపరి యోగ విద్యయందు చెప్పబడినట్లు భ్రూమధ్యమున జ్ఞాన సూర్యోదయము కావలయునని కోరుకొనిరి. ఈ శతకములో విశ్వనాథవారు మల్లికార్జునునకు, పరబ్రహ్మమునకు నభేదము చెప్పుచున్నారనునది పై విధముగ విదితమగుచున్నది.

### ప్రతిబంధములు

మానవునికి త్రివిధములగు ప్రతిబంధములున్న యెడల తత్త్వము నెరుగజాలడు. ఇది భూత, భావి, వర్తమాన ప్రతి బంధములు. భూతము ప్రారబ్ధకర్మము. భావి ఆగామి కర్మము. వర్తమానము సంచిత కర్మము. బ్రహ్మజ్ఞానముచే నీ కర్మలు

క్షయింపబడి బ్రహ్మసాక్షాత్కారము కలుగును. ఈ త్రివిధ కర్మలను గూర్చియు, అవి పోవుట కుపాయములను గూర్చియు విద్యారణ్య స్వామి (1965:9.38-47) వివరించిరి. ఎవని కర్మలు జ్ఞానమను అగ్నిచే దహింపబడునో అట్టివానికి మోక్షప్రాప్తి కలుగునని, భగవద్గీత(4.19) యిట్లు రూఢి పరచుచున్నది. '...జ్ఞానాగ్ని దగ్ధకర్మాణాం త మాహుః పండితంబుధాః!' ఈ వేదాంత విషయములోని సాధ్యాసాధ్యములను విశ్వనాథవారు 'జ్ఞానాగ్ని దగ్ధకర్ములని కొంత యాశాద్యోతకముగఁ, బూని చెప్పుటెకాని ...' (29) అను పద్యమున శ్రీగిరి నిలయుని ముందు ప్రతిపాదించిరి. జ్ఞానాగ్నిచే దగ్ధము కావింపబడిన కర్మలు గలవారమని కొంత ఆశాజనకముగా కలదు కాని, ప్రారబ్ధకర్మము మమ్ము వీడుట లేదనియు, ఆగామి కర్మమింకను లేదు కదాయనియు, సంచిత కర్మము కాలిన బొగ్గు అనియు భగవంతునికి నివేదించుచు జ్ఞానయోగము నభ్యసించుట దుర్లభమను విషయమును స్పష్టపరచిరి.

## ఆత్మానాత్మ వివేకము

ఈ ప్రపంచము యొక్క సృష్టిస్థితి లయములకు కారణమా పరమాత్మయే. ఈ విషయమును 'అహం వృక్షస్యరేరివా' అనెడి శ్రుతి వాక్యము సమర్థించుచున్నది. (తైత్తిరీయోపనిషత్తు. శిక్షావల్లి.10) అనగా చరాచర జగత్తను వృక్షమును అంతర్యామిగా ప్రేరేపించువాడా పరమాత్మయే. ఇట్లు జగత్తున బడిన జీవుడు మాయా ప్రభావముచే ఇంద్రియలోలుడగును. కాని మోక్షగామి ఇంద్రియములను జయించవలెను. ఇంద్రియముల ప్రవృత్తి ననుసరించి జీవించువానికి ఆత్మ జ్ఞానము కలుగక మోక్షము లభింపదు. కాగా, పరమాత్మ సృష్టి చేయుట మూలముననే కదా జీవుడు మాయకు వశుడై ఇంద్రియములకు లోబడుచున్నాడు. అట్లగుటచే ఉపాధి ప్రవిష్టుడగు జీవునకు మోక్షప్రాప్తి, అనగా విశ్వాత్మ యందు లీనమగుట కలుగదు. ఇదొక 'దేవుని విడ్డూరము'. ఇట్లనుట లౌకిక దృష్టి. ఈ దృష్టితోనే వారు 'నీదేమి శూరత్వమయ్యా!' అని పరమేశ్వరుని 'ఊరక యుండిన వానిఁ గొనిపోవు టొక సంతలోనఁ...' (37) అను పద్యమున ప్రశ్నించిరి. ఇందలి 'ఊరక నున్నవానిని తీసికొని పోయి సంతలో కూర్చుండ పెట్టుట' అనగా ఆత్మ స్థూల శరీరమును పొందుటయే. సంత లో'నేపదార్థములను కోరరా' దనుట, నశ్వరమగు దేహాదుల యందు భ్రాంతి యుండరాదనుటయే. ఒక వేళ భ్రాంతి యున్నయెడల జ్ఞానము లభింపదనుటయే, 'కోరినచోఁ దలకొట్టి తెచ్చికొన్నట్లే' యనుట. వ్యవహార దృష్టిలో నిందు న్యాయము లేదనిపించును. అందుకే కవి శ్రీశైలపతిని ఇదేమి శూరత్వమని నిలదీయుట. ఇచ్చటి 'తలకొట్టి కొని

తెచ్చికొన్నట్లే' యనెడి లోకోక్తి, జీవుడు తనకు తానుగా నింద్రియములకు వశమగుటవలన కలిగెడి కష్టమును, స్పష్టముగా వ్యక్తపరచుచున్నది.

ఇదే అభిప్రాయమును విశ్వనాథవారు 'ఈవె పోయితి సంత చూతమనుచు నాదేమున్నదనెదొ...' (38) అనెడి పద్యమున కూడ వెలువరించిరి. విశ్వనాథవారు పూర్వ పద్యము('ఊరక యుండిన వానిఁ')లో చేసిన సంభాషణ నీ పద్యములో నిట్లు కొనసాగించుచున్నారు. 'మాయకు వశుడవై జగత్తున జనించుటకు నీకు నీవే పోయితివని, అనగా అవస్థాత్రయ కర్మలను జ్ఞానాగ్నిచే దహింప జాలక పునర్జన్మ నెత్తుటకు నన్నందువేమో ప్రభూ! నీవు వచ్చితివి (అనగా బ్రహ్మము కలదు. వ్యాపించినది) అట్లే నేను వచ్చితిని (అనగా ఆత్మ, స్థూల శరీరమును పొందుట) అయినను నా అధికారమును నీవు తీసికొంటివి. (అనగా జ్ఞానము బ్రహ్మమైయున్నది కాని కూటస్థుడు బ్రహ్మము కాదు.)' అందువలననే త్రోవచూపుమని కవి మల్లికార్జునునకు కైమోడ్చు చున్నారు.(అనగా కూటస్థుడు ఉపాధి నధిగమించి బ్రహ్మము నందైక్య మగుటకు సగుణరూపమగు పరబ్రహ్మమును వేడుకొనుట) దీని వలన విశ్వనాథవారి మోక్షగామిత్వము వెల్లడి యగుచున్నది.

విశ్వనాథవారి దిచ్చట వ్యవహార దృష్టియేకాని, తత్త్వమిట్లు ప్రశ్నించుటకు లొంగునది కాదు. అయినను పురుషున కజ్ఞాన మూలమగు అనాత్మబంధము స్వభావ సిద్ధమై ప్రవాహ రూపమున అనాదియు, అనంతమునై యున్నదని చెప్పబడును. ఈ అనాత్మ బంధమునకు లోనైన పురుషుడు జనన మరణాదులగు వాని ప్రవాహమున బడును. ఈ అజ్ఞాన బంధమును ఈశ్వరానుగ్రహముచే కలుగు ఆత్మజ్ఞానము చేతనే ఛేదించుకొనవలెను గాని, ఇతర విధముల సాధ్యము కాదు, అను నీ అద్వైత తత్త్వమును శ్రీ శంకర భగవత్పాదు లనేక మార్గముల వివరించిరి. భగవద్గీత (9.7) యందు శ్రీకృష్ణుడు 'సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్, కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్' అని ఈ అంశమునే విశదీకరించును.

### ధ్యానము

ధ్యానమంత సామాన్యమైనది కాదు. ఇంద్రియములను నివృత్తి మార్గమునకు త్రిప్పి చిత్తము నాపరమేశ్వరుని యందు లగ్నము చేయుట ధ్యానమగును. ధ్యాన నిష్ఠగలవాడు యోగ బలముచే భగవద్దర్శనము పొందును. కాని మాయా ప్రభావముచే ఇంద్రియముల ప్రవృత్తిని జయించుట పరమమునులకే గాని సామాన్యులకు సాధ్యము కాదు. ఈ యంశమును విశ్వనాథవారు 'ఒకరెల్లగా వత్తువో యుటంచు నేనాగి నిశీథముల...' (10) అను పద్యమున నొక భక్తుని యనుభవమువలె వెల్లడిచేసిరి.

ధ్యాన నిమగ్ను డగు వ్యక్తి ఎట్టకేలకు భ్రుకుటిలో పరమేశ్వరుని దర్శింపబూనినపుడు ఇంద్రియ ప్రాబల్యముచే భగవద్దర్శనము కలుగక మాయా ప్రభావమే మిగులును. భక్తుని ధ్యానముయొక్క పరిణామము నిశీధివలెను, భగవంతుడు కానరాక అజ్ఞానమే మిగులుటను అంధకుని వలెను ఈ పద్యమున చెప్పుటలో గల చమత్కారము అనుభవైకవేద్యము. 'ముకుళించుకొన్న నెన్నుదురు నడుమ నీ మూర్తికై వేతు' ననుటకు 'భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్...' (భగవద్గీత 8.10) అను వాక్యమాధారము. నెన్నుదురు నడుమ, అనగా భ్రూమధ్యమున దృష్టిని నిలిపి సర్వజ్ఞుడగు పరమ పురుషుని ఎడతెగక చింతించిన, మోక్షప్రాప్తి కల్గునని భగవానుని వాక్యము. నెన్నుదురు నడుమ ఈశ్వరుని మూర్తికై వేతునని తమకు కలిగిన యనుభూతిని కవి వెల్లడి చేసిరి. దానిని 'నా రాముడు' కావ్యమునందు (పుట-17) '...మరియాదండ మద్ర్భూలతన్ బూదండంబలె సన్న కాంతి యనఁ గా బొల్చున్ సమీపించుచున్' అని వ్రాసిరి.

### ఆత్మకథనము

విశ్వనాథవారీ శతక పద్యములలో పలు తావులందు పరబ్రహ్మ తత్త్వమును తెలిసికొన జాలమనియు, అది సర్వ వ్యాపకమనియు(86), నిరాకారమైన బ్రహ్మమున్నదని విశ్వసించుట దుర్లభమనియు(87), భగవంతుని లెక్క చేయుటయు, అప్పుడప్పుడా భగవంతుడు కానరాడని కవిత్వము వ్రాయు నాటకము తనదని భావింపవలదనియు, తమ మనసులోని వాంఛలు సులభముగ పోవనియు(91) మొదలైన తమ మనో భావములను ప్రకటించిరి.

### పరిణత భక్తి

నిరంతరము శ్రద్ధతో కూడిన భగవద్ధ్యానముతో భక్తి పరిపక్వత చెందును. ఆత్మ తత్త్వ మవగత మగును. మోక్షము సుగమ మగును. విశ్వనాథవా రనన్య చిత్తముతో భగవంతు నారాధించి హృదయమున నిండుగ భగవంతుని నింపుకొనిన పరిణత భక్తులు. కావుననే వారు-

> నాగుండె తీసి నీ పాదమూలంబునం బెట్టుమనుము
> మాఁగువారిన శ్రద్ధ సుంత మసలిన మార్పేరఁ బిలుము
> ఊగులాడితి నేని వంద జన్మ లిట్లొగ్గకు! నీదు
> జోగిని నేను! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (6)

అని భగవంతుని ప్రార్థించిరి. భగవద్ధ్యానముతో మాగువారిన హృదయమును పరమేశ్వరుని కర్పించుట యనగా తన భక్తిని పరీక్షింపు మనుటయే. భక్తి పరిపక్వతయే మాగువారిన హృదయ మనుట. అనగా ఆత్మతత్త్వము నెరుగుటయే. ఆత్మ సూక్ష్మమై ప్రాణుల హృదయములందు గూఢముగా నుండు నని కఠోపనిషత్తు. [అణోరణీయాన్ మహతో మహీయాన్, నాత్మాస్యజంతోర్నిహితో గుహాయామ్...(2-20)] ఈ ఆత్మయే జీవుడు. జీవాత్మ గమ్యము పరమాత్మ సన్నిధికి చేరుటయే. ఇదియే విశ్వనాథవారి వాంఛ. అందుచేతనే తమ హృదయ మెచ్చట నైనను భక్తితో మాగకున్న మారుపేరుతో పిలువు మని అత్యంత సన్నిహితముగ భగవంతునితో భాషించుచున్నారు. ఈ ధైర్యము, భక్తితో భావన నొందిన ఎద గలవారికి గాని ఉండదు. భక్తి కొంచెము సడలినచో వంద జన్మ లిట్లొగ్గకు మనియు, నీ భక్తుని కనుక కరుణింపు మనియు ప్రార్థించుచున్నారు. పరమ భక్తు లింకే మనగలరు!

హృదయాంతరాళము నందుండు ఆత్మను దాని విశ్వవ్యాపక తత్త్వమును తెలిసి కొనినవాడు జ్ఞాని. ఆత్మ నెరుగుట పూర్వ జన్మ సంస్కారము చేగాని లభ్యము కాదు. అట్లే భ్రాంతిచే జీవాత్మకు భిన్నుడుగా దోచు పరమాత్మను తెలిసికొనుటయు ఉపాసకునికి గాని సాధ్యము కాదు. దీనినే కవి, 'నాలోన నెంతగాఁ ద్రవ్వుకొన్నఁ బినాకి! కన్పడవు ... నీలోనఁ ద్రవ్వి నీ లోఁతు తెలియగానేర...'(3) అని చెప్పిరి. తమ 'నా రాముడు' కావ్యమునందు వారు చెప్పిన 'ఎఱుఁగుటకున్ బరానుభవ మెంతయుఁ గావలె' (16) అను పద్యము పై విషయమునకు వ్యాఖ్యానము వంటిది. మనస్సులో పరమాత్మకై తాను త్రవ్వుకొనలేననియు ఆయనయే అపార కరుణా పూరమును ప్రవహింప జేసి మనోదర్పణమున తానుగా కన్పించు నేరుపును తమకు ప్రసాదింపవలెననియు వేడిరి (28). మరొక పద్యము (4)నందు పరమ శివుని పాద నాళీకము చెంత తమ తలనుంచి నడుము వంచుచు వ్రాల్చిన యట్లు, తమ చిత్తమునందు భాసించుచున్నది యని తమ నిరుపమాన భక్తిని వెల్లడించిరి .

ఒక పద్యము (53)లోని 'నిదుర ఎఱుంగని నీవు నాలోన నిదుర పోయెదవు' అను వాక్యము గుణరహితమగు పరబ్రహ్మము కూటస్థుడగు జీవాత్మయైన వేదాంత విషయమును వెల్లడించుచున్నది. 'కుదిలించి గగ్గోలు చేసినను మేలుకోవు' అను వాక్యము, జీవుడు తీవ్ర తపమాచరించిన గాని జ్ఞాన సిద్ధిని పొందలేడను సత్యమును చెప్పుచున్నది. 'నిదురైన మేల్కొల్పవచ్చు నీదొంగ నిద్దురకేమి రొదచేసి ఫలము' అను వాక్యము ఆత్మకు దేహాదు లశాశ్వతము, ఆత్మ స్థూల శరీరమును ధరించుట పరమాత్మ లీలా విశేషము, కాగా ఆత్మ సాక్షాత్కారము సులభ సాధ్యము కాదు అను విషయము లను ప్రకటించుచున్నది. ఇటువంటి భావములను భక్తితో మేళవించుచు విశ్వనాథవారు శ్రీశైలస్వామితో సంభాషించుచున్నట్లును, ప్రార్థించుచున్నట్లును తమ

మొర నాలకింపు మని కోరునట్లును ఏ పద్యమునకా పద్యమునకే క్రొత్త యూహతో పలు పద్యములను రచించిరి. ఈ విధముగా 54,55,56,57,58,59 సంఖ్యగల పద్యములను చూపవచ్చును.

'ఏవేళ నినుఁ జూచినానొ యావేళ...'(97) అనెడి పద్యమున విశ్వనాథవారు తమ పరిపూర్ణ భక్తి ని వెల్లడించిరి. ఇందు 'నిన్ను చూచిన నాడే నా హృదయము నీ కర్పించితిని. నా భక్తి భావము దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. నా హృదయ ఫలము భక్తి రస భరితమై నీకు సమర్పిత మగుటకు సిద్ధముగా నున్నది. నీ వింకను దాని నేల సేవింప రావు? నా భక్తి, పరిపక్వత నందలేదేమో!' అని నిర్వేదము చెందిరి.

విశ్వనాథవారు తమ హృదయస్థుడగు పరమేశ్వరుడు బయటకు వచ్చుటకు చేయు ప్రయత్నమే తమ కవిత్వమను నపూర్వ భావమును 'నీ వంతరాత్మలో నిలచి వెలికిని నిగుడు యత్నంబు దేవి శారదగ భాసించె' నని చాటుచున్నారు. తదుపరి ఆ విశ్వనాథ శారద, ఈశ్వర కృపచే వారి జిహ్వాగ్రమునుండి పైకి ప్రాకిన వచ్చు హృదయ కమలమే ఆ పరబ్రహ్మము యొక్క స్థానము. ఈ విషయమును వారా శ్రీశైలపతితో 'ఆదేవి, దేవ భవత్కృపా వృష్టిఁ దగునాదు ; జిహ్వాతుదఁ బైకి బ్రాకిన నచట సూవె నీయున్కి' అని విన్నవించుకొనిరి(99). పరమాత్మను పరమ పదము ప్రసాదింపుమని ఇట్లు వేడుకొనిరి.

> పరగ నా శారదాదేవి నీనుండి బయలు దేరినది
> సరసిజభవురాణి యొక్క ధార నా సన్నిధిఁ బ్రాఁకె
> హర ! నన్ను నా ధార వెంట నీవద్ద కరుదేరనీవె
> సురనదీచూడ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! (100)

విశ్వనాథవారికి ప్రసన్నమైన సరస్వతి, పరమేశ్వర కృపాకటాక్షము. దీనినే ఆ శారదాదేవి ధార పరబ్రహ్మమునుండి వారిని చేరినదనుట. అనగా వాణీ ముఖమున వారికిని ఆ భగవంతునికిని యొక మార్గ మేర్పడినది. ఆ మార్గము వెంట పరమాత్మ సన్నిధానమునకు తమను చేరనీయుమని విశ్వనాథవారా పరాత్పరుని వేడుకొనుచున్నారు. వారు భగవంతుని కొక సూత్రమును ప్రతిపాదించి కవిత్వము ద్వారా మోక్ష పదవి నర్థించుట చమత్కారావహమే కాక యుక్తి సహము కూడను.

### నిర్మలభక్తి

'స్నానంబుచేయుచుఁ దుడుచుకొంచును...' (40) అను పద్యములో కవి తన

నిర్మల భక్తిని ప్రకటించిరి. 'ప్రభూ! మల్లికార్జునా! నేనేదో పనిలో నున్నప్పుడు మరణము సంభవింపవచ్చును. అందుచే నీకొక విన్నపము చేయుచున్నాను. అది ఏమన, ఇక నాకు నిన్ను దర్శించెడి భాగ్యమున్నదా యని ఎంతగానో నేను తపించుట, నీవెరిగినచో అదే నాకు తృప్తి, దేవదేవా!' అను నీ పద్య భావము నిజముగా నొక నిర్మల భక్తుని మనోవేదన. ఇట్లీ పద్యమున సాధారణ మగు నొక అభిప్రాయము చెప్పిన విశ్వనాథ వారు 'ఒకచోటఁగూర్చుండి నిన్ను నూహింతునో యన్న...' (41) అను పద్యమున నిట్లు విన్నవించుకొనుచున్నారు. 'నేను కవినైన హేతువుచే లౌకిక కార్యములందు కల్పించుకొనవలసి వచ్చును. అందుచే నొక ప్రదేశమున స్థిరముగా కూర్చుండి నీ ధ్యానము చేయలేను. అట్లే సంసారము కూడ నన్నొకచో కూర్చుండనీదు.' అనగా స్థిర చిత్తమున కవరోధములు కలుగుచున్నవనుట. దీనికి కారణమెట్టి విధమైన పూర్వజన్మ సంస్కారము లేకపోవుట, అని కవి తమ కష్టములను ఆ దేవునకు చెప్పికొనిరి.

## ఆస్తిక్యభావన

భగవంతుడు ప్రేమ స్వరూపుడు. ఆయన దయలేనిదే చిత్తములోని శివుని దర్శింపలేము. భగవానుని కరుణకు నోచుకొనని వారు జన్మరాహిత్యమును పొందక, మాయకు లోనై కష్టములననుభవింతురు. ఇదియే ఆయన దండనము. ఈ విశ్వాసమును 'ప్రియతమ తేజ నాగుండె నీనుండి బెసకనీయకువె...' (65) అను పద్యమున వెల్లడించిరి. లోక వ్యవహారములో బహు రీతుల చెప్పికొను ఆస్తిక సత్యములను, ఈ శతకములోని అధిక పద్యములలో, విశ్వనాథవారు పరమ రమణీయముగ ప్రకటించిరి. మధ్య మధ్య వారు తమ భక్తి భావమును 'తలపు లోపల నీవు నవ్వ్వ గింజంత తారాడ నొడలు, పులకరించెడు గుండె పరమ నిర్వాణముంబొందు' నని వెల్లడింతురు(71). 'నిన్ను గూర్చిన యూహ కాగడావోలె నిలచి కాలెడిని, మున్ను సమృద్ధిగా నాముదంబును బోసితివేమొ'(73) అనునది నిర్దుష్టమైన వారి ఆస్తిక్యభావనకు పూర్వ జన్మ పుణ్య ఫలము హేతు వని చెప్పుట. భక్తి భావమును నిలిచి కాలెడి కాగడావలెను, గత జన్మ సంస్కారమును భగవంతుడు పోసిన ఆముదము వలెను చెప్పిన విధ మా భావమున కలంకారము వలె భాసించుచున్నది. ఇదే విధముగ, అకుంఠిత మైన ఆస్తిక్యభావముతో కవి తన హృదయమున పరమాత్మ నిరంతరము ఉండుననియు, నది చెదరదనియు (81) పలు పద్యములలో చెప్పిరి.

## లోకపరిశీలన

విశ్వనాథవారు ఆత్మ నిత్యత్వము, దేహాదుల యనిత్యత్వము వంటి ఉపనిషత్సారము

ఒంటు బట్టినవారు. ఆ యంశము నీ శతకమున, లోక వ్యహారమునందలి చక్కని ఉపమానముతో 'కోరి కబేలాకు మందగాఁ దోలికొనిపోవుచుండ...' (8) అనెడి పద్యములో వధ్యశాలకు తీసికొనిపోవు పశువులు దారి ప్రక్కన యున్న పచ్చిగడ్డిపై తారాడు విధమున దేహాదు లనిత్యము లని దెలిసియు, జనులు ఇంద్రియ ప్రవృత్తి ననుసరించి నశ్వరములగు భోగములం దాశగలవారై యున్నారనిచెప్పిరి. ఈ విధముగ చెప్పుటలో, కావ్యము కాంతా సమ్మితమనుటలోని సత్యము స్ఫురించుచున్నది. క్లిష్టమైన ఆధ్యాత్మికాంశము నిట్లు ఉపమాన సామర్థ్యముచే నిరుపమానముగ చెప్పుట శతకమునకుత్తమ కావ్యత్వ మబ్బుటయే. ఈ సందర్భమున 'తెలివి సర్వమ్ము చూఱపుచ్చెద' వని యనుటలో మాయచే జ్ఞానము కప్పబడుచుండు నను విషయము తెలుపబడినది. 'తనివితీరగ నిన్ను రెండు చేతులఁ దాఁ కవచ్చుఁ...' (11) అనుపద్యమున విశ్వనాథవారు లోక వ్యవహార విషయమగు శివాలయములో నెట్టి వివక్ష లేకయు, ఏ శాస్త్ర విధులను పాటింపకయు భక్తులు తమంత తామే పూజలు చేసికొనదగు నను నంశము కళ్ళకు కట్టినట్లుగా వర్ణించిరి.

**వ్యవహార భాష**

కలిసివచ్చినవాఁడు జగము పౌరుషకలనమం చాడు<br>
కలిసిరాని యతండు లోకమిది దైవఘటనయం చాడు<br>
తెలివి వేయివిధాలు, తేల్చి వేయుట తేలిక నిన్ను<br>
సులభమార్గమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (61)

ఏది యెట్లైననేమి మరి నే మార్చుటింతయు లేదు<br>
నీదయ యనుకొంట లోనఁ దప్పెమొ నే నెఱుంగ నినుఁ<br>
గాదని పొడిచి వేసినది యేమి యాఘటకుండు తుదకు<br>
సోదెలో రాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (62)

ఇందు లోకపు పోకడను కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించిరి. దాని వివరణము స్పష్టము. వ్యవహార భాషయన భాషా వ్యవహారములోని జీవ లక్షణమే కాని, రూప నిర్మాణమునకు సంబంధించిన దాని బాహ్య స్వరూపము మాత్రము కాదు. దానిని నుడికార మనదగును. అందు సాధారణముగా లక్ష్యార్థము ప్రవర్తిల్లుచుండును. దానికీ పద్యములు చక్కని ఉదాహరణములు. వ్యవహారములోని భాషను, భిన్న సందర్భములలోని పలుకుబడిని, దాని చైతన్య లక్షణమును, సునిశితముగ పరిశీలించి, దాని జీవ లక్షణమును కావ్యమున పొదుగ దగిన నేర్పు విశ్వనాథవారి సొత్తు. వారిని మహాకవిని

చేయు లక్షణములలో నిది యొకటి. వారి భాష వ్యవహారమును వీడి యుండ దని వారే కల్పవృక్షావతారికలో (బాల.1.38) చెప్పికొనిరి. ఈ లక్షణ మీ విశ్వనాథ మధ్యాక్కఱలలో సర్వ సాధారణముగా కనబడును. క్రింది పద్యములో కవి భగవంతుని మరచి పెడ దారిని బట్టువారి విషయమును వ్యవహారగత వాక్యసౌందర్యముచే తెల్లము చేసిరి.

> ఎవరిదాఁకనొ యేలనయ్య నీమీద నెద నిల్ప లేక
> యవుర వారును వీరు నిట్టివారును నట్టివారంచు
> తవులు మానిన గుండెతోడ శివ! పెడదారిఁ బట్టెదను
> సువిచారమూల! శ్రీ శైల మల్లికార్జున మహాలింగ! (64)

ఇది వారి ఆత్మ కథనము. శతక కవులు సాధారణముగ భగవంతుని యెదుట తమ మనస్సు విప్పి, తమ తప్పొప్పుల నన్నింటిని నివేదించి క్షమింపుమని వేడుకొను విధమున ప్రార్థింతురు. విశ్వనాథవా రిచ్చట అట్టి స్వచ్ఛమైన భక్తిని ప్రదర్శించిరి. ఈ భావమును ప్రకటించు వ్యవహార భాషాగత వాక్యమును ఛాయాచిత్రము వలె పై పద్యమున బంధించిరి.

విషయాసక్తి జ్ఞానముచే నశించును. అది నశించిన గాని జ్ఞానము లభింపదు. ఈ తాత్త్విక సత్యమును లోకవ్యవహార వాక్య బలముచే 'పిచ్చితాఁ గుదిరినఁ గాని యోస్వామి పెండిలికాదు, పిచ్చి తాఁ గుదురదు ప్రాణనాయక! పెండ్లైనఁగాని, హెచ్చి నిమ్నాహింతు మనసు చేతనే యిది చావ దీవు, చొచ్చినఁ గాని...' (92) అని వివరించిరి. ఇందలి వ్యవహార ప్రచురమైన లోకోక్తి పద్యగత భావమును యుక్తి సహితముగా ప్రకటించుచున్నది.

'చెట్ట యీ మనసున కయ్యొ సిగ్గువచ్చియు సిగ్గురాదు, పట్టిన చోటనే పాము కరచియుఁ బట్టు నచ్చోటె, చుట్ట పెట్టి హరింపు దీనిని మరుగు జొచ్చితి నాత్మ, చుట్టమవంచు ...'(93) అను పద్యమున కవి ఇంద్రియములు నివృత్తి నలవరచుకొనియు, మధ్యమధ్య ప్రవృత్తి మార్గమున పోవుచుండునను విషయమును, పాము కరచిన చోటనే మరల కాటువేయునను లౌకిక సత్యముతో పోల్చి చెప్పి, తమ ఆత్మ నాదుకొమ్మని పరమాత్మను వేడుకొనిరి.

ఈ విధముగ విశ్వనాథవా రీ శ్రీగిరి శతకమున తాత్త్విక విషయ విశిష్టముగ వారి నిగూఢ భక్తిని పలు మార్గముల ప్రదర్శించిరి.

# 9. శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!

ధూర్జటి మహాకవి రచించిన శ్రీ కాళహస్తీశ్వర శతకము తరువాత అంతటి రచనా వైశిష్ట్యముతోను, ప్రాపంచిక విషయ వ్యాఖ్యాన సమన్వితముగాను అనన్యభక్తి భావముతోను వెలువడినది విశ్వనాథవారి శ్రీకాళహస్తి శతకము. దీనియందు విశ్వనాథ వారి అద్వైతతత్త్వము శివకేశవాభేదభక్తి ప్రధానముగా ప్రకటితమగును. వ్యవహార భాషలోని వాక్యము లిందు సౌందర్యోపేతములుగా ప్రయోగింపబడినవి. ఈ శతకమునకుగల 'శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!' అను మకుటమునందలి 'శ్రీ' మధ్యాక్కర పాదమున రెండవ ఇంద్రగణములోని చివరి గురువు. ప్లుత స్వర యుతమ్మైన 'రా' యతి స్థానము. ఇందు ఉభయ యతి చెల్లును. శ్రీ కాళహస్తీశ్వరునిపై ధూర్జటి శతకము ప్రసిద్ధమై యుండుటచే మరొక శతకము పలు విషయములందు ప్రత్యేకతలను కలిగియుండి, కవి ప్రతిభావంతుడై యున్నచో గాని ప్రశస్తి కెక్కదు. ఈ శతకమున కట్టి ప్రాశస్త్యము దక్కినది. ధూర్జటి శతక వైశిష్ట్యమును విశ్వనాథవారు తమ శతకారంభమున నిట్లు ప్రశంసించిరి.

> తొలినాడు కలకండ పలుకులంబోని, ధూర్జటి సుకవి
> పలుకులంబోని దాహమ్ము చూచెడు వర కాగరాని
> యలసటై నిను వచ్చి చూచి యప్పటి కారియు మరల
> నలసట యగుచు శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (2)

ధూర్జటి కవితా ప్రశంసతోపాటు విశ్వనాథవారీ పద్యమున శ్రీకాళహస్తీశ్వరునిపై తమకున్న అకుంఠిత భక్తి భావమును కూడ ప్రదర్శించిరి. శ్రీకాళహస్తీశ్వరుని చూడవలె ననెడిది వారి తీరని కోరిక. అది మాటల కందని భావము. దానికి దాహముతో అభేదము చెప్పుట నిరుపమానము.

## యోగవిద్య

> కొన్ని జన్మములు దాటితిని, మనోమయ కోశంబునందు
> నున్న జన్మమిది, యింకెన్ని జన్మలకో మరి రెండు
> మున్నున్న కోశముల్ దాటి నీ వైన మూర్తితో నొక్క-
> డన్నది యగుట శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! (68)

ఈ పద్యమున విశ్వనాథవారు పంచకోశముల వివేచనము చేయుచున్నారు. శ్రీకాళహస్తీశ్వరుని స్తుతించుచు కవి బ్రహ్మైక్యమును పొందవలె ననెడి తమ కాంక్షను ప్రకటించుచున్నారు. ఇప్పటికి రెండు జన్మలు గతించిన వనియు, ఇది మనోమయ కోశమునందలి జన్మ మనియు, ఇంకను కొన్ని జన్మలకు ముందున్న రెండు కోశములు దాటి పరబ్రహ్మను చేరవలె ననియు నిందు చెప్పబడినది. ఆత్మ ఒక్కొక్క కోశమును దాటుచు పరమాత్మలో లీన మగును. అదే మోక్షము. పంచ కోశముల వివరమును గురించి యోగశాస్త్రమునందిట్లు చెప్పబడినది. '1. అన్నము వలన పుట్టి అన్నముచే నభివృద్ధి చెందు స్థూల శరీరము అన్నమయకోశము. 2. పంచప్రాణములును కర్మేంద్రియములును కూడి ప్రాణమయ కోశ మగును. 3. మనస్సు, చిత్తము, జ్ఞానేంద్రియములు కూడి మనోమయకోశ మగును. 4. శబ్దాది విషయ పంచకము, బుద్ధి కలిసి విజ్ఞానమయ కోశ మగును. 5. అజ్ఞానముచే జనించినదియు, ప్రియమోద ప్రమోదరూప మైనదియు, దృశ్యప్రపంచమునకు కారణమయిన అనాది అయిన అజ్ఞానము ఆనందమయ కోశము. ఆత్మ వీని నొక్కొక్క దాని నధిగమించుచు పరబ్రహ్మము చేరును. కాని ఈ పంచకోశములు బ్రహ్మముకావు'. (లింగమూర్తి 2.69) కొన్ని జన్మలు దాటిన పిదప అన్నమయ ప్రాణమయ కోశములు గతించిన తరువాత మనోమయ కోశమునందున్న జన్మమిది. మరికొన్ని జన్మలకు విజ్ఞానమయ ఆనందమయ కోశములు దాటి జీవాత్మ పరమాత్మను చేరును. అని కవి వివరించి, శ్రీకాళహస్తినాథుని వేడుకొనుచున్నారు.

## భ్రూమధ్యమున జ్యోతి దర్శనము

విశ్వనాథవారీ శతకములలో పలు పర్యాయములు తమకు భ్రూమధ్యమున ప్రత్యక్షమగు జ్యోతిని గూర్చి ప్రకటింతురు. లౌకిక విషయములం దెంత ఉన్నతు లైనను, వేద శాస్త్రాదులం దెంత పండితు లైనను ఆత్మ జ్ఞాన సంపన్నులకు మాత్రమే వెలుగు రేఖవలె పరమేశ్వరుడు ప్రసన్నమగును. విశ్వనాథవారు జ్ఞానోపాసకులు గనుకనే ఉన్నట్టులుండి ఏదో తెలియని ప్రసన్నత వలెను, రక్షకుని వలెను ఒక మనోహరమైన కాంతి రేఖ కనుబొమల మధ్య తమకు ప్రత్యక్షమైనదని వ్రాసిరి (23). ఇది వారి స్థిరమైన జ్ఞానమునకు ప్రబల నిదర్శనము. అదే ఆత్మజ్ఞానముతో వారు, పరమేశ్వర సన్నిధానమునకు వచ్చి సేవింపవలెనని తనకు పట్టరానంత కోరిక కలదని ప్రకటించిరి(24). కోరిక యొక్క ఆధిక్యాతిశయమునకు బలమైన వ్యవహార ప్రయోగము 'పట్టరానంత కోరిక ' యనుట . లోక వ్యవహారమును వీడి వీరి కనిత్వము లేదనుట కిట్టి నిదర్శనములు ప్రతి పద్యమునను కలవన్నచో నతిశయోక్తి కాదు. 'నిను రెండు కన్బొమల్ నడుమ యత్నించి నిలుపుట యొకటి...' (27) అనెడి పద్యమున కవి నిష్కల్మష భక్తిభావముతో శ్రీ కాళహస్తీశ్వరుని ప్రార్థించుచు,

ఆ దేవదేవుని భ్రూమధ్యమున నిలుపుకొని, తమ ఆత్మను పరమాత్మలో లీనము జేసికొనుటయందు తోడ్పడ వలసినదిగా వేడుకొనుచున్నారు. భ్రుకుటియందు దృష్టిని నిలుపుట, అచట జ్యోతిరూపమున ఆత్మదర్శన మగుట అనునవి పూర్వము పరామర్శింపబడినవి. (చూడు:పుట. 52,53)

## ఆత్మతత్త్వము

ఏ నెట్లునుంగాను, పరమ హంసయు నింద్రియ విహృతి
లోనడంచి విముక్తి నందె, మిగిలిన లోక మేమయ్యెఁ
దా నచ్చమౌ బ్రహ్మ మయ్యె బ్రహ్మచైతన్యమే మరల
నైనది జగము, శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (6)

హృదయ స్థానమున గల ఆత్మను యోగులు అష్టదళపద్మమున విహరించు హంస యని తలచెదరు. మోక్ష కాలమున ఈ పరమహంసము, ఇంద్రియ వ్యాపన మరికట్టి, పరబ్రహ్మమున లీన మగును. ఇక మిగిలిన లోకము కూడ ప్రళయ కాలమున పరబ్రహ్మము నందే లయ మగును. ఆ బ్రహ్మ చైతన్యమే మరల ప్రపంచముగా రూపొందును. ఇది సృష్టి రహస్యము. ఈ సృష్టి రహస్యము నంతను విశ్వనాథవారు మధ్యాక్కరలో నిముడ్చుట వారి ఆధ్యాత్మిక జ్ఞానాతిశయమునకు నిదర్శనము. హృదయమునం దుండు పరమహంసను గుర్తించిన మహాత్ములు మాయారూప మగు ప్రపంచమునుండి పరమాత్మను గుర్తుపట్టగలరు. అట్టి విశ్వాత్మ జ్ఞానమే విముక్తి. (లింగమూర్తి.1934:1.161,2) సృష్టి తత్త్వమునకు ప్రమాణము: '...సంచుకోచాంత కాలే, సంసృజ్య విశ్వా భువనాని గోపాః' (అన్ని లోకములను సృష్టించి రక్షకుడై కాలాంతమున తనలోని కాకర్షించుకొనును.) (శ్వేతాశ్వతరోపనిషత్తు 3.2) 'సర్వభూతాని కౌంతేయ ప్రకృతింయాన్తిమామికామ్, కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్.' (అర్జునా! సమస్త ప్రాణి కోటి ప్రళయకాలమున నా ప్రకృతిని జేరి అందు అణగియుండును. తిరిగి సృష్టికాలమున వానిని నేను సృజింతును.) (భగవద్గీత 9.7) ఈ విధమైన ఆత్మ తత్త్వమును సృష్టి రహస్యమును విశ్వనాథవారీ పద్యమున చెప్పిరి.

## పరబ్రహ్మస్వరూపము

కడుపులో నాదిత్యు లగ్నులును రుద్రఘటలైన నీవు
మెడఁగాల కూటమ్ము తాల్చి నట్టిది మేటి మాటయటె
యుడుకు నగ్నుల బానఁ బిడుగు పడెనన్న దొక వార్తగాగ
నడిగిన యట్లు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! (11)

ఈశ్వరుని పరబ్రహ్మతత్త్వ మిచ్చట స్థాపింపబడుచున్నది. బడబాగ్నులు ఉడుకునట్టి బానలో పిడుగు పడుటలో విశేషము లేనట్లుగా, తనయం దాదిత్యాగ్నులను సమస్త గోళములను కలిగియున్న పరబ్రహ్మము, సదాశివరూపమున కంఠము నందు కాలకూటమును ధరించుట పెద్ద విశేషము కాదు అని ఈ పద్యమున శ్రీ కాళహస్తీశ్వరుని యందు పరబ్రహ్మతత్త్వ మారోపింపబడినది. విశ్వమంతయు బ్రహ్మమయమని, శ్రీకృష్ణు డర్జునునకు విశ్వరూపమును చూపిన సందర్భములోని శ్లోకమును బట్టి తెలిసికొనదగును. 'అనాదిమధ్యాంత మనంతవీర్య, మనంతబాహుం శశిసూర్యనేత్రమ్; పశ్యామిత్వాం దీప్తహుతాశ వక్త్రమ్, స్వతేజసా విశ్వమిదం తపన్తమ్'. (ఆది మధ్యాంత రహితునిగను అపరిమిత సామర్థ్యము కలవానినిగను, అనేక హస్తములు కలవానినిగను, సూర్యచంద్రులు నేత్రములుగా గలవానినిగను, ప్రజ్వలించు అగ్నిహోత్రుని వంటి ముఖము గలవానినిగను, స్వకీయ తేజస్సుచే ఈ ప్రపంచము నంతను తపింప జేయుచున్నవానినిగను నిన్ను చూచుచున్నాను.) (భగవద్గీత.11.19) ఇటువంటి విశ్వచైతన్యమునే శ్రీకాళహస్తీశ్వరుడని విశ్వనాథవారుపై పద్యము నందావిష్కరించిరి.

## అద్వైతభావన

వాంఛలు లేకుండగా చూచినచో లోకమంతయు ఈశ్వర విలాసమనియు, లోకమే ఈశ్వరుడనియు తోచును. హృదయమున కోరికలు నిండినచో లోకములో ఈశ్వరుని నీడ కూడను కనపడదు. ఇట్లనుటలోని (నీపాడయేం కన్పించదు) వ్యవహారభాషాధోరణి వలన అసలు భగవంతు డనెడి స్పృహయే ఉండదను విషయము సువ్యక్తమగుచున్నది. ఇంద్రియగతమైన కోరికలు నశించినపుడే ఆత్మజ్ఞానము లవడును. ఆత్మజ్ఞానికి మాత్రమే లోకము బ్రహ్మమయమని తోచును. విషయ వాంఛలచే కప్పబడిన జీవునకు బ్రహ్మము గోచరము కాదు. అనగా ఆత్మజ్ఞాన మలవడదు. ఈ భావన 'లాలస లేకుండఁ జూచినన్ నీ విలాసంబుగాగ...'(15) అనెడి పద్యము ద్వారా ప్రకటింపబడినది. ఈ అద్వైత జ్ఞానమే క్రింది ఆదిశంకరుల శ్లోకమున తెలియునగును. 'లోక వాసనయా జన్తోః శాస్త్రవాసనయాపిచ, దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే.' (లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన యనునీ వాసనాత్రయ మెంతవర కుండునో అంతవరకు మనుష్యునకు ఆత్మజ్ఞానము కలుగదు) (వివేకచూడామణి.272) ఇదే విధమున అద్వైత భావావేశముతో విశ్వనాథవారు సర్వము భగవదర్పణము చేసినప్పుడు బరువు దించిన ట్లున్నదని వ్రాసిరి(16). విషయ వాసనా దూరుడై సర్వము

బ్రహ్మమయమని భావించు జ్ఞానికి తామరాకుపై నీటి బొట్టువలె లౌకిక విషయము లేవియు పట్టవు. అట్టివాని జీవితపు బరువు దించిన ట్లున్నదనుట, అలౌకిక భావమును లౌకికార్థమున చెప్పుటయే.

## ఇంద్రియజయము

ఇంద్రియములు ప్రవృత్తి మార్గమున చరించు నంతవరకు ఆత్మతత్త్వ మవగతము కాదు. ఆత్మజ్ఞానము కొరకు ఇంద్రియములు ప్రాపంచిక విషయములనుండి వెనుకకు మరలి ఆత్మయందు పర్యవసించవలెను. ఇక్కడ మనస్సు ప్రధానమైనది. మనోగతమగు కోపము, అహంకారము, కామము అనువానిని నిరోధించి, మనస్సును జయించిన వానికి శాంతిచేకూరి యోగ మలవడును. తద్ద్వారా పరమాత్మానుభవము కలుగును. ఈ విధముగ ' ఈ కోప మీయహంకార మీకామ మివియెల్ల...' అనెడి పద్యమున (42) కవి ఇంద్రియజయమును ప్రసాదింపుమని వేడుకొనిరి. మనోజయము వలన కలుగు ఆత్మజ్ఞానమును గూర్చి గీతయం దిట్లు చెప్పబడినది. 'జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః, శీతోష్ణ సుఖ దుఃఖేషు తథా మానావ మానయో' (మనస్సును జయించినవాడును, పరమశాంతితో కూడిన వాడునగు మనుజునకు శీతోష్ణ సుఖ దుఃఖాదులందును, అట్లే మానావమానములందును, పరమాత్మానుభవము చెక్కుచెదరకనే యుండును.) (భగవద్గీత.6.7) నీ కృప లేనిదే ఇట్టి మనోజయము సాధ్యము కాదని విశ్వనాథవారు శ్రీకాళహస్తీశ్వరునికి విన్నవించుకొనిరి. క్రోధాదులను జయించితిని గాని మోహమును మాత్రము జయింపలే కున్నానని మరొక పద్యములో(60) ప్రార్థించిరి. కవి ఇంద్రియ చాపల్యమును చెప్పుట, దానిని తప్పక జయింపవలెనని నొక్కి చెప్పుటయే. మాయారూపమగు దేహాదులందు ఆత్మనుంచి, ఆ జీవునికి ఇంద్రియ ప్రవృత్తిని కలిగించి, అనాత్మ వస్తువునందు మగ్గునట్లు చేయుట పరమేశ్వరునికి తగదని కవి మరొక పద్యమున 'నన్నింత వ్యష్టిగాఁ బెడకు ద్రొక్కి గంతలు కట్టి కనుల, మన్ను తిన్పించెద పచ్చికన్నట్టి మమత కల్పించి...' (61) అని దైవముతో నిష్కర్ష గా పలుకుచున్నారు. ప్రపంచమున బడవేయుట, ఇంద్రియలోలతను కలిగించుట. నిజమను భ్రాంతిని కలిగించుట, అనువానిని కవి ధ్వన్యాత్మకముగా 'వ్యష్టిగాఁ బెడకు ద్రొక్కుట' 'కనులకు గంతలు కట్టుట', 'పచ్చికయను మమత కల్పించి మన్నుతినిపించుట' అని ప్రకటించిరి. ఇందలి నుడికార ప్రయోగముచే పద్యభాషకు ఎనలేని దీప్తికలిగినది. చివరకు కవి యాదైవమును నిన్ను నమ్మినదాని కిట్లు చేయదగునా; ఆధిపత్యమున నిదియేనా అని నిలదీయుచున్నారు. అట్లు అధిక్షేపాత్మకముగ వివర్శించుట పద్యమునకు శతక ధర్మమును కల్పించుటయే.

## సగుణోపాసన

మారేడు దళములతోను, మంచి గంధముతోను విభూతితోను, అభిషేకమైన పిమ్మట ఆ లింగమూర్తి యొక్క సౌందర్యము కన్నుల పండువ వంటిదని విశ్వనాథవారు నుతించుట (14) వారి సగుణోపాసనను తెలుపుచున్నది.[1]

## భక్తిభావన

విశ్వనాథవారు హృదయమున భగవంతుని నిలుపుకొనుటకు చేయు యత్నమును, ఆ తీవ్రయత్నమున నిత్యము భగవద్దర్శన మగుటయును పేర్కొనిరి (33). ఆ సమయమున నిస్సంగత్వ మలవడుననియు, చలి, ఎండ, ఆకలి, మొదలగున వేమియు తెలియవనియు, ధ్యానమగ్నుడనై మన్ను తిన్న పామువలె బాహ్యప్రపంచమును మరచిపోదుననియు పేర్కొనిరి(34). సమాధి నిష్ఠులయిన వారిని చూసి అన్యులు, వారు మన్ను తిన్న పామువలె నున్నారని అనుకొనుట లోకమున కద్దు. ఈ విషయములు వారి నిరంతర ధ్యానమయ జీవితమును, నిత్య భగవత్సాక్షాత్కార భాగ్యమును వెల్లడి చేయుచున్నవి. హృదయము అల్పము లైన లౌకిక విషయముల వెంటబడి గంట్లు పడిన దనియు ఈ ప్రాపంచిక కార్యములలో మునిగి తేలుచు నుండవలసి వచ్చుచున్నదనియు, చెప్పుచు మదిలో కాపురముండి బ్రతుకునంతను మార్చుమని పలు పద్యములలో విశ్వనాథవారు వేడుకొనిరి. శ్రీ కాళహస్తీశ్వరుని ప్రార్థించుచు తన మదిలో 'కదలుచుండనువలె బ్రతుకులోతులు కదలించ వలయు' నని యనుకొనుటలో కవితా రూపము దాల్చిన, వారి భక్తి భావ తీవ్రత తెలియుచున్నది(40).

## పరిణతభక్తి

ఒక పద్యమున (84) విశ్వనాథవారు విశ్వమును పర మశివుని మూర్తిగా భావించుచున్నారు. పంచభూతములు శరీరముగను, శివలింగము మూడవకంటి అగ్ని గోళముగను తనకు కన్పించుచున్న దని వ్రాయుట, వారి సగుణ నిర్గుణోపాసనల సమన్వయమును, పరిణతమైన భక్తిభావమును వెల్లడి చేయుచున్నది. ఇదే భక్తి భావముతో మరొకపద్యమున (85) వారు, శ్రద్ధగా శివలింగమును ధ్యానించునపుడు తమ కా లింగము

---

[1] ఈ సందర్భమున ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని 'మ॥ ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా, ర్ధి దరీ ధ్వాంతము ధూపధూమము జ్వలద్దీప ప్రభారాజి కౌ, ముది తారా నివహంబు లర్పిత సుమంబుల్గాఁ దమోదూర సౌ, ఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్.'(2-133) అను పద్యము స్మరింపదగును.

చుట్టు నేదో మెఱుపు తీగ కనబడినట్లును ఆ జ్ఞాన తేజస్సు బొంగరమువలె పరిభ్రమించినట్లును వ్రాసిరి. ఇది, వారు భక్తి మార్గమున ఆత్మ జ్ఞానమును పొందుటను సూచించుచున్నది.

విశ్వనాథ వా రొక పద్యమున ''వెస నావు పాల్పోని నాదు కైత నైవేద్య మిచ్చెద...''(98) అని భగవంతునికి తమ సర్వస్వమును అర్పించుకొనుచున్నారు. ఆవుపాలు స్వచ్ఛమును, పవిత్రమునేగాక బలవర్ధకము కూడ. వీరి కవిత అటువంటిది. భగవదర్పణలో వెంటనే మండి హరించికొని పోవునది కర్పూరము. అట్టి అర్పణ స్వభావము కలది వీరి మేను. అగరువత్తి తను దగ్ధమగుచు, నితరులకు సుగంధము నిచ్చునది. అట్టి లక్షణము కలది వీరిబ్రతుకు. అటువంటి కవిత్వమును నైవేద్యముగను, శరీరమును హారతిగను, జీవితమును అగరు ధూపముగను, పరమైశ్వరుని కర్పింతునని పై పద్యమున విన్నవించుకొనిరి. ఇందువారి ఆత్మార్పణ స్వభావము గోచరించుచు వారి పరిణత భక్తి తెలియుచున్నది. ఇట్లే వేరొక పద్యమున (100) వారు తన ఆత్మను లేవదీసికొనిపొమ్మని భగవంతుని ప్రార్థించుచున్నారు.

## శివకేశవాభేదము

సగుణ రూపములగు దైవములు భిన్నముగా తోచునని చెప్పుచు శివకేశవాభేదమును ''ఆయన, యహిరాజు శయ్య నిద్రించె, నా యహిరాజె...'' (7) అనెడి పద్యమున విశదీకరించిరి. అహిరాజు విష్ణువునకు శయ్యకాగా, శివునకు భూషణమును, కుమారుడు నగుచున్నాడు. లోకమున ఈ రెండు తత్త్వములు భిన్నములని గాని, ఏదియో అధికమని గాని తోచుచుండును. ఇందు కవి, లోకము నందలి ఆరాధనా విశేషమునిట్లు చెప్పి, వ్యంగ్యముగా మూలతత్త్వ మొక్కటే నను సత్యమును చాటిరి.

## లోకపరిశీలనము

శతకములందు సాధారణముగా కనిపించు లోకపరిశీలనము ఈ శతకమున మనోజ్ఞముగా చిత్రితమైనది. శ్రీకాళహస్తికి సమీప క్షేత్రము తిరుపతి. తిరుపతికి పోవు యాత్రికులు శ్రీ కాళహస్తీశ్వర స్వామిని కూడ దర్శించి వత్తురు. కాని భక్తులు తిరుపతి శ్రీ వేంకటేశ్వరునకు ధనమును, బంగారు ఆభరణములను ముడుపులిచ్చుట పరిపాటి. ఇతర దైవముల కొక్క నమస్కారముతో నే సరిపుచ్చుదురు. శ్రీ కాళహస్తీశ్వరునకును అంతియే. ఇది హరి హరులు వెరపించుట మరపించుట లోని భేదమని ఒక పద్యమున (3) సూచించుట విశ్వనాథవారి లోకపరిశీలనమున కొక తార్కాణము.

పైకి భక్తులమని చెప్పికొనుచు యోగ నియమములను పాటింపనివారిని కవి ఈ క్రింది పద్యమున అధిక్షేపించిరి.

అన్నాను నీ భక్తుడ నని పైకి, నీ యడుగుల నందు
కొన్నానా, అది లేదు, గ్రుడ్డి గుఱ్ఱాలకుం బండ్లు తోము
చున్నాను యమ నియమములు ధ్యానంబు నొకయింత లేవ
యన్నఖాది నయి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! (64)

నలుగురికి తెలియునట్లు నీ భక్తుడనని చెప్పికొందురు. నీ పాదసేవ నైనను చేయరు. ఎల్లవేళల తినుచు, ధ్యానము యమనియమాది యోగవిధులు స్వల్పముగా నైనను ఆచరింపరు. గ్రుడ్డి గుఱ్ఱాలకు పండ్లుతోముట అనెడి సామెత వలె కాలమును నిరుపయోగమైన పనులలో వెచ్చింతురు. అని కవి వ్యర్థముగా కాలము గడుపువారిని గూర్చి ఉత్తమ పురుషలో చెప్పెను.

## లోకవృత్తము

శ్రీకాళహస్తి క్షేత్రములోని శివుడు సర్పరాజుచే కొలువబడినవాడు. తదుపరి శివలింగముపై ఆదిశేషుడు పడగలు విప్పి గొడుగువలె పట్టును. శ్రీకాళహస్తీశ్వర క్షేత్రదైవమున కిది శాశ్వతాలంకారము. దీనిని దృష్టియం దిడుకొని,

పాము పడగ విప్పి శిరసుపై నీడ పట్టిన నేది
యే మేలు కలుగునందురు సదా నీ కహి మహేంద్రుఁ డుండు
నామాదిరింగనె మేలు నీకు నిత్యంబు మాదృశుల-
వౌమాట లేమొ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! (76)

అను పద్యము వ్రాసిరి. ఎవని శిరస్సుపైన పాము పడగ పట్టునో వాడెంతయో గొప్పవా డగునని లోకమున ఒక విశ్వాసము కలదు. ప్రజల ఈ నమ్మకమును కవి శ్రీ కాళహస్తీశ్వరునకు వర్తింపజేసి తమవంటి వారి కిది పరిగణింపదగినది కాదని విన్నవించిరి. అనగా నిత్యము ఈశ్వరునిపై ఆదిశేషుని పడగలు ఉండుటచే నెంతో మేలు చేకూరునని ఆ భగవంతునితో అనుచున్నారు. శివుడు మంగళ స్వరూపుడని దీని ధ్వని.

అట్లే నొక పద్యమున 'పామును నీలో కలుపుకొంటిని. మల్లికార్జున పండితుడు, బసవన్న, పాల్కురికి సోమన, అన్నమయ్య, నేను నీపై స్తుతులు చేసితిమి. మాకు నట్టి మోక్షము ప్రసాదింపుము. మరొక్క విషయము. వారితోపాటు నన్నును

కలుపుకొని చెప్పితిని కాని ఆ 'సత్యమూర్తులందరు పరమశైవులు. నేను మాత్ర మద్వైతిని' అని విశ్వనాథవారు ప్రార్థించిరి (77,78). తన భాషణమునకు వ్యవహారబలము చేకూరుటకు 'చేసినపాపంబు చెప్పిన పోవు'నను లోకోక్తిని ప్రయోగించిరి. ప్రాతఃకాలమున నింటి ముంగిట ముగ్గు కర్రలు వేయునపుడు, ఒక్కసారిగా ముగ్గుఒలికినచో, ఆ ఉదయ కాంతులలో తెల్లని ముగ్గు, అధికమైన కాంతి పుంజము వలె కళ్ళను మిరుమిట్లు గొలుపును. విశ్వనాథవారికి కనులు మూసి నంత భ్రుకుటిలో లీలగా కనబడు శివలింగము కాంతి యట్లుండునని ఆ శ్రీకాళహస్తీశ్వరునకు విన్నవించుకొనుచున్నారు(79).

వ్యవహారప్రయోగ బలమును బాగుగా నెరిగిన విశ్వనాథవారు పలు పద్యములలో లోకవ్యవహారగత విషయములను చెప్పిరి. బియ్యములో రాళ్ళు నేరదగును గాని రాళ్ళలో బియ్యము నేరతగదు. ఇది వ్యవహార సత్యము, ఇటువంటిదే తమ బ్రతుకులోని పాపపుటూహలందు పుణ్యపుటూహలను లెక్కించుట యని విచారము వెలిపుచ్చిరి. ఇట్లే వర్షాకాలమున నొక సామాన్య భక్తుని దుస్థితిని తమయందారోపించుకొని వర్ణించిరి(87). ఎడతెరపిలేక వాన కురియుచుండ ప్రొయ్యిక్రిందను పైనను కొరతయై యుండును. అట్టి వానను వెలియింపుమనియు, అపుడు వచ్చి శ్రీకాళహస్తీశ్వరుని దర్శనము కావించుకొందుననియు విన్నవించుకొనిరి(90).

భగవంతుని సదా హృదయమునందుండుమని కోరుచు ఆభగవంతుని రాకపోకలు తెలిసికొనలేక హృదయమును పరీక్షించుకొనును. చప్పని గుండెయని తెలిసి, అనగా భగవంతుడు లేడని తెలిసికొని, లోకము చాయ పోదునని కవి విన్నవించుకొనును(99). ఆ భగవంతుడు వచ్చి హృదయమున ప్రవేశించినా డనుట కొక గుర్తు కలదు. నిత్యజీవనమగు ఉప్పుటేరుకు పోటువచ్చి పరిసరములను ముంచి కల్మషములను కడిగి పాటైనట్లు తమ హృదయము పరిశుభ్రము కాగలదు. అదియే దైవము ఎదలో కదలుటకు గుర్తుఅని నివేదించిరి(94). సముద్రమునుండి నదిలోనికి నీరుచొచ్చుకొని వచ్చుటను పోటు అనియు, నదిలోని నీరు సముద్రములోనికి లాగికొని పోవుటను పాటు అనియు అందురు. దీనిని ఎదలోని భక్తిభావముతో సమన్వయించి చెప్పుట, విశ్వనాథవారి నిశిత లోకపరిశీలనకు నిదర్శనము.

## లోకోక్తి

ఈ శతకములలోని అనేకపద్యములలో విశ్వనాథవారు శక్తిమంతమయిన వ్యవహారభాషను ప్రయోగించి భావములకు చైతన్యము కలిగించిరి. 'కునికి యంగటిలోని బెల్లమునకును గుడిలోని లింగమునకు నైవేద్యమన్నట్లు...'(95) అని

భాషా వ్యవహారమును గ్రహించి పద్యభావమునకు దీప్తి కలిగించిరి. 'అంగట్లో బెల్లానికి గుళ్ళోలింగానికి నైవేద్యము' అనునది వ్యవహారములో ప్రసిద్ధమైన లోకోక్తి. ఇచ్చట మనసు భగవంతునిపై ఉండుట; ఉన్నట్లు నటించుట అను రెంటిలో కవి మనస్తత్త్వము ప్రకటితమైనది. ఈ రెండు విధములైన భావములను ప్రకటించిన రీతి లోక వ్యవహారమును ప్రతిబింబించుచునే, భాషయొక్క జీవలక్షణమును వెల్లడిచేయుచున్నది.

ఒక పద్యమున విశ్వమంతయు బ్రహ్మచైతన్యములోనిదే ననువిషయము, వడ్లగింజలోని బియ్యపుగింజ యనను సామెతతో సమర్థింపబడినది(8). శ్రీకాళహస్తీశ్వరునితో నీవు సమీపస్థుడవై యుండియు ఎంత పొడుచుకొని చూచినను కనుల కగపడవు. తరచి చూచినను గుండెలోకూడ కనపడవు. అని విశ్వనాథవారు సాధారణముగ భగవంతుడు సులభగోచరుడు కాడను భావమును 'కంటికి కలికమున కైన నక్కుఅపడ'(80) వను లోకోక్తిచే ప్రకటించి పద్యభావమున కెనలేని సౌందర్యమును చేకూర్చిరి.

## మనస్తత్వపరిశీలన

తాత్త్విక భావములను చెప్పుచునే విశ్వనాథవారు మధ్యమధ్య మానవుల మనస్తత్త్వమును ప్రకటించుచుండును. 'తను దాన కికురించుకొనుచు మానిసి ...(73) అనెడి పద్యము దానికి చక్కని లక్ష్యము. మానవుడు తనకు లేని గుణములను తనయందు కలవని మురిసి పోవుచుండును. ఎవరైనను వచ్చి నిజము పలుకగా, లోని పశుత్వము పైకి వచ్చి చెంపదెబ్బ కొట్టును. ఇట్టి మనస్తత్త్వ పరిశీలనమునే తరువాత పద్యమునకూడ విశ్వనాథవారు ప్రకటించిరి. అవివేక మట్టకట్టగా, బ్రతుకంతయు దైవమేయని తెలిసియు, అది నేర్చితిని ఇది నేర్చితినని మానవుడు ఎగిరి పడునని ప్రకటించిరి(74). విశేషించి విశ్వనాథవారీ భావము లన్నింటిని తమయం దారోపించుకొని ఉత్తమ పురుషలోనే రచించిరి. మానవులు కష్టములం దున్నపుడే భగవంతుని స్మరింతురు. సుఖములం దున్నపుడు తలవనే తలవరు. ఇట్లు ఆధ్యాత్మిక పరమైన మానవుని మనస్తత్త్వమును విశ్వనాథవారు ఒక పద్యమున (17) స్పష్టముగా చెప్పిరి.

ఈ విధముగా విశ్వనాథవారీ శతకమున శ్రీకాళహస్తీశ్వరుని యందు పరబ్రహ్మతత్త్వము నారోపించి, తమభక్తి భావమును విశదీకరించుట యందు పలు మార్గముల ననుసరించిరి. శతక ధర్మములకు నుడికారములను లోకోక్తులను జోడించి ఈ శతకమును హృద్యముగా రచించిరి.

# 10. భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!

'విశ్వనాథ మధ్యాక్కఱ'లను గ్రంథములోని మూడవదైన భద్రగిరి శతకము, శైవేతర శతకములలో మొదటిది. ఇందు పరబ్రహ్మతత్త్వమే శ్రీరాముని రూపముగా విశ్వనాథవారు ప్రతిపాదించి తమ అద్వైత భక్తిని ప్రకటించిరి. దీనియం దెన్నియో పద్యములు ఉపనిషత్తులు, యోగశాస్త్రము, భగవద్గీత మరియు ననేక అద్వైత గ్రంథములలోని ముఖ్యాంశములకు వ్యాఖ్యాన ప్రాయములగుచున్నవి. పలు పద్యములలో శివ కేశ వాభేదమును ప్రకటించిరి. వీరిందు నుడికారములకు, లోకోక్తులకు పట్టము కట్టిరి. ఈ శతకములో చమత్కారమో, లోకపరిశీలనమో లేని పద్యము లేదనవచ్చును. వ్యవహారగతమైన వాక్యవిన్యాసము నిందు ప్రదర్శించి పద్యభావమున కొక నూత్న చైతన్యమును కలిగించిరి. 'భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!' అను నీ శతక మకుటము మధ్యాక్కర పాదములోని తొలి రెండింద్ర గణముల తరువాత నున్న సూర్యగణముతో నారంభ మగుచున్నది. 'పుణ్యనిలయ' లోని 'ని' అయిదవ గణాద్యక్షరమై యతిస్థాన మగుచున్నది. కాగా దీనికి ఇకార వర్గవిశిష్టమైన వ్యంజన యతియే చెల్లును. ఈ శతకములో మూడు తావులలో ణకార వ్యంజనముతోను, కడమ స్థానము లన్నిట నకార వ్యంజనముతోను యతిమైత్రి కూర్పబడినది.

### తత్త్వజ్ఞానము

అది కాని దానియందున నకట! అది యదియను బుద్ధి
పొదలదు నాకైన దానియందు నా బుద్ధి యున్నటులఁ
బొదలుచుందును నేనుగాని మెలఁకువ పూర్తిగా రాదు
నిదురయందున నుండి భద్రగిరి పుణ్యనిలయ ! శ్రీరామ! (48)

ఈ పద్యమున గహనమైన తత్త్వము చిన్న చిన్న పదములచే చెప్పబడినది. ఏది అది కాదో దానియందదే యనుభావము నాబుద్ధికి కలుగదు. అనగా అసత్యము నందు సత్యమను భావము తోపదు. నేను కాని దానియందు నా బుద్ధి యున్నటుల ప్రవర్తింతును. అనగా అసత్యము నందు సత్యమనెడి భావముతో నుండుట. నిదుర నుండి నాకు మెలకువ పూర్తిగా రాక యున్నది అనగా, సదసద్వివేక మింకను పూర్తిగా కలుగలేదు అనుట. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః (అసత్యము లైనట్టి దేహాదులకు ఉనికి లేదు; సత్యమైనట్టి ఆత్మకు లేమి లేదు) అనెడి గీతా(2.16)

వాక్యమునకు ఇది వ్యాఖ్యానము వంటిది. దీనినే సత్యా సత్య వస్తువివేకమని వివేక చూడామణి (శ్లో.20) యందిట్లు స్పష్టము చేయబడినది. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యేత్యేవం రూపో వినిశ్చయః! సోఽయం నిత్యానిత్య వస్తు వివేకః సముదాహృతః!!' (త్రికాలాబాధ్యము, దేశ కాల వస్తుకృత పరిచ్ఛేద రహితము, సర్వాధిష్ఠానమునగు బ్రహ్మము సత్యము. బ్రహ్మాతిరిక్తమగు సకల ప్రపంచము మిథ్య అనెడి నిశ్చయ జ్ఞానము నిత్యానిత్య వస్తు వివేకము). ఈ పద్యమున కవి తన ఆత్మ ప్రకటనము కావించుకొను చున్నారు. నిత్యానిత్య వస్తు వివేక మింకను స్థిరముగ కలుగ లేదు. అది కలుగుటయే ఆత్మజ్ఞానము. అదియే జీవన్ముక్తి, అదియే వారు శతకములద్వారా కాంక్షించినది. మోక్షము నాశించుటయే కాక వారు తత్త్వ జ్ఞానము నంతను ఈ శతకముల రూపమున వ్యాఖ్యానించిరి.

ఇటువంటి తాత్త్విక విషయమే తరువాత పద్యములందు కూడ ఆహ్లాదకరముగ చెప్పబడినది. స్పష్టమైన వెలుగే వెలుగు. స్పష్టమైన చీకటియే చీకటి. ఆ వెల్గు చీకటులు రెండును కలిసి యుండవు. అనగా సదసత్తులు ఒక్కటి కానేరవు. విశ్వనాథవారీ తాత్త్విక సత్యమును చెప్పి గుడ్డివెల్తురని లోకాననున్నదని లౌకిక విషయమును తీసికొని శ్రీరామునితో సంభాషించుచున్నారు. (చేవవెల్గు వెలుంగె మరియు చీఁ కటి చీఁ కటే...49). గ్రుడ్డి వెల్తురన్నది మిథ్యా ప్రపంచములోని యొక మిథ్య. మిథ్య సత్యము కానేరదు కదా!.

పరమేశ్వరుని విశ్వసింతుము అనుభవింతుము కాని,చూపజాలము. పరమేశ్వరుడు ఆత్మస్వరూపుడు. హృద్గతమగు ఆత్మ, భక్తి భావముతో ననుభూతమగును. అది భగవత్కృప, పూర్వజన్మ సంస్కార విశేషము. ఆ అనుభూతికి వేరగు ప్రమాణముండదు. అది అంతియే. అను తాత్త్విక సత్యమును నిష్కర్షగా విశ్వనాథవారు చెప్పి శ్రీరామునితో, అడుగులు వేసి తన భక్తి ఎన్ని అడుగు లున్నదో కొలువు మని వేడుకొను చున్నారు (నిను నింతగా దలంచియు...50). అనగా తమకు భక్తి కలదని చెప్పుటకు కూడ నాధారము లేదు కావున ఆ భద్రాద్రి రామునే వచ్చి కొలుచుకొమ్మను చున్నారు. ఆత్మానుభూతిని ఆత్మ స్వరూపుడగు రాముడే కాని, అన్యులు తెలిసికొనలేరు. పరమేశ్వరుని ఉనికికి విశ్వనాథవారు చూపిన ప్రమాణ మిది.

### ఆత్మజ్ఞానము

ఆత్మ స్థూల శరీరమును ధరించి తరువాత మిథ్యా ప్రపంచము నుండి విడివడి పరమాత్మలో లీనమగును. దీని నీ క్రింది పద్యము ప్రతిపాదించుచున్నది.

ఓయి బాబోయి! తావెలికి వచ్చుటయును నెంత తేలి
కో యట్లె లోనికిఁ బోవుటంత కాదోయి నా స్వామి
హ్రీయేచ ద్వారబంధాల్బిగించి రానీరు దేవతలు
నీ యాజ్ఞ లేకుండ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! (55)

పరబ్రహ్మమునందు గల సత్త్వరజస్తమో గుణ రూపమగు మూల ప్రకృతి లేక మూల శక్తి వలన సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవి. అట్లగుటచే హృదంతరాళము నందుండు జీవాత్మ పరమాత్మనుండి వెలికి వచ్చిన దగుచున్నది. అదెంత సులభమో తిరిగి జీవాత్మ పరమాత్మలో లీనమగుట యంత కష్టము. దానికా పరమాత్మ కృప అత్యంతావశ్యకము. కృప తపస్సంపాద్యము. తపస్సనగా విషయవిరక్తి పరమాత్మానురక్తి. అదియే ఆత్మానాత్మ వివేకము. ఇదిలేక మోక్షము కలుగదు. దీనినే పై పద్యమున కవి 'రానీరు దేవతలు నీ యాజ్ఞ లేకుండ' అనుట. ఇటువంటి భావములతో జన్మ రాహిత్యమును కోరుచు, పరతత్త్వమే శ్రీరాముడని, ఆ పరబ్రహ్మముతో కవి సంభాషించిన రీతి వారి ఆత్మ జ్ఞానమునకు నిదర్శనమై ఒప్పుచున్నది.

### రామతత్త్వము

రామచంద్రుడు పరమ సౌందర్య స్వరూపుడు. అపురూప లావణ్యానిధి. అట్టి పరమేశ్వరుడు లక్షమంది రావణులను జంపియు నవ్యత్వ కోమలత్వములం దధికుడై భాసించును. అనగా పరబ్రహ్మము, ఆద్యంత రహితమును గుణరహితమును. బ్రహ్మమునకు తరుగుట పెరుగుట యనునవి యుండవు. ఈ భావమును 'లావణ్యనిధి! లక్షమంది రావణులం జంపు మీవు, భావంబులో నిన్ను నెంచఁ జివురాకు పగిది భాసింతు' (5) అనుచు వివరించి తదుపరి అందే, ఆనందమయు డగు రాముడు జీవమునకు మృదుత్వమును కల్పింపగల డని, శ్రీరామతత్త్వమును ప్రతిపాదించిరి. రాముడు బ్రహ్మము, కాంతి ప్రవాహము, ఆనందమయము. ఈ ఆనందమయ కాంతి ప్రవాహమున మునిగి ముముక్షువులు తరింతురు. విశ్వనాథవారు నిరుపమాన రామ భక్తిచే '...నీదు మై వెలుఁగు మహాంబులలో మునుఁగుట, కుగ నెంచగా నొడ్డు కచ్చితంబుగా గోసినట్లుండె, దిగుటకు లేదింత దూఁ కుటే' (8) అని రామమయ మైన తమ తన్మయత్వ భావమును ప్రకటించిరి. నీ దయకెప్పుడు పాత్రుడ నగుదునో యనుచు 'నీవు కన్పడవాయె' యని రామ దర్శనము నర్థించిరి(9).

వెసఁ దెల్గు తెల్గంచు జనము వెఱ్ఱిగంతులు వేయుచున్న
దెసమాలు మాజాతి కీ వొకండవు తెలుఁగు దైవమవు

కసితీర నుతియింతు నిన్నుఁ దెలుగు వక్కాణముల తోడ
నిసిపోవఁ బగలురా భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ! (10)

ఈ పద్యమునం దొక అధిక్షేపము కలదు. ఒక పరిహాసము కలదు. భద్రాద్రి రాముడు తెలుగు వారి యిలువేల్పు. ఇది వ్యవహార ప్రసిద్ధము. ఇలువేల్పు ఒక కుటుంబమునకో, ఒక వంశమునకో ఉండును. కాని 'దిక్కు మాలిన తెలుగు జాతికి ఒకే ఒక దిక్కు రాముడు'. ఒక క్షేత్రదైవమునకు, ఒక జాతికి నిట్టి సంబంధ ముండుట అరుదైన విషయము. జ్ఞాన దీధితులు వ్యాపించి అజ్ఞానాంధకారము పటాపంచలగు నట్టులా రామమయ మగు పరబ్రహ్మమును కవి తెలుగులో నుతించుచున్నారు. ఇదియు జాతికి దైవమునకు గల అనుబంధమే. అనగా తెలుగున కవిత్వము చెప్పుట. అది స్తోత్ర పూర్వకము. అది రామ స్తోత్రము. అది ఆనందజనకము. 'సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్ ?' అని భర్తృహరి వాక్యమునకిదే అర్థము. రాజునకు లభించు ఆనందము వంటిది కవిత్వము వలన లభించును. కవిత్వము వలన రసానందము కల్గును. అది బ్రహ్మానంద తుల్యము. రామ కవిత్వ రసానందము సాక్షాత్తు బ్రహ్మానందమే. ఇది విశ్వనాథవారి రామ తత్త్వము తో కూడిన హృదయము. అందువలననే 'నిసిపోవ ఁ బగలురా' నుతించుట. తెలుగు జాతి దైవము కావున , ఆ జాతి మాతృభాషలో నుతించుట, ఆనంద ప్రాప్తికి సులభ మార్గమున పోవుట వంటిది.

## హరిహరాభేదము

పరబ్రహ్మము సృష్ట్యాది యందు సత్త్వ రజస్తమో గుణాత్మకమై త్రిమూర్తి రూపమున నుండును. ఆ త్రిమూర్తి స్వరూపము సృష్టి , స్థితి, లయాత్మక మైన చైతన్య వ్యాపారము కావించుచుండును. అందలి హరిహరులు సగుణరూపము దాల్చిన బ్రహ్మము యొక్క అర్చనామూర్తులు. అనగా హరిహరులు సాధకునకు ధ్యేయ స్వరూపులు. ఈ భావముతో విశ్వనాథ వారొక పద్యమున (11) హరి అవతారమగు శ్రీరాముని భక్త్యతిశయముతో కూడిన చనవుతో 'హరుడని నీవు, నీవని హరుడు ముక్తి నొసంగుట యందు పంతాలు పోకుడు. మీరిరువురు కూడ నాకు మోక్షమును ప్రసాదింపుడు' అని విన్నవించుకొనుచున్నారు. ఈ విధమున భగవంతునితో భక్తుని సంభాషణలు, నవ్వు ఆశ్చర్యము కలిగించెడి చతురోక్తులు శతకముల సాధారణ లక్షణము. ఇదే విన్నపముతో కవి తరువాతి పద్యము (12) నందు తాను వైకుంఠమును కైలాసమును కోరలేదనియు తానే పాపములను పోగొట్టుకొను శక్తిని తనకు ప్రసాదింపుడనియు, హరిహరులను ప్రాధేయపడును.

## వైరాగ్యభావన

విశ్వనాథవారు శ్రీరామునితో ఇహలోక సుఖదుఃఖములింక వలదనియు, వైరాగ్య భావము చెదరిపోకుండ చూడుమనియు, దైవకృప నిరంతరము తమపై ప్రసరింపగావలయు ననియు, మరుజన్మ లేకుండ మోక్షము ప్రసాదింపుమనియు వేడుకొనుచు పలు పద్యములను వ్రాసిరి. భద్రగిరి వాసునితో సంభాషించుచు తమ వైరాగ్యము పరిపూర్ణము కానిచో, భక్తి భావము నైనను నిండుగ ప్రసాదింపుమని 'ఉండి యుండి యితండు గొడవపెంచుచు నున్నాడటంచు...'(80) అనెడి పద్యమున విన్నవించిరి. విశ్వనాథవా రకుంఠిత భక్తితో పరమేశ్వర సాక్షాత్కారమును కోరికొనుచు ఆ దైవమున కనేకములైన విన్నపములు చేయుచున్నారు. అయినను తన భక్తి, పరిపక్వత చెందలేదేమో ననియు, తానే తొందర చేయుచున్నా ననియు కూడ తలచిరి. మోక్షేచ్ఛయందుకూడ వారికి గల ధర్మనిరతి కిది ఉదాహరణము. అందుచే వారాస్వామితో, తాను ఒత్తిడి చేయుటవలన 'పండబారని కాయకొరికి ఇరుకున బడవల దనియు, తనహృదయము భక్తితో పండినప్పుడు చూచుకొనవచ్చుననియు, అంత వరకు మెండుగా నిశ్చల భక్తి నొసగి గుండె నిండుగా నుండు మనియు ప్రార్థించుచున్నారు. ఇది వారి వైరాగ్య భావ పరాకాష్ఠకు నిదర్శనము.

కవి ఒక్కొక్కచో, విషయ వాంఛల నుండి తమను దూరము చేయు మనెడి వైరాగ్య భావము ప్రకటింతురు(87). మానవుడు పాపము చేయును. ప్రార్థన చేయును. ఈ నడుమ నేమగునో కదా! (90) అనియు, అవనిలో జరుగు అన్యాయములను వినుట వలన చెవులు చిల్లులు పడిపోవుచున్న వనియు, అనుభవించుట వలన గుండె మొద్దుబారిన దనియు చెప్పి ఆ విసువుచే ఈ జన్మ మొక్కటి చాలు, మరు జన్మవలదనియు భగవంతునితో మొర పెట్టుకొనిరి(95).

## పరిణతభక్తి

ఈ శతకారంభమునందు శ్రీరామచంద్రుని స్తుతించిన పిదప విశ్వనాథవారు ఒక పద్యములో(2) తన స్తోత్ర పూర్వకమైన రచనకే ఆ జగన్నాథుడు ముక్తి నొసగ డనియు, కాని యెడల యుగముల తరబడి తప స్సేల చేయుదు రనియు తమను తామే ప్రశ్నించుకొనిరి. 'మన స్సెక్కు వగ నైహిక మ్మగు దినుసు...'(4) అనెడి పద్యములో 'భక్తుని కోరికలను భగవంతుడు నెరవేర్చును. కాని మనస్సు ఇంద్రియాధీనమై ఐహిక విషయాసక్తమై యుండును', అని చెప్పి ఆ భగవంతుని, ఇహలోక సౌఖ్యములకంటె

ఆత్మ సాక్షాత్కారమునే ప్రసాదింపుమని కోరిరి.

**అకుంఠితభక్తి**

విశ్వనాథవారు తమ ప్రగాఢ భక్తిని 'నన్నేమి చావుమం చనెదొ...'(69) అనుపద్యమున ప్రకటించిరి. ఆత్మ సాక్షాత్కారము కోరు ఒక పరమ భక్తుడు గాని యిట్లు వ్రాయజాలడు. శ్రీరామునితోవారికి గల చనవు వారి భక్త్యతిశయమునకు సూచన. 'నన్నేమి చావుమందువ'ను వ్యవహారప్రయోగము వారి భావతీవ్రతకు ప్రతీక. 'మనస్సు నిన్నంటుకొని నిమేషమ్మయిన గాని నిల్చుట లే' దనునది సాధనలోని క్లిష్టతను చెప్పుచున్నది. నిన్నంటుకొని యుండుటకు 'వేయి జన్మలను విడువకుండ కత్తుల చే నరుకు' మనునది, వారి జీవాత్మ, పరమాత్మను చేరవలయునని కొట్టు మిట్టాడుటను తెలియ జేయుచున్నది. ఈ విధముగ విశ్వనాథవారు పలు పద్యములలో క్రొత్త క్రొత్త భావములతో అకుంఠిత భక్తిని ప్రదర్శించిరి. తరువాత పద్యము (70) నందే వారు రామునిపై మనసు నిల్పని యీ జన్మ కంటె పశు జన్మమే మేలని వ్రాసిరి. ఏలన పశువు పాపము ననుభవించిన పిదప, క్రొత్త పాపముల పరంపరను చేయదని చెప్పిరి. ఇది వారి భక్తి భావ తరంగములలో సాంద్రమైన భావము. 'ముడిదినుసు నిజంబు నాయెడద...'(81) అనెడి పద్యమున ఇంకను మోక్షార్హత కలుగ లేదేమోననెడి అనుమానమును వ్యక్తము చేసి భగవంతునికి నివేదించిరి. ఆ మోక్షా ర్హత సంపాదించుట కిందు తమ భక్త్యతిశయమును ప్రకటించుచున్నారు. పరిశుద్ధ భావముతో పరమేశ్వరుని పాదధూళిని ధరించి, దీన జనులను రక్షించుటయుందు మనస్సు లగ్నమగునట్లు అనుగ్రహింపుమని భద్రగిరి పుణ్యనిలయుని ప్రార్థించిరి. 'భావన' యన నానుటచే కలుగు రాసాయనక చర్య. 'హృదయ పరీమళమును పరమేశ్వర పాద ధూళితో భావన' చేయుట యనగా, పరమేశ్వరార్పిత మనస్కులగుటయే. అట్టి మనసుతో దీనులకు సేవ లొనర్చుటయందు నిమగ్నమగునట్లు తమను చేయుమనునది వారి అభ్యర్థన. ఇది వారి వైరాగ్యభావ సంపదతో కూడిన భక్తిభావమును మనోజ్ఞముగ వ్యక్తము చేయుచున్నది.

విశ్వనాథవారి యెదలో పరవళ్ళు త్రొక్కు భక్తి ప్రవాహము నందు 'నిన్ను దలంచుట యన్న భావముల్ నెగడుట కాదె...'(92) అనెడి పద్యమొక జలపాతము వంటిది. శ్రీరామా! నిన్ను తలంచుట యనగా భావజ్వాలలు ప్రకాశిచుటయే. ఆ భక్తి భావమయ దీధితులు, పన్నిన మధ్యాక్కరలుగా రూపము దాల్చుచున్నవి. నీవు లక్ష్యముగా నున్న ఈ కవిత్వము లేకయున్నచో నిన్ను కీర్తింపలేక, నే నేమయి యుండెడి

వాడనోకదా! అని వారు తమ భక్తి సాంద్రతను భగవంతునికి నివేదించిరి. దీనిని బట్టి ఈ మధ్యాక్కర లన్నియు వారు భగవంతునికి చేయు స్తోత్రములని తలప వచ్చును. ఇందువారు తమ మనోవృత్తిని మనోజ్ఞముగా వెల్లడించిరి. ఇది వారి జీవలక్షణము. ఇది విశ్వనాథవారి జీవుని వేదన.

## దైవసాక్షాత్కారానుభవము

విశ్వనాథవారు తమకు కలిగిన విశ్వనాథుని సాక్షాత్కారానుభవమును 'జ్యోతి వోలిక నీవు కనుబొమలమధ్య నుదయించువేళ...'(72) అను పద్యమునందిట్లు చెప్పిరి. 'ఓ రామచంద్రప్రభో! నీవు నాభ్రుకుటిలో జ్యోత్యాకారమున కనబడునప్పుడే దేహమునందు ప్రాణవాయువు ఆగిపోయెను. చిత్తము స్తంభించుకొనిపోయెను. నాలోని ప్రాణ చైతన్యము లొక్కసారిగ కొనిపోబడినవి. కనుబొమల నడుమ దృష్టిని నిలిపి నిరంతరము ధ్యాన సమాధి యందుండువారి కా పరబ్రహ్మ మొక జ్యోతి వలె సాక్షాత్కరించునని ప్రస్థానత్రయమున చెప్పబడినది. తమకిట్టి అనుభవము కలిగినదని విశ్వనాథవా రనేక పర్యాయములు నుడివిరి (చూడు.పుట. 52,63). తమ అనుభూతిని 'నారాముడు' కావ్యమునందు మనోజ్ఞముగ 'మదికిన్ గన్పడు నొక్కొకప్పటికి రామస్వామి నాకున్...', 'కోదండంబటుపెట్టి చక్రమును సంకున్ బూని నల్సేతులన్...', 'శివలింగమ్మును పానవట్టముపయిన్ శేషాహి పాల్వారు...', అనెడి పద్యములలో వెల్లడించిరి. హృదయ పరిపాకముచే వారికి హనుమత్సీతారామ దర్శనమైనది. రాముడు చతుర్భుజుడై కనిపించెను. ఆ రాముని పూదండ విశ్వనాథవారి భ్రుకుటిపై నిల్చును. వారికి శేషాహితో నున్న శివలింగము కన్పించును. శివలింగముననున్న పూదండ మరల వారి భ్రుకుటిపై నిల్చును. ఇంతలో మాధవుడు, అయోధ్యా రాముడు కనిపించును. వారద్వైతి, శివకేశవ భేదములేని నిర్మల మతి. సత్యసాధకులై భ్రూమధ్యమున జ్ఞాన భాస్కరోదయమును గాంచిన పుణ్యాత్ములు. కావుననే అట్టి సందర్భములందు తమకు కలిగిన అనుభవములను 'నారాముడు' కావ్యమున వివరించిరి. దాని సారమునే పై మధ్యాక్కరలో ప్రకటించిరి. బహుశః కవులిట్టి స్వానుభవమును ప్రకటించిన సన్నివేశములు అరుదుగ కనిపించును.

## ఆత్మనివేదనము

శ్రీరామమూర్తి అడవుల కేగ తండ్రి దశరథు డసువులు బాసిన విషయము ప్రస్తావించి, రామనామధారియగు తన కొడుకు మరణింప, తాను బ్రతికి యుండుటకు హేతువు భగవంతుని నిర్ణయమును తాను కాదనజాలకపోవుటయని ప్రకటించిరి.(43)

ప్రాణములు పెట్టి బ్రతికితిననెడి మాట బిడ్డలపై దండ్రులకు గల మమకారమును ప్రకటించుటకు శక్తిమంతమైన జాతీయము. పసివాడు మరణింప వానిని గురించి దుఃఖించుట, వీతరాగుల లక్షణము కాదు. అట్టివారికి ఆత్మజ్ఞానము కలుగదు. దీనినెరిగిన విశ్వనాథవారు 'వసుధ నాకంటెను బుద్ధి మాలిన వాడు లేడని' శ్రీరాముని యెదుట నంగీకరించిరి(44). ఇదంతయు కవి ఆత్మ నివేదనము.

## లౌకిక తర్కము

నశ్వరములగు దేహాదులు నిత్యములని ఉపాధిగత బుద్ధులు భావింతురు. ఇది భగవంతుని లీల. ఇది మాయాప్రభావము. ఈ మాయయు పరబ్రహ్మము యొక్క సృష్టియే. అప్పుడిందు న్యాయము లేదనిపించును. ఈ లౌకిక తర్కముచే విశ్వనాథవారు భగవంతునితో 'స్వామీ! నీవిట్లు మానవులచే నిత్యము తలపింప జేయుట ఎంతటి మాయ! ఏలన నీవెన్నియో మారులు ధరణిపై అవతరించితివి. ఆ దేహము లేమైనవి'(83) అని పలుకును. అనగా భూమిపై నీ దేహము నిత్యమనెడి భావమును కల్గించుట నీకు న్యాయము కాదనుట. ఈ పద్యము, పైకొక వ్యవహార భాషణమువలె కన్పించినను, దీనియందు భగవదవతారముల దేహములే నశించి నప్పుడు లేని దానిని గూర్చి ఉన్నదని భ్రమపడరాదను ఆధ్యాత్మిక ప్రబోధము ధ్వనించుచున్నది. శతకములో నిట్టి ధ్వన్యాత్మక రచన లుండుట విశేషము.

## రచనా సౌందర్యము

పుట్టించి పట్టించినావు కారాని పోరాని సంత
రెట్టించి ధట్టించినావు దుఃఖ దారిద్ర్యంబు లెల్ల
కట్టించి ముట్టించినావు తీవ్రాగ్ని కాయంబునందు
నిట్టులమ్మో కృప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! (25)

ఇందలి శబ్దాలంకారము, పాదమధ్యస్థ పదచ్ఛేదము, గణమునకు పరిమితమైన పదప్రయోగము అనునవి మధ్యాక్కరకు మాధుర్యము నాపాదించుచున్నవి. సంప్రదాయపు పునాదులపై కావ్య నిర్మాణము నందు పారము ముట్టిన విశ్వనాథవారిందు పద్యరచనా శిల్పమునకు గతిచమత్కృతిని చెక్కిరి. కానిచో నన్నయానంతరము విస్మృతమైన మధ్యాక్కరకు, విశ్వనాథవారి చేతిలో నింతటి సుందరమైన నడకల లవడవు. జీవునికి ప్రపంచ-మొక సంత వంటిది. సంతలోగల ఆకర్షణ జీవునికి నింద్రియ లోలత వంటిది. జీవునికి గల మోహాసక్తియే కాయంబు నందు ముట్టించిన

తీవ్రాగ్ని. ఈ పద్యమునందలి సౌందర్యము శబ్దాశ్రయముకాగా, క్రింది పద్యమునందలిది అర్థాశ్రయ మగుచున్నది.

నా యూహయుఁ బ్రయాగవోలెఁ బొలుచు జానకి రామ! యెపుడు
నీ యూహ కలిమి గంగయుగ యమునగా నీపైని కోర్కి
నా యీ సుకవితా సరస్వతియును నంతర్వాహినియుగ
నీయేమి తలచుటో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! (35)

ఇది అద్భుతమైన కల్పనము. ఇది అద్వైత భక్తి, ఆర్షధర్మానురక్తి, కవిత్వ నిర్మాణ శక్తి ముప్పిరి గొనిన స్థిరమైన భావము. జానకీరాముని తలచుట గంగ కాగ, రాముపై కోర్కి యమున కాగ, కవితా సరస్వతి అంతర్వాహిని యగు సరస్వతి కాగ, ఈ మూడింటి కలయిక యగు త్రివేణీ సంగమ స్థలము వంటిది విశ్వనాథవారి తలంపు. ఇది వారి కవిత్వము ననుశీలించుట కుపకరించు లక్షణము.

**లోకవృత్తము**

ఆస్తికులు, తమపై బడిన నీలాపనింద తొలుగు ననియు, లేక తమకు సంపద లొనగూడు ననియు, పుణ్యము లభించు ననియు, విశ్వాసముతో విదియ తదియలలో చంద్ర దర్శనమైన తొలినాడు, తమ వస్త్రములోని ఒక దారపు పోగును తీసి చంద్రుని పైకి విసిరి నమస్కరింతురు. ఇది యొక విశ్వాసము. భద్రాద్రి రాముడు తెలుగు దైవము కదా! కనుక నీ యాచారము నెరిగియే యుండును. అందుచే కవి రామునితో '... దారపుఁ బోగు, పద యిత్తు నీలాపనింద తొలగించు...' (20) అని విజ్ఞప్తి చేసిరి. ఈ పద్యమున 'భక్తి మేల్కోను నిదుర రానీకువే' అనుట యందు జ్ఞానము వెలుగునట్లు అంధకారమును నశింప జేయు మనెడి ప్రార్థన కలదు.

విశ్వనాథవారు శ్రీరామునితో రామకథ వ్రాయుదు ననియు దానికి ప్రతిగా తమ జీవితమును కడతేర్చు మనియు ప్రార్థించిరి. 'ప్రథితమ్ము లిచ్చి పుచ్చుకొనుటలు నీకు పట్టవా యని దైవమును లోకవృత్తము యొక్క ఆధారముతో ప్రశ్నించిరి(24). ఇది శతక కవుల వాక్యధోరణియని పైకి కనిపించినను, దైవమున కేవియు పట్టవనియే ధ్వనించుచున్నది. ఆద్యంత రహితము, నిర్గుణము అయిన పరబ్రహ్మమునకు మిథ్యా జగత్తు యొక్క లక్షణము లేమియు పట్టవు. ఆ రాముడు శ్రీశాలియే కాదు వస్త్తునిధి కూడ. ముక్తినిధి యన 'ప్రోవైన తెల్వి'. జ్ఞాన భాస్కరోదయము లౌకిక విషయ

వాసనలస్తమించినప్పుడు, ఆత్మతత్త్వ మవగత మైనప్పుడు, తనంత తానే కలుగును. అందుచే రామునకు ఇచ్చి పుచ్చుకొనుటలు పట్టవు. ఇది విశ్వనాథవారు లోకవృత్తమును గ్రహించుటలోని వ్యంగ్యవైఖరి. 'నమ్మకమ్మన గొంత యప్పువెట్టి పంటలమీఁ ద 'దీర్చి' కొమ్మన్నటున్నది జగతి నీవు నాకును గానిపించి, నెమ్మదిగా నఘప్రతతిఁ దూల్చికో....'(46) అని వ్రాయుటలో కవి లోక పరిశీలనము వెల్లడి యగుచున్నది. కొందరు తమ ప్రయత్నము లేకుండగనే దైవమును తానుగా వచ్చి పాపములను తొలగించుమని ప్రార్థింతురు. ఈ విషయమును సమర్థించుటకు కర్షక సమాజమున ప్రచురమైన 'అప్పుచేసి పంటల మీది ఆదాయముచే తీర్చు కొమ్మ' నెడి ఒక వ్యవహారమును చెప్పుటచే కావ్యమునకు సార్వజనీనత కలుగుచున్నది. ఈలాగుననే సేద్యమునకు సంబంధించిన వర్ణనతో కవి తమ లోకవృత్త పరిచయమును, భక్తి ని ఇట్లు ప్రదర్శించిరి.

తోరపుటెద బాధ దంప నాగళ్ళతో దమ్ముచేసి
నారుకట్టలు దగ్గరలుగ విసరినన్గను పైన చేని
యోరిమిగా నుంటి స్వామి! వెసవచ్చి యూడ్చుకోవయ్య
నీరమెండకయమున్ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! (47)

ఈ పద్యమున విశ్వనాథవారి వ్యవసాయ పరిజ్ఞానము ప్రకటిత మగుచున్నది. పొలమును నాగళ్ళతో దమ్ముచేసి, నారు కట్టలను అక్కడక్కడ దగ్గరగా పడునట్లు విసరి ఊడ్పు చేయుదురు. ఆ సమయమున పొలములో సీల మండ మునుగు వరకు నీరుండును. ఊడ్పుల రోజులలోని వరి పొలముల వర్ణన మిది. దీనితో కవి తమ తోరపు హృదయమున కభేద రూపమును చెప్పుచున్నారు. తోరపు హృదయమన సాంద్రము, ఘనము, సుందరము, విశాలము అయిన ఎద. కావుననే ఊడ్చుటకు సిద్ధమైన వరి పొలముతో నభేదము చెప్పబడినది. హృదయమును సాధన మార్గమున పరిశుద్ధ మొనర్చి భక్తి బీజములను వెదజల్లుట జరిగినది. భక్తి ఫలప్రదమగుటకు హృదయము సిద్ధముగా నున్నది. ఆ సంసిద్ధత యుండగనే భక్తిని పండించుకొమ్మని కవి శ్రీరాముని ప్రార్థించుచున్నారు.

## లోకోక్తి

కొంతమంది స్వేచ్ఛామతులు, దృఢ చిత్తములేని వారు నాస్తిక వాదములకు గురియై భగవంతుని చేరలేక చెడిపోవుచున్నారు. ఇట్టివా రన్ని కాలములందు నుందురు.

పరమేశ్వర కృపచే కవి యూహ 'ముదురు పాకానఁ బడక, వారికి దైవమును ధిక్కరించెడి బుద్ధి అలవడలేదు. ఇది వారి ఆత్మ కథనము(17). 'పుల్లవిరుపు మాటలు', 'ముదురు పాకము' అను ప్రయోగముల వాడుక వ్యవహారములోని జీవలక్షణమును కావ్యస్థము చేయుటయే. ఇటువంటివి ఈ మధ్యాక్కరలలో కోకొల్లలు.

> ఈ పద్యములు నీవు నిట్టి వేషాల నెందఱో వేతు
> శ్రీ పప్పు లుడకవు చచ్చినట్లుగా నింద్రియ జయము
> ప్రాపింపఁ జేసికో తేరగా వచ్చి పడదనె దీవు
> నీపట్టు తెలియులే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! (18)

పద్యము లేవియో వ్రాసి మభ్యపరచి పబ్బము గడుపుకొనువా రెందరో యుందురు. ఆత్మజ్ఞానము కావలె ననువారు తప్పక జితేంద్రియులు కావలసినదే. అలాగున కాక సునాయాసముగ మోక్షము ప్రాప్తించ దని రామభద్రుడు తమతో నన్నట్లు వారిందు పేర్కొనిరి. ఈ పద్యగత భావము శక్తిమంతముగ తోపించున ట్లుండుటకు కారణము భాషా వ్యవహారములోని సొంపు నిందు నింపుటయే. మోక్షప్రాప్తికి ఇంద్రియ జయమే మొదటి కారణము. దాని నెరిగిన విశ్వనాథవా రిందు జితేంద్రియత్వము యొక్క ప్రాముఖ్యమును, హాస్యోక్తి ధోరణిలో చమత్కార భరితముగ ప్రకటించిరి. ఇట్టి వేషాల నెందరో వేతురు, ఈ పప్పు లుడకవు, చచ్చినట్లుగా, తేరగా వచ్చిపడెదవు వంటి ప్రయోగములు పై పద్యగత భావమునకు సౌందర్యమును చేకూర్చుచున్నవి. 'ఏడువలేక నవ్వుట', 'ఉలిపి కట్టెలు'(32), 'నోరుమూసుక యనుభవింపవలయు' (40) 'అటునుండి నరుకుక రమ్మటన్న' (41) 'చేసినట్టి పాపము చెప్పిన బోవు (40) యనునవి నుడికారమో లోకోక్తియో అనదగిన బలమైన ప్రయోగములు. మనస్సును భగవంతునియందు లగ్న మొనర్చుటలో గల కష్టమును 'బలవంతపు బ్రాహ్మణార్థ మనుట యొక చమత్కారము. (91)

## వ్యవహారభాష

శతక సారస్వతములో సాధారణముగా కనిపించు వ్యవహార వాక్యధోరణి ఈ శతకములలో పలుతావులందు ప్రౌఢముగా కనబడును. విశ్వనాథవారు భగవంతునితో కూడ సామాన్యునితో వలెనే భాషింతురు. లోకమున వ్యతిరిక్తత ప్రకటించుటకు గల 'ఊఁ...' అను ధ్వనిని 'ఉభయుల మున్నామ యెత్తు మన్నచో ఊఁ నీలమేఘ' (85) అని యతి స్థానమున ప్రయోగించి పద్యభావమున కొక సొగసును కూర్చిరి.

మరుజన్మమున్నచో, ఉభయుల ముందుమా ఏమి? అందుచే నేను మరొక జన్మ నెత్త ననెడి వ్యతిరేక భావము తెల్పుటకు గల కాకువు నిచ్చుట పద్యస్థ మొనర్చిరి. ఇది భావమును దీప్తిమంతము చేయుచున్నది. వ్యవహారములో జీవము గల పలుకుబడులను పుష్కలముగ గ్రహించుట వలన కవిత్వమునకు పుష్టి కలుగుచున్న దనుట కిది చక్కని నిదర్శనము. ఈ విధముగా విశ్వనాథవారు అద్వైత సిద్ధాంత పరమైన ఆధ్యాత్మిక భావములతో భక్తి తత్పరతతో అధిక్షేప, వ్యంగ్య పూర్వక మగు సంభాషణా రీతులలో భద్రగిరి శతకమును హృదయాహ్లాద కరముగ రచించిరి. వారి భక్తి పరాకాష్ఠకు భక్తి కవిత్వ సృజనాభిలాషకు ఈ క్రింది పద్యము లక్ష్యము.

> నిన్నార్తిచేత నిట్లడుగుచుంటిఁ గానీ లేకయున్న
> వన్నెలు చిన్నెలుగాఁగ వర్ణింప వలఁతిని నేను
> నన్నెఱుంగుదు గాదె మరల రామాయణమ్మంత చేతు
> నిన్నుఁ గష్టముకాదు భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ! (100)

ఇట్లు నుతించిన విశ్వనాథవారి కా రామచంద్రుడు మోక్ష మీయక మానడు కదా! ఈ విధముగ లోకమున కద్దము పట్టిన పద్యములచే నీ శతకము, శతక సారస్వతమునకే అలంకార మగుచున్నది.

---

# 11. నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!

ఈ శతకమునకు కవి ఇచ్చిన నామము కులస్వామి శతకను. కడమ శతకములకంటె దీని కొక విశిష్టత కలదు. విశ్వనాథవారి స్వగ్రామమైన నందమూరు నందలి శివునిపై రచించిన దగుట, ఈ విశ్వేశ్వరస్వామిని తమ తండ్రిగారు ప్రతిష్ఠించినదగుట విశ్వేశ్వరునిపైననే వారింతకు పూర్వము 'మాస్వామి' యను శతకమును రచించుట అనునవి ఆ విశిష్టతకు హేతువులు. కులస్వామి శతక మనుటకు నందమూరులో నున్న

విశ్వేశ్వరస్వామి కులదైవ మగుటయే కారణము. ఇతర శతకములందు వలెనే ఈ శతకమునందు కూడ కవి అద్వైత భక్తిని ప్రధాన వస్తువుగా స్వీకరించిరి. ఇతర శతకములతో పోల్చినపుడు దీనియందు నుడికారములు, లోకోక్తులు తక్కువగా కనబడును. ఇందు తాత్త్విక విషయములతోను యోగశాస్త్ర విషయములతోను గహనమైన పద్యములు కలవు. 'నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!' అనెడి మకుటమునందు 'య' తో మధ్యాక్కర పాదములోని ప్రథమార్ధము పూర్తియగును. 'రా' ఐదవ గణాద్యక్షరమై యతిస్థాన మగుచున్నది. ఈ అక్షరము ప్లుత స్వరయుత మగుటచే దీనికి ఉభయయతి చెల్లును.

## యోగవిద్య

యోగశాస్త్రము ననుసరించి స్థూల శరీరమున డెబ్బది రెండువేల నాడులు కలవు. అందు ముఖ్యతమమైనది సుషుమ్న మను నాడి. ఇది మూలాధారమునుండి బ్రహ్మదండి మూలమున నాసికాగ్రము వరకు వ్యాపించి యున్నది. ఆ నాడినే సావిత్రి అనియు, సర స్వతి అనియు చెప్పుదురు. దానియందే కుండలినీ శక్తి కలదు. ఇదియే పరాశక్తి. ఇది వంకరగా చుట్టుకొని సర్పమువలె నిద్రించుచున్న దని అందురు. సర్పాకారమును పోలి యుండుటచే ఈ శక్తి కుండలినీశక్తి అయినది. దీనిని జాగృతము చేసిన యెడల, ఇది మూలాధారచక్రమునుండి బ్రహ్మగ్రంథిని ఛేదనము చేసికొని సహస్రారచక్రము వరకు ప్రయాణించును. అప్పుడా జీవుడు ముక్తు డగును. యోగవిద్యను తెలిసినవాడు, సర్పాకృతి గల కుండలినీశక్తిని యథేచ్ఛగా తోకపట్టి యాడించిన, అనగా జాగృతిని పొందించిన, నిద్రనుండి మేల్కొని నట్లు శక్తి సహస్రార పర్యంతము పైకి లేచును. ఆ విధముగా చేయజాలినవాడు జీవన్ముక్తు డగును. అనగా నీ కుండలినీ శక్తిని జాగృతము చేసినవాడే పునర్జన్మ రహితమైన కేవల పరబ్రహ్మమును పొందును. ఇదంతయు యోగ శాస్త్రమునకు సంబంధించినది. విశ్వనాథవారు ఈ కుండలినీ శక్తిని పరమేశ్వరునికి సమన్వయించి చూపుచు క్రింది పద్యమును వ్రాసిరి.

క్రిందినుంచియును బైదాక శ్వాస దీర్ఘీకరించి తరు
ణేందు చూడామణీ! పాము తోఁకపై నిల్చు చందమునఁ
బొందు వెన్నెముక వెంబడిఁ బినాకంబు పూని యుంటివని
యందునా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! (21)

నిశ్వాస రూపమైన మంత్రాక్షరముల నుచ్చరించుచు వానికి నియమితమైన
ములందు, మనస్సు నుంచుచు, మంత్ర జపము చేయుట యోగ సాధనలోని
ంశము. ఆ అభ్యాస పరిణితిచే పాము తోకపై నిలబడు రీతి కుండలినీ శక్తి
మగును. ఇదియే మోక్ష హేతువు. కావున జాగృతమైన ఆ కుండలినీ శక్తినే
ఎను పూనియున్న పరమేశ్వరు డని విశ్వనాథవారు స్తుతించిరి.

## ధ్యమున జ్యోతి దర్శనము

నస్సును భ్రూమధ్యమున నుంచి సగుణబ్రహ్మను నారాధించు నిరంతరాభ్యాసి
క్షానమును పొందును. బ్రహ్మము అనంత కాంతిమయ మగుటచే అది జ్యోతి
భ్రుకుటియం దనుభూత మగును. ఈ అంశమును గురించిన స్వీయాను
ను విశ్వనాథవారు పలు పద్యములలో చెప్పిరి. (చూడు.పుట.52,63,78 )
హ్మమ్మను పైని శేషాహి పడగ...'(31) అను పద్యమున జ్యోతి రూపమున
వ శివుడు వర్ణింపబడినాడు. శివాలయములందు లింగ రూపు డైన శివుడు,
పానవట్టముతో పాటు పైని సర్పదా పడగలు కూడ కలిగియుండును.
థవారు ఆ రూపమును ధ్యానింపగా ఆ పరమశివుడు వారికి కనుబొమల నడుమ
గా కనబడెను. ఇది వారి సగుణ భక్తికిని, నిరంతరోపాసనకును నిదర్శనము.

## ్నినము

శ్వనాథవారు 'నిదురయయు మేల్కొంట సూర్యచంద్రుల నియంతిచే
...'(11) అనెడి పద్యమున కాలస్వరూపమైన పరమేశ్వర తత్త్వమును
ఏంచిరి. ఈ ప్రపంచమున రాత్రింబవళ్ళు సూర్యచంద్రులచే కలుగుచున్నవి.
'లము. ఆ కాలమే పరమేశ్వరుడు. అనగా మానవులకు పరమేశ్వరునకు
మరాని బంధ ముండుట. ఇచ్చట విశ్వచైతన్యమే పరమేశ్వరు డని
ంపబడుచున్నది. ఆ విశ్వచైతన్యముపై మానవు డాధారపడినా డని, అనగా
రూప మగు చైతన్యము లేక మానవుడు లేడని తెలియుచున్నది. పరమేశ్వరుడు
రూపు డని ఉపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి. 'లోక సంహారకుడనై
భించిన కాలస్వరూపమునై యున్నాను' ('కాలో ఽస్మి లోకక్షయ కృత్ప్ర
.' భగవద్గీత.11.32) అనునది విశ్వరూపము ప్రదర్శించిన శ్రీకృష్ణుని
ు. ఈ తత్త్వమునే విశ్వనాథవా రిచ్చట వ్యాఖ్యానించిరి.

**ఆత్మజ్ఞానము**

''ఇది నాకు నాకె చిత్రమ్మ తెలిసిన యీ వృధాయైన, బ్రదుకును బ్రదుకుచు నుంటి ...(44) అను పద్యమున ఆత్మానాత్మ వివేకము నెరిగిన భక్తుని భావము వర్ణితము. ఇందు రెండంశములు చెప్పబడినవి. ఒకటి- బ్రతుకు వృధాయని తెలిసియు బ్రతుకుచుంటి ననియు, బ్రతుకుట తప్పదనియు, తమంతట తమకే ఇది విచిత్రముగా నున్నదనియు కవి పేర్కొనుట. రెండు- పరమేశ్వరుని యొక్క జ్ఞాన స్వరూపమును తమ యొక్క అజ్ఞాన రూపమును తెలుపుట. మానవ జన్మ మశాశ్వతము. ఏలన మరణ మనివార్యము. ఆత్మ పరమాత్మయందు లీనమగుటయే అంతిమ లక్ష్యము. కడమవి వృధాయే. అయినను, పుట్టిన ప్రతి జీవియు మరణించు వరకు బ్రతుకవలసినదే. ఇందు కాదనునది లేదు. ఇక, పరమేశ్వరు డనేక సూర్య మండలములతో సమానమైన కాంతి స్వరూపు డని వేదాదులందు చెప్పబడును. పరబ్రహ్మము, ఆకాశమున వేలకొలది సూర్యుల యొక్క కాంతి ఒక్కసారి బయలుదేరినచో ఎంత కాంతి యుుండునో, అంత కాంతిని కలిగియున్న దని విశ్వరూప సందర్శనమున భగవద్గీతయందు చెప్పబడినది.[1] ఇదియే 'పదివేల్ దివాకరుల్ నీవు' యనుట. అట్లే, జీవుడు స్థూల శరీరమునం దున్నంత పర్యంతము, అజ్ఞానమునకు లోబడియే యుండును. వెలుగు జ్ఞాన మైనట్లు, అంధకార మజ్ఞాన సూచకము. అంధకారమునకు భౌతిక నిదర్శనము రాత్రి. 'పదివేల్విభావరు లనుట' అజ్ఞానము యొక్క ఆధిక్యమును సూచించుట. జీవుడు బ్రహ్మజ్ఞానము పొందువరకు అజ్ఞానియే. ఈ విధముగా పరమాత్మ జీవాత్మల వ్యత్యాస మిందు స్పష్టముగా ప్రదర్శింపబడినది.

ఏకకాలమున శివరూపమును విష్ణురూపమును దర్శించిన విధము 'మనసు లోపలఁ బాలు త్రావునప్పుడు...'(92) అనెడి పద్యమున నద్భుతముగా వర్ణించిరి. 'దైవ చింతన మనెడి పాలు సేవించునపుడు వెండి గిన్నె యన నేల బంగారు గిన్నెనే స్వీకరింతును. మౌళిలో నెలవంక గల శివుని, నెమలిపింఛము గల విష్ణుని తలచుచు పరబ్రహ్మమును భావన చేయుదును' అని విశ్వనాథవారు శివకేశవాభేద మగు బ్రహ్మము నుపాసించు విధము వెల్లడించిరి. వెండిగిన్నెలో పాలు ద్రాగుట లోకము నందొక భోగము. పాలు త్రాగుటలోని పవిత్రత కిది చిహ్నము. మనస్సునందు బ్రహ్మభావన మను పాలు త్రాగుటకు పైడి గిన్నెను గ్రహించుటవలన బ్రహ్మభావన యొక్క పవిత్రతాధిక్యము సూచించబడుచున్నది. ఇది విశ్వనాథవారి అద్వైత భక్తితో

---

[1] దివి సూర్య సహస్రస్యభవేద్యుగపదుత్థితా
యది భాస్సదృశీసా స్యాద్భాస స్తస్య మహాత్మన: (భగవద్గీత 11.12)

పాటు ఉదాత్త కల్పనను కూడ తెలుపుచున్నది. విశ్వనాథవారు తమ శివకేశవాభేద భక్తిని నిరుపమానముగ 'గుండెలో లింగమై నీవు స్వామివై కూర్చుండి నావు...'(100) అను పద్యమున వెల్లడించిరి. ఆత్మలో శివుని నిలుపుకొనిన విశ్వనాథవారికి ధ్యాన సమాధిలో విష్ణువు కనబడెను. ఉభయ రూపముల తత్త్వము ననుభూతమైనది. ఈ సందర్భమున 'మహేశ్వర ధ్యానంబు సేయుచు, కించి దున్మీలిత లోచ నుండనై యున్నయెడ, మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి...'(భాగవతము.1-15) రామభద్రుడు సాక్షాత్కరించిన పోతనామాత్యుని అనుభవము స్ఫురించుచున్నది. పరబ్రహ్మ భావనతో సగుణోపాసన చేయువారికి భక్తి పరాకాష్ఠయం దనుభూతమగు లక్షణమిది. విశ్వనాథ వారిట్టి భక్త శిఖామణి. 'శివాయ విష్ణు రూపాయ, శివ రూపాయ విష్ణవే శివస్య హృదయం విష్ణోః, విష్ణుశ్చ హృదయగం శివమ్' అను దానికి పైపద్యము వ్యాఖ్యానము వంటిది.

## సగుణభక్తి

'నీవు నాయెదనుండి వెడలి పోయితి నిజ మిద్ది శూన్య, దేవాలయంబుగాఁ దోచు...'(36) అను పద్యమున విశ్వనాథవారు సగుణభక్తిని ప్రదర్శించిరి. దైవచింతన మరచిన భక్తుని హృదయము దైవము లేని దేవాలయము వంటిది. దేవాలయమున దేవు డున్నా డనుటకు నిదర్శనము విగ్రహముతో పాటు ఘంటానాదమును ధూప దీప నైవేద్యములును, మంత్ర పుష్పాదులు నుండుట. మంత్ర పుష్పాదులు లేని దేవాలయము విగ్రహ ముండియు దైవము లేనిదానితో సమానము. ఈ అభిప్రాయ మిచ్చటి మానవ హృదయముతో సమన్వయింపబడుచున్నది. హృదయ దేవాలయమున ఆత్మయే దైవము. భగవద్భజనము ఇంద్రియ జయము ఇత్యాదులు మంత్రపుష్పాదుల వంటివి. ఇచట భగవచ్చింతన లేని హృదయము శూన్యదేవాలయము వంటిదని చెప్పుట ప్రసక్తాంశము. విశ్వనాథవారు విశ్వేశ్వరుడే తమ అభిమాన దైవమని 'నన్ను నీవడిగిన, వాని వాని జన్మను బట్టి...' (70) అను పద్యమున చాటిరి. అందరు వారి వారి జన్మ సంస్కారములను బట్టి ఎన్నుకొన్న దైవములనే సేవింతురు. కాని నన్నడిగి నట్లైనచో బాలచంద్రుని శిరోభూషణముగా గల శివుడే అభిమాన దైవమని పలికెద నని వారు ప్రకటించిరి. ఇది వారి సగుణోపాసనకును, శివభక్తికిని నిదర్శనము. విశ్వనాథవారు శ్రీగిరి, శ్రీకాళహస్తి శతకములలో నా యా దైవములందువలె, ఈ శతకమున నందమూ ర్నిలయు డగు విశ్వేశ్వరుని యందు పరబ్రహ్మ తత్త్వమును చూపిరి. 'పంచభూతమ్ములు సూర్యచంద్రులు పరమచైతన్య, మంచన నీ విశ్వమన్నదెల్ల నీ యాకార మిద్ది...'(72) అని సగుణరూపు డగు విశ్వేశ్వరుని విశ్వచైతన్య రూపముగా నుతించిరి.

'ప్రసవ బాణుని నీవు చంపఁగలవును బ్రదికింపఁగలవు...'(87) అను పద్యమున విశ్వేశ్వరుని సాకార రూపమును వర్ణించి నుతించిరి. పరమశివుడు మన్మథుని చంపగలడు బ్రతికింపగలడు. విషమును భుజించియు, దృష్టిదోషము తొలగుటకా అనునట్లు తలపై చంద్రుని దాల్చగలడు. దేని నైనను సమముగా స్వీకరించగలడు. ఇది విశ్వేశ్వరుని గూర్చిన సాధారణ వర్ణనము. ఇచట రెండు విరుద్ధ విషయములు ఏకత్ర భాసించునట్లు కనబడుచున్నది. పరబ్రహ్మము నందలి సత్యమును, మాయా స్వరూపము నందలి అసత్యమును, ఆ పరబ్రహ్మము యొక్క శక్తి చేతనే భాసించును. పరబ్రహ్మమే సృష్టిని లయమును నొనర్చెడి శక్తి, ఆ పరబ్రహ్మమే విశ్వేశ్వరుడు. ఈ రెండు భిన్నరూపముల సమాహారముగా విశ్వేశ్వరుని చెప్పదలచుటయే సాకారరూప వర్ణనలోని విలక్షణత. పై పద్యమీ యంశమునకు వ్యాఖ్యానము.

## అకుంఠితభక్తి

విశ్వనాథవారు ఒక పద్యమున (43) తమ భక్తి ప్రవాహమును రాబోవు జన్మకు కూడా గొంపోవు చున్నారు. విశ్వేశ్వరుని నుతించుచు మరణ మెప్పుడు వచ్చునో తెలియదు; అది రాక పూర్వమే నన్ను నీ భక్తి మార్గమున నుంచుము; ఆ సంస్కార బలముచే రాబోవు జన్మయం దైనను భక్తుడను కాగలను; అని విన్నవించుకొనిరి. ఇది వారి యకుంఠిత భక్తిభావన కొక నిదర్శనము.

## భక్తిరసావిష్కరణము

విశ్వనాథవారు 'రస వృత్తులము మేము నీవు వచ్చి మా ప్రాంగణమ్మందు...'(74) అను పద్యమున భక్తులు రసహృదయు లనెడి భావమును నిరూపించిరి. భక్తులకు నిరంతర భగవద్ధ్యానము వలన హృదయ మార్ద్ర మగును. భగవంతుని చేరవలె ననెడి ఆర్తి యధికమగును. తత్సంబంధమైన శోక భావము, మూర్తి భావన మొదలగునవి నిద్రాహారములు వంటివి కాగా విప్రలంభ నాయికా రూపమున నున్న భక్తుడు భక్తిరస ప్రవిష్టుడగును. అందుచేతనే భక్తులు రసవృత్తి కలవారగుట. భక్తునికి భగవంతుడు సాక్షాత్తు దర్శనమీయకున్నను, అతడు రసానుభూతినొంది భగవద్దర్శన తుల్యమైన ఆనందమును ననుభవించును. ఇది విశ్వనాథవారి మధురభక్తి. ఇందు భక్తుని హృదయమున భక్తి రసావిష్కరణము జరుగుట ప్రదర్శింపబడినది. అట్లే మరొక పద్యమున (75) భక్తుడు విప్రలంభ భావముచే చిక్కిన విరహిణిగా వర్ణింపబడెను.

## వైరాగ్యభావన

విశ్వనాథవా రొక పద్యమున (6) 'స్వగృహే అని సంకల్పము చెప్పుకొందురు, కాని నాకు మాత్రము వైరాగ్య భావముతో ఏది స్వగృహ మను ప్రశ్న ఉదయించును. ఇది నా స్వభావము. నే నెన్ని లౌకిక బాధలకు గురియైనను నిన్ను నిగమాంత వేద్యుని గనే అనగా అద్వైతరూప మగు పరబ్రహ్మముగనే తలచెదను' అని విశ్వేశ్వరునితో పలుకుచున్నారు. ప్రపంచము మాయా స్వరూపము కావున అశాశ్వతమైనది. ఆత్మకీ దేహమును ఈ ప్రపంచమును స్వగృహములు కావు. ఆత్మ పరమాత్మయందు లీనమగుటయే దాని ప్రకృతి. ఈ దృక్పథముతో కవి విశ్వేశ్వరుని యందు పరబ్రహ్మతత్త్వము నారోపించి, చెప్పిరి. 'స్వగృహే' అని సంకల్పము చెప్పుకొనుట నశ్వరమైన లౌకిక విషయవాంఛయే. కాని అది సత్యము కాదనెడి విషయ మిందు ప్రతిపాదింపబడుటవలన స్పష్టమైన వైరాగ్య భావము వెల్లడియగుచున్నది. వీ రింకను దేహగతమైన స్థితిని లెక్కింప వద్దని గుండె రాపిడిని పట్టించుకొమ్మని కులస్వామిని ప్రార్థించిరి(7). ఉపాధి గతమైన దోషముల కంటె నిశితమైన భక్తియే గుర్తింపదగిన దనునది వారి భావన. వైరాగ్య భావాధిక్యముతో నైహిక సుఖములు తృణప్రాయ మనెడి విషయము 'మిక్కిలి నల్పమౌ సుఖము లొక గడ్డిమేటి గాఁ గూర్చి...'(19) అనెడి పద్యమున వర్ణితము. తుచ్ఛ సుఖము లనెడి గడ్డిమేటి, జ్ఞాన మనెడి నిప్పురవ్వతో దగ్ధమగును. బ్రతికినంత కాలము పుట్టుకొని వచ్చెడి ఒక్కొక్క సుఖమును సమిధగా చేసి ఆ మంట నారకుండగ చేయవలెను. ఇది విశ్వనాథవారు పద్యముఖమున చేసిన ప్రబోధము. లౌకిక సుఖములు అశాశ్వతమని తెలిసినపుడు జీవునికి ఇహలోకగతమైన తాపత్రయములు నశించి మోక్షాసక్తి కలుగును. ఇది వైరాగ్యము చేతనే యలవడును. పై పద్యములు దీని ప్రాముఖ్యమును చెప్పుచున్నవి.

## ఆత్మనివేదనము

విశ్వనాథవారొక పద్యమున (12) జీవు డనుభవించు ననియు దానినా పరమేశ్వరుడు తిలకించు ననియు చెప్పి, శరీరాదుల నుండి జీవుని వేరుచేసి పరబ్రహ్మమున కలుపుకొమ్మని ప్రార్థించిరి. అట్లే వేరొక పద్యములో(17) మనస్సునకు ఇతర విషయములతో సంఘర్షణ మెప్పుడు కల్గునో అప్పుడు మతి చలించు ననియు, వేరైన కోరిక లక్కరలేకయే మతి చలించుట సహజ మనియు చెప్పిరి. హృదయములో పునఃప్రవృత్తి రూపమైన ప్రేమభావము కలుగును. వెంటనే భగవత్ప్రేరితమైన వైరాగ్యభావము కలుగగా ప్రేమలోని మాధుర్యము తొలగును. అని విశ్వనాథవారు భావసంఘర్షణల నొక పద్యమున(18) వర్ణించిరి.

భగవంతుని చేరవలె ననెడి భావము అధికులకు కలుగ దని చెప్పిన విశ్వనాథవా రొక పద్యమున(49) దేవుడు లేడని మాత్రము తాను పలుక నని ఆస్తిక్య భావమును చాటిరి. అట్లే తమయందు విశ్వేశ్వరునికి దయలేని నాళ్ళలో నోరు నొచ్చుకొనునట్లుగా ఆ పరమ శివుని పిలుచుచుందునని తమ భక్త్యావేశమును ప్రకటించిరి (50). భగవంతుని కృపకు తాను తగనని చెప్పుటకు వీలులేదని ప్రకటించిరి. ఏలన లోకమున ఎన్ని దుర్గుణము లుండవలయునో అన్నియు తమ కున్నను, వాటన్నిటికంటె అలంకార ప్రాయముగా భగవద్భక్తి యందు పట్టుదల గలదని చెప్పిరి(51).

**లౌకికభావన**

విశ్వనాథవారు 'పది కాదు మరి పది జన్మలను నేలఁ బడ వేసి యీడ్చు...'(52) 'సరి యెదో సామెత చెప్పుదురు సుమీ శని పట్టెనేని...'(53), అను రెండు పద్యములలో లౌకిక భావనలతో కూడిన తమ భక్తి తత్పరతను ప్రదర్శించిరి. ఈ పద్యములలో 'సరి యెదో సామెత చెప్పుదు' రని ప్రారంభింపబడిన పద్యమంతయు వ్యవహార భాషాగత జీవలక్షణముతో నిండినదే. శని యేడేండ్లు పట్టుననియు, తానైనచో పదునాల్గేండ్లు పట్టుదును కావున, తనను స్వీకరించి పీడను వదిలించుకొమ్మనియు విశ్వేశ్వరుని ప్రార్థించిరి. ఎదుటివారిని విసిగించి యైనను పని చేయించుకొనెడి లోకములోని ఒక పోకడ యిచ్చట గ్రహించబడినది. అనగా కరుణించి తొందరగా ననుగ్రహుడవు కమ్మని భగవంతునికి నివేదించుటయే. అట్లే మరొక పద్యమున(54) పట్టుదల వీడక నిర్భీతితో 'అటో ఇటో' తేల్చుకొనునట్లుగా కవి నందమూర్నిలయునితో వాదులాడుచున్నారు. తనకు మోక్ష మిచ్చెడి తలపు లేనిచో, 'జీవగత భవదూహ సంస్కార మిది తొలగింపు' మని భగవంతుని నిలదీయుచున్నారు. మరొక పద్యమున (58) చనిపోయిన వారేమగుదురో యని తలచుకొని ఇచట ఉన్నను లేకున్నను భేదము లేకపోయిన ఇహలోక విషయములు తెలియును గాని, పరలోక విషయము లిచట తెలియ వనెడి తాత్త్విక విషయమును లౌకిక దృష్టితో ప్రస్తావించిరి. వేరొక పద్యమున (59) ఎంత ఊహించుకొనినను చనిపోయిన వారెచట మెదలుదురో, యేమి యగుదురో తెలియకున్నది. అదొక అజ్ఞానము, అదొక విచారము. అని ఊహ కందని మరణానంతర రహస్యములను గూర్చి ఊహించిరి. అట్లే తర్వాతి పద్యమున (60) చనిపోయిన వారి దేహము పూర్వపు రీతి వలె భావికాలమున లేకపోవుట దుఃఖ కారణమని విశ్వేశ్వరునికి నివేదించిరి. వృద్ధులైన పిదప చనిపోవుట సమంజసమే(61). అంతవరకు నెటులనో బ్రతుక నిచ్చిన నిన్ను నిందించము(62)

జనియించువా డొకడు, బ్రతుకువా డొకడు, చచ్చువా డొకడు అనునది ఋషులచే నిర్ణయించబడినది. ఇహపరగతుల సంబంధమునకు కూడ వారల వాక్యమే ఆధారము(63) అని ప్రకటించిరి.

## లౌకిక తర్కము

'తగ వీని పిత తెచ్చి నన్ బ్రతిష్ఠించెఁ ...'(5) అను పద్యమున రచయిత దృక్పథము ఆశ్చర్యము గొల్పును. నందమూరులోని విశ్వేశ్వరస్వామి లింగమును విశ్వనాథవారి తండ్రి ప్రతిష్ఠించిరి. అందుచేతనే, తన్నేదో మొగమాటము పెట్టుచున్నారని యా స్వామి తలచు నేమో యని శంకించి, అట్లు తలపవలదని విశ్వనాథవారు స్వామితో పలికిరి. ఏదో ఆశ చూపి ఎదుటివారిని ఇరుకున పెట్టి లాభమును పొందు స్వభావము తనది కాదని ఆయన విన్నవించుకొనిరి. ఇక్కడ ఆయన చనవుతో లోక వ్యవహార తర్కమును దేవుని మీద ప్రయోగించిరి. లౌకిక వ్యవహారము జ్ఞానోదయమున కుపకరించ దను ధ్వని యిందు వ్యక్తమగుచున్నది.

## లోకపరిశీలన

'కంపన పడ్డ కాకి వలె లోకమ్ము కామమ్ము కొఱకు, వెంపర లాడెదు...'(46) అను పద్యమున ఆత్మజ్ఞానము నెరుగనివారి ప్రవర్తనము వర్ణింపబడినది. వణికెడు కాకి, గూడుకై వెదకునట్లు లోకులు కోరికలకై వెంపర లాడెదరు కాని, ఆ పరమాత్మను పొందెడి విధమును గురించి ఆలోచించరు. వారాకోరికలను విడనాడి జ్ఞానమును తెలియవలెను. లోకమున సాధారణముగా జను లందరి స్థితి ఇది. ఇది విశ్వనాథవారి ఆధ్యాత్మిక పరమైన లోకపరిశీలనము.

## తాత్త్వికచింతన

విశ్వనాథవారు 'మానసంబున నూహ చేసిన కొలంది ...'(64) అను పద్యమున మానవుల తాత్త్విక చింతనను వర్ణించిరి. 'ఇహలోక గతమైన విషయములను గురించి మనస్సునం దూహించిన కొలది యేమియు లేదనిపించును. ఆలోచింపకున్నచో దుఃఖము ముంచుకొని వచ్చును. ఇది పశు లక్షణము. నీవో పశుపతివి. చిద్ఘనానందుడవు. అపేక్ష వహింపుమా!' అని కులస్వామికి కవి విన్నపము. ఈ పద్యమున, మనస్సు నందు తాత్త్విక చింతన చేసికొనిన, సృష్టి మిథ్య అనియు ఆత్మ యొక్కటే శాశ్వత మనియు లేనిచో పశులక్షణ మగు దుఃఖమే మిగులు ననియు

తెలియునని వివరించిరి. ఇచట సృష్టి తత్త్వమును తెలిసికొన జాలక దుఃఖించుట పశులక్షణ మని భావము. ఈశ్వరుడు పశుపతి కావున, ఆ పశుపతికే అజ్ఞానమును తొలగింపు మనెడి విన్నపము. విశ్వేశ్వరుడు చిత్ ఘనానందుడు కావున, జ్ఞానమును ప్రసాదింపుమని వేడికోలు.

### లోకోక్తి

విశ్వనాథవారు 'పిల్లిపై నెలుకను నెలుకపైనను బిల్లిని బెట్టి...'(86) అను పద్యములో స్వార్థ భక్తుల తీరును లోకోక్తి సౌందర్యముతో వర్ణించిరి. సమాజములోని భాషా వ్యవహారము ఉన్నదున్నట్లుగా నిందు చూపబడినది. లోకములో కొందరు వ్యక్తులు ఒకరిపై మరొకరికి కొండెములు చెప్పి, లేక ఏదో నెపమున నల్గురకు విరోధము కల్పించి యానందింతురు. ఒక్కొక్కప్పుడెదుటి వ్యక్తి పై నీచమైన తమ పన్నాగము చెల్లక పోయినచో తమకు దానిని చెల్లించి పెట్టుమని భగవంతుని ప్రార్థింతురు. ఇట్టి వారిని లోకులు పిల్లిపై నెలుకను నెలుకపై పిల్లిని బెట్టుచు నానందింతురని తెగడుదురు. ఈ లోకోక్తి నిచ్చట కవి వ్యాఖ్యానించి అట్టి భక్తులు కూడ నున్నారని దేవునికి నివేదించిరి. లోకోక్తులను సహజ సుందరముగా కవితలో పొదుగుటయందు విశ్వనాథవారు సిద్ధహస్తు లనుట కిది యొక నిదర్శనము.

---

# 12. వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ!

ఇది 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను గ్రంథము నందలి విష్ణుపరమైన శతకములలో రెండవది. పూర్వ శతకములలో వలె దీని యందు కూడ, శేషాద్రి నిలయునికి చేయు స్తుతి రూపమున అద్వైత తత్త్వము, హరిహరాత్మకమైన భక్తి వ్యవహార శైలిలో ప్రతిపాదింపబడినవి. పరమ మనోజ్ఞముగ దశావతారములు వర్ణింపబడినవి. భగవంతునితో కవి అధిక్షేప పూర్వకమైన సంభాషణలు గావించిన తీరు దీని యందధికముగా కలదు. శతక లక్షణములగు ఆత్మ కథనము, స్వీయానుభవములను వర్ణించుట మొదలగున విందు మెండుగా కలవు. భక్తి శతకములలో నొక ముఖ్య లక్షణమగు వ్యాజస్తుత్యలంకార ప్రయోగ మిందు ప్రచురముగా కాననగును. లోక పరిశీలన మిందు మనోహరముగ చిత్రితమైనది. 'వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ!'

యను మకుటము, తొలి రెం డింద్ర గణములు లేని మధ్యాక్కర పాద మగుచున్నది. ఐదవగణాద్యక్షరమగు 'శే' యతి స్థానమై పదచ్ఛేదాత్మక యతిని కూడ కలిగి యున్నది. యతి మైత్రికి ఇకార స్వర వర్గ విశిష్టమైన చ ఛ జ ఝ శ ష సలు చెల్లును.

## పరబ్రహ్మతత్త్వము

ఈ శతకమున అవతార కథనము చేసిన విశ్వనాథవారు 'కాయ మొదలొ విత్తుమొదలొ యను ప్రశ్న గానైన...'(72) అనెడి పద్యమున పరబ్రహ్మతత్త్వమును సృష్టి స్వరూపమును వర్ణించిరి. కాయ మొదలా విత్తు మొదలా యను మీమాంస వ్యవహార ప్రచురము. అది నిశ్చయింప శక్యము కానిది. అట్లే పరబ్రహ్మము వలె సృష్టికూడ ఆద్యంత రహితమైనది. పరబ్రహ్మము అఖండజ్యోతి. సృష్టి బహుముఖములు. శ్రీ వేంకటేశ్వర రూపమగు పరబ్రహ్మమీ సృష్టి సంపదచే శ్రీయుతుడైనాడు. ఈ పద్యము తత్త్వోపదేశము లైన విషయములతో కూడిన పద్యములలో నొకటి.

## అవతార కథనము

'వేద ధర్మమ్ములు దొంగిలించిన విధముగా నుంటి...'(39) అనెడి పద్యమున విశ్వనాథవారు ఇంద్రియాధీనుడైన మానవుని దురవస్థను వర్ణించి, భగవంతుని వచ్చి ఆదుకొమ్మని ప్రార్థించుచున్నారు. పూర్వము హిరణ్యాక్షుడు వేదముల నెత్తికొనిపోయి సముద్రములందు దాయగా శ్రీమహావిష్ణువు మత్స్యావతారము నెత్తి అబ్ధిని జొచ్చి, రాక్షసుని సంహరించి వేదముల నుద్ధరించెనని పురాణగాథ. ఈ గాథ నుపమానముగ గ్రహించి, వేద విధులను నిర్వహింపక మోహ మను నబ్ధిలో పడి ఒడ్డుకు చేరలేనట్టి తనను, ఆది మత్స్యము వలె వచ్చి మోహమును ఛేదించి రక్షింపు మని భగవంతుని నర్థించుచున్నారు. శతకమయ్యును ప్రబంధ శైలిలో రచింపబడిన పద్యరత్న మిది. తనను వేదములను దొంగిలించినవానినిగను, విషయవాసనల నబ్ధిగను శ్రీ వేంకటేశ్వరుని మత్స్యావతారముగను ఉపమించి చెప్పుట, పద్య భావమున కెన లేని దీప్తిని కలిగించుచున్నది. 'దిగఁబడి పోవుచున్నాను మోహవార్ధి యధఃప్రదేశ...'(40) అనెడి పద్యమున కూర్మావతారము సూచింపబడినది. 'మంటి భావంబులు మింటి భావముల్ మథియింపఁబడుచుఁ ...'(41) అనెడి పద్యమున క్షీరసాగర మథనము చెప్పబడినది. ఇందు కల్పవృక్షమును జ్ఞానామృతపు నల్లగోరింటను పుష్పింపజేయు మనెడి ప్రార్థన కలదు. 'నేల సర్వంబును జాపఁ గా జుట్టి నెత్తినఁబెట్టు...'(42) అను పద్యమున వరాహావతారము చెప్పబడినది. ఇందు కోరిక లధికముకాగా బంధములను త్రెంపు

మనెడి ప్రార్థన కలదు. వరాహావతార వర్ణనను 'దాహమ్ము తుదలేని గుండె చెర్వులో దరిదిబ్బలందు...'(44) అనెడి పద్యమున కొనసాగించిరి. 'గుండెలోఁ బ్రేవులు తీయు మాట నిక్కువము...'(45) అనెడి పద్యమున నరసింహావతార కథ సమన్వయము చేయబడినది. ఇందు 'గుండెతోఁ బ్రోవులు పడ్డ మోహంబు గూళ్ళను గూడఁ జెండవే' అనుటలోని భావ తీవ్రత విశ్వనాథవారి భక్త్యాత్మక కవితా కౌశలమును చాటుచున్నది. నరసింహావతార కథానేపథ్యంతో 'నీవు లేవన లేవటంచు వాదించు...'(46) అనెడి పద్యమునం దమోఘముగా పైకి కనిపించెడి భగవంతుని యొక్క అస్తి నాస్తి భావము వ్యవహార బాణిలో వెల్లడి చేయబడినది. భగవంతు డున్నా డనెడి ఆస్తికులకు లౌకిక ప్రయోజనము లేవియు చేకూరకపోవుటచే, లేరని వాదించు దైత్యుల భావమే మేలనిపించునని కవి వ్యంగ్య మర్యాదలో భగవంతుని నుతించిరి. నరసింహావతారమునే వర్ణించుచు నొక పద్యమున (47) 'ఇందుగల డందులే' డనెడి భాగవత పద్య భావమును స్ఫురింపజేసి, స్తంభమునుండి వెడలి వచ్చినట్లుగా గుండె నుండి చీల్చుకొని రమ్మని వేంకటేశ్వరుని ప్రార్థించిరి. ఇది వారి అమేయమైన భక్తి భావమునకు నిదర్శనము. మరొక పద్యమున ['ఐదేండ్ల పసివాని వెన్క వేసుక యసుర లోకేశు పాదుల పెల్లగించితివి...' (48)] ప్రహ్లాద కథను ప్రస్తావించి విష్ణు చర్యలను అధిక్షేప పూర్వకముగ స్తుతించిరి. వేరొక పద్యమున (49) వామనావతారమును నుతించుచు 'మిన్ను పట్టక దాత యనంగ నొక్కడే బలి', 'పీల మొక్కఁ జెట్టు చేసెను నిన్ను' అని బలి యాధిక్యమును ప్రకటించిరి. ఇందలి 'బొటన వ్రేలంత లేవు తెగ నుబ్బపోయితి' వనునట్టి ప్రయోగములు లోక వ్యవహారమునకు కవితా గంధమబ్బినట్లుగా నున్నవి. మరొక పద్యమున (50) బలి చేసిన దానమును స్వీకరించి, పాతాళమునకు ద్రొక్కిన సంఘటనను దృష్టిలో నుంచుకొని దానము వేదానుగుణ్యమే కదా యనియు, ధర్మము చేయుట లోపమైన దనియు, దేవుని కిటుకు కొంచెమైనను తెలియదు కదా యనియు వేంకటేశ్వరుని నధిక్షేపించిరి. తరువాత పద్యమున (51) యజ్ఞరూపుడగు నా పరమేశ్వరుని సంబోధించుచు, యజ్ఞములు చేసిన బలిని మిన్ను మన్ను కాకుండ జేసితివి, అనగా పాతాళమునకు పంపితివి; నీకు ధర్మ బుద్ధి లేదు; దేవతల పక్షము వహింతువు అని సామాన్య దృష్టితో విమర్శించిరి. అట్లే, బలిని శ్లాఘించి హరి వర్తనమును చిన్న పుచ్చిరి(53). 'బ్రహ్మణ జాతి సత్త్వంబు మాని దుర్జన వృత్తులగుచు...'(54) అనెడి పద్యమున పరశురామావతారము వర్ణితమైనది. లోక మునందు బ్రాహ్మణజాతి సత్త్వ భావమును వదలి దుర్జను లగుటకు పరశురామావతారము నెపముగ జెప్పబడినది. దాని కాధారము పరశురాముని ప్రవర్తనమే. ఒకడు తప్పు చేసిన నా వర్గము నంతను సంహరించుట యను పరశురాముని కార్యమును

'చీడపట్టిన చోట త్రుంచి వేయు' నని సమర్థింపబడినది(55). అట్లే కవి మరొక పద్యమున గొడ్డలి బూనిన పరశురాముని వర్ణించిరి(59). విశ్వనాథవారి భక్తి భావము యొక్క పరాకాష్ఠకును, వారి వ్యవహార భాషామాధుర్య మునకును, క్రింది పద్యము పరమోత్కృష్టమైన ఉదాహరణము.

ఎన్ననిన్ నీవ యెఱుఁగని యవతారమెత్త నెంచితివి
నిన్ను నీ వెఱిఁగినదానికన్నఁ బండితి రామచంద్ర
సన్నుత మూర్తిగా నింకఁ బది యెత్తు స్వామి! శ్రీరాము
చిన్నెలు తేలేవు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! (60)

పరమేశ్వరునకు, తనకు తానెవరో తెలియును కాని, తన అవతార రహస్యము తెలియని శ్రీరామావతారము నెత్తవలసివచ్చినది. ఆ శ్రీరామమూర్తి యొక్క ప్రసన్నత నేత్రపర్వము, హృదయమున కవధులు లేని యానందము. ఇంక పది యవతారము లెత్తినను ఆ సౌందర్యము మాత్రము రాదు. అని విశ్వనాథవారు తమ రామభక్తిని పరమోదాత్తముగ ప్రకటించిరి. ఇట్లే తరువాత పద్యమున(61) శ్రీరాముని కొనియాడి శ్రీవేంకటేశ్వరునియందు రామత్వమును నారోపించిరి. శ్రీరామనామ మాహాత్మ్యమును స్థాపించిరి(62). శ్రీరాముని సౌందర్యమును వర్ణించి అత 'డప్పేయగలుగు తత్త్వాంబునిధి' యనియు, అతడు చంద్రుడు, జయంతుడు, మన్మథుడు ఇత్యాదుల కంటె రమ్యతరమూర్తి యనియు నుతించిరి(63). విశ్వనాథవారు తమ నిరుపమాన రామభక్తికి వేదాంత పాండిత్యమును జోడించి, అఖండమైన కాలము కామధేనువు కాగా రాముడు దాని పాల జున్నువంటివాడని వర్ణించిరి(64). ఇది పరమాత్మకు వారిచ్చిన నిర్వచనము.

మానవజాతి కంతకును నవ దీపమణి యైన రాము
డైనావు రాముడు పరమనాగరు డచ్చమౌ మనిసి
వాని మేలిమి చూపి సరకు విడుదల పరతువీ సృష్టి
శ్రీ నీరజాతాక్ష వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! (66)

పరబ్రహ్మము, మానవజాతి కొరకు ఆదర్శపురుషుడైన శ్రీరామునిగా నవతరించెను. అతడు పరమ నాగరుడు. అచ్చమైన మనిషి. వ్యాపారము నందు మేలిమి వస్తువును మచ్చుగా జూపి మొత్తము సరకును విడుదల చేతురు. ఈ విధముగా

నా పరబ్రహ్మము సృష్టి వ్యాపారము నందు, శ్రీరాముని మేలిమి చూపి ఇతర మానవులను సృష్టించుచున్నాడు. ఈ భావముతో నున్న పై పద్యము విశ్వనాథవారికి శ్రీరాముని యెడగల పరమభక్తిని, వారి అద్భుత కల్పనను, తత్త్వజ్ఞానమును వెల్లడి చేయుచున్నది. 'పళ్ళెమ్ము విసరిన గొంతు నరుకగాఁ బడుట చిత్రమ్ము...'(68) అనెడి పద్యమున విశ్వనాథవారు శ్రీకృష్ణావతార స్వరూపమును కడు చిత్రముగా ప్రదర్శించిరి. సుదర్శనాయుధమునకును పళ్ళెమునకు నభేదము చూపు పరిహాసాస్పద రచనా విధానము అధిక్షేప శతకముల ధోరణిని వ్యక్తము చేయుచున్నది. వీరీ క్రింది పద్యమున శ్రీకృష్ణావతార తత్త్వమును వర్ణించుచు తమ ఆత్మ కథనమును ప్రకటించిరి.

ఒక్కదాసికి మై కొకిబికి సరిచేయు టొక గొప్పగాదు
కక్కసించిన సుయోధనుని మనసు వంకర తీర్చలేదె
ఒక్కడా! నాయెద వేయిమంది దుర్యోధనుల్ కలరు
చిక్కించుకోరాదె వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! (70)

ఈ పద్యము పరిహాసముతో నారంభమై క్రమముగా పరమాత్మతత్త్వము నావిష్కరించుచున్నది. ద్రౌపది శరీరము యొక్క వికృతిని సరిచేయు టొక్క గొప్ప కాదనెడి వెటకారము వెంట సుయోధనుని మనస్సుయొక్క వికృతి కూడ సరిచేసెనని, శ్రీకృష్ణుని శక్తులు వర్ణింపబడినవి. అట్టి దుర్యోధనులు తమ మనసున వేయి మంది ఉన్నారనుట, మనస్సుయొక్క తీవ్రమైన వికృతి లక్షణమును, అనగా దట్టమైన దానవ ప్రవృత్తిని చెప్పుటయే. దుర్యోధనుని సరిచేసినట్లే తమ మనస్సును కూడ సరిచేయుమని కవి శ్రీకృష్ణుడగు వేంకటేశ్వరుని వేడుకొనిరి.

ఒక పద్యమున బలరామకృష్ణుల స్వభావములు అధిక్షేప పూర్వకముగా వర్ణింపబడినవి(74). అట్లే మరొక పద్యమున వేద ప్రామాణ్యము నంగీకరింపని బుద్ధుని అవతారము వర్ణింపబడినది(77). ఒక పద్యమున భగవంతుడు కనబడుటలే దనువారు పరిహాస పూర్వకముగ అధిక్షేపింపబడిరి. యుగముల తరబడి తపస్సు చేయువారికి భగవద్దర్శనము దుర్లభము. జను లిది తెలియక నేదో కనులు మూసికొని దైవము కనబడలేదని పలుకుదురు. అని సాధారణ మానవుల చిత్త స్థైర్యమును కవి ప్రశ్నించిరి(78). విశ్వనాథవారీ విధమున మనుజ ధర్మములు, ఈ జన్మలోని సుఖములు, వివిధ మతముల సారాంశము మొదలగు వానిని గూర్చి పలు పద్యములు వ్రాసిరి. నాలుగున్నర లక్షల సంవత్సరముల తర్వాత కల్కి రూపమున పరమేశ్వరు డవతరించునని విశ్వనాథవారు చెప్పి అప్పుడీ లోక మెట్లుండునో అనియు,

ఇప్పటి స్థితినిబట్టి ఊహకందుట లేదనియు ఆశ్చర్యము ప్రకటించిరి(84)

**శివకేశవాభేదభక్తి**

శివుడనియు, విష్ణువనియు విర్రవీగెడి జనుల భావమును 'శివునకు నీకును నేను భేదంబు చేసితినేని...'(6) అను పద్యమున చిత్రించిరి. కవి వేంకటేశ్వరునితో శివునికి విష్ణువునకు తమ దృష్టిలో నెట్టి భేదము లేదనియు, ఒకచో నట్టి భేదము చూపిన యెడల ఆ పాపమువలన ఆయువు తగ్గు ననియు చెప్పి, శివుడే శివుడని గాని, లేక విష్ణువే విష్ణువనిగాని, తమ చిత్తములో నెట్టి వెర్రియు లేదని కంఠోక్తిగా పలికిరి. దీని వలన వారికి, శికేశవులం దేమాత్రము హెచ్చుతగ్గులు లేవనెడి భావము దృఢముగా కలదని తెలియుచున్నది. తరువాత పద్యమున (7) కవి తమ హృదయ మందలి మాయను తొలగింపవలసినదిగా నిరువురు ప్రార్థించుచున్నా ననిరి. విశ్వనాథవారీ విధముగ శివునియందునను, విష్ణువునందునను, సమమ్మైన భక్తి భావము కలిగి 'మూర్తివాదంబులేదిందు నీదైన పరమాత్మ వాదంబుగాక'(9) అని సగుణోపాసనా మూలకమైన నిర్గుణ పరబ్రహ్మమునందుగల భక్తిని వెల్లడించిరి.

విశ్వనాథవారు కొన్ని పద్యములలో మృతి యన్న భయములేదు కాని మృతివేళలో భయము కల్గునేమో యన్నదే భయము. ఏలన పూర్వజన్మలం దిది యలవాటు అయినదో లేదో అని వ్యక్త పరిచిరి(14). పూర్వ జన్మ సంస్కారగతమైన ఆత్మ జ్ఞాన మున్నచో దేహమునకు మృతి తప్పదని తెలియునని వారి భావము. అన్నిటికంటె భయమైనది లోకమున బ్రతుకు టెట్లని. అట్లే మృతి కల్గుట యన్నది భయమునకు మారుపేరు. ఇది భయము యొక్క తత్త్వము. నాకిది లేదు(15) అని లోక పరిశీలనముచే భయలక్షణమును చెప్పిరి. ఈ విధముగ మృతిని గురించిన లోకాను భవమును, వారి యభిప్రాయమును మరికొన్ని పద్యములలో (16,17,18) చెప్పిరి.

**స్వచ్ఛమైన భక్తి**

ఈ క్రింది పద్యమున విశ్వనాథవారు తమకు శేషాద్రి నిలయునిపై భక్తి యేర్పడుటకు గల కారణమును ప్రతిపాదించి, తమ హృదయమున శ్రీ వేంకటేశ్వరునికి గల స్థానమును మనోహరమైన కవితా శిల్పముతో వెల్లడించిరి.

పదియేడులును రాక మున్నె నన్ను నీ పర్వతంబులకు
కదలించుకొని వచ్చినాడు మాతండ్రి కన్నాను నాడె
అది మొదల్ నీవు నాగుండె పూమొక్క కధికారివౌచు
చిదుముచుంటివి పూలు వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! (2)

విశ్వనాథవారు తమకు పదేండ్లు రాక పూర్వమే తమ పితృపాదులతో కలిసి తిరుపతి సందర్శించిన విషయము, అప్పుడే తొలిసారి, శేషాద్రి నిలయుని దర్శించిన విషయము నిందు ప్రస్తావించిరి. శతకములలో సాధారణముగ నీ విషయము వరకును కవులు వర్ణింతురు కాని 'అది మొదల్ నీవు నాగుండె పూమొక్క కధికారివౌచు చిదుముచుంటివి పూలు' అనెడి వాక్యము నొక్క భక్తుడైన మహాకవి మాత్రమే వ్రాయజాలును. తిరుపతి వేంకటేశ్వరుని చూచిన నాటినుండి విశ్వనాథవారి హృదయలతిక భక్తిసుమములు పూయుచున్నది. ఆ కుసుమములు సదా శ్రీ వేంకటేశ్వరార్పితములే. అనగా వారి హృదయకమల మెల్లవేళల శ్రీ వేంకటేశ్వర భక్తి యను సౌరభము వెదజల్లుచున్నది. స్వచ్ఛమైన భక్తి భావము నిట్లు మనోజ్ఞముగ చెప్పుటకు కారణము వారు కేవల శతక కవే కాక మహాకవి యగుటయే.

## ఇంద్రియలోలత

మనస్సుయొక్క ఇంద్రియలోలత మిక్కుటముగా నున్నదని కవి 'ఇది గుండె వింధ్యాద్రివోలె గగనాని కెగసి...'(26) అనెడి పద్యమున వర్ణించిరి. వింధ్య పర్వము పై కెదుగుచు సూర్యమండలము వరకు వ్యాపింప, లోకము లంధకార మయము లయ్యెననియు, అగస్త్యుడు వచ్చి దాని గర్వ మణచి లోకులకు కాంతిని ప్రసాదించెననియు నొక పురాణ గాథ కలదు. అట్టి వింధ్యాద్రిని కవి ఉపమానముగా గ్రహించి హృదయముతో నభేదము చెప్పుచున్నారు. హృదయము ఇంద్రియ లోలత చేత పై పైకెదిగి జ్ఞానమును నిరోధించి అజ్ఞానము నావరింప జేసినది. కావున హృదయము యొక్క మిట్టిపాటును తొలగించి జ్ఞానమును ప్రసాదింపుమని కవి భగవంతుని వేడుకొనుచున్నారు. ఇచ్చట హృదయము వింధ్యాద్రితోను భగవంతుడు అగస్త్యునితోను ఉపమింపబడెను. సూర్యకాంతికిని జ్ఞానమునకు నభేదము ప్రసిద్ధమైనది. ఈ విధముగ సమానధర్మముల నారోపించి చెప్పుట చేత భావమునకు గాంభీర్యము చేకూరుచున్నది.

## ఆత్మనివేదనము

'లక్ష చెప్పుము వేయి చెప్పు మొక్క వేళకు ...'(21) అనెడి పద్యమున వ్యవహార భాషణములోని సౌందర్యము ప్రకటించుచు, విశ్వనాథవారు తమకు హృదయము నం దొక్క క్షణ మైనను భిక్షుక భావము కలుగదనియు, కాని వేయి పద్యములు చెప్పు దక్షత నాలుక కున్నదనియు చెప్పి, అయినను శిక్షింపుమని వేంకటేశ్వ :నికి విన్నవించుకొనుచున్నారు. కవి తనకు వైరాగ్య భావము కలుగక పోయినను,

భక్తి ప్రపత్తులతో కవిత్వము చెప్పు నేర్పు కలదని చెప్పి వేయి పద్యములు రచింతుననుచున్నారు. ఇచ్చట వేయి సంఖ్య స్థూలముగ చెప్పినట్లు సరిపెట్టుకోనక్కర లేదు. ఏలన పది మధ్యాక్కర శతకములలో మొత్తము వేయి పద్యములు రచించిరి. దశశతక సంపుటి పూర్తి యగుటకు పూర్వమే పై విధముగ పలికి వారు భావిని దర్శించిరి. తదుపరి ఈ వేయి మధ్యాక్కరలు కూడ భక్త్యాత్మకము లగుట పద్యభావమునందలి యౌచిత్యమును సమర్థించుచున్నది.

**వ్యాజస్తుతి**

'అప్పటి కెందుకు పుట్టుటో తెలియదు ...'(86) అనెడి పద్యములో విశ్వనాథవారు కల్కిరూపమును అధిక్షేప పూర్వకముగ నుతించుచు సమాజస్థితిని ప్రకటించిరి. కల్క్యవతార సమయమునకు పూర్వమే వేదముల గౌరవము పూర్తిగ తగ్గుననియు, అప్పుడిక కల్కివై తెల్లగుఱ్ఱమునెక్కి చెప్పుకొనుటకే గాని ప్రయోజన ముండదనియు కవి వేంకటేశ్వరుని నిందా వ్యాజమున స్తుతించుచున్నారు. దీనివలన ఆస్తిక్య భావము లోపించుటయు, వేద ప్రామాణ్యము క్షీణించుటయు ననెడి విషయములను ధ్వనింపజేయుచున్నారు. అట్లే 'సాక్షివి నీవు నీకు యుగ ధర్మముల్ సాగించు నంత...'(87) అను పద్యమున విశ్వనాథవారు భగవంతుని యొక్క విధిని పరోక్షముగ గుర్తు చేయుచున్నారు. పరమేశ్వరుడు సర్వజగత్తునకు సాక్షీభూతుడు. ఆయన యుగకర్త. మానవుల పాపపుణ్యములకు మానవులే కర్తలు. మానవ ధర్మములు యుగానుసరణములు. ఈ సత్యము నెరిగిన విశ్వనాథవారు మానవుల కర్మలకు భగవంతుని బాధ్యత వహింపు మనుచున్నారు. శేషాద్రి నిలయునితో యుగ ధర్మములను నిర్వహించుటలోని శ్రద్ధతో, జనుల పాపపుణ్యములను కూడ దిద్దుమని ప్రార్థించుచున్నారు. భక్తిభావ తీవ్రతతో జనులను 'యుగాను సరణమ్ముగాఁదిరుగ' నీయకనియు, తిరిగినచో శిక్షింపుమనియు భగవంతునికి విజ్ఞప్తి చేయుచున్నారు. ఇది వారి నిశ్చల భక్తికి నిదర్శనము. వ్యాజస్తుతి రూపమున నిందు పరమేశ్వరుని నిర్గుణత్వము చెప్పబడినది.

విశ్వనాథవా రొకచో ['నన్నడిగినయెడ ధాత్రి యంతయు నాటికి ఛిన్న భిన్నమైపోవును...'(88)] కల్క్యవతార సమయమునకు ధాత్రి యంతయు ముక్కలై పోవుననియు, అప్పుడా విష్ణుమూర్తి చేతి కత్తి అయస్కాంత ధర్మము వహించి చిన్న ఇనుప ముక్కల వంటి ధాత్రిని ఐక్యము చేయుననియు, నొక గంభీర భావమును ప్రకటించిరి. అనగా నా సమయమునకు ధర్మ విచ్ఛేదము కలుగగా పరమేశ్వరుడు కల్కి

రూపమున వచ్చి ధర్మమును సుప్రతిష్ఠము కావించును. ఇది ఆ పద్యమునందలి వ్యాజస్తుతి పూర్వకమైన ధ్వని. విశ్వనాథవారు మరొకచో ['దున్నుకొనగనెక్కి తిరుగను నెదేని తోలికొనగను, నెన్నగ యంత్రాల మీఁదనే గుఱ్ఱమే యుండదపుడు, అన్నాడు గుఱ్ఱమ్ము నెక్కి వచ్చెద వనగ మాతెల్వి, చిన్నపుచ్చుట కేమి...'(90)] కల్క్యవతార సమయమునకు లోకము యంత్రమయ మగు ననియు, గుఱ్ఱము లుండ వనియు చెప్పి, విష్ణువు గుఱ్ఱము నెక్కి వచ్చెద ననుట జనులను చిన్నబుచ్చుటకే నని వేంకటేశ్వరుని అధిక్షేపించుచున్నారు. అనగా నిది వ్యాజస్తుతియే. అట్లే వారు పరమాణు మారణాయుధముల సంగతిని చెప్పి జనుల పాపములను వేరుగ పోగొట్ట నక్కర లేదని సూచించిరి(91). 'మ్రొక్కుబళ్ళకును బ్రసన్నత న్నీవు పొందినయట్లు...'(96) అను పద్యమున మ్రొక్కుబళ్ళకు ప్రసన్నత నొందు వేంకటేశ్వరుడు తమ చిక్కని భావనావితతికి అనగా ప్రౌఢకవితకు ప్రసన్నుడు కాడా? అనియు వడ్డికాసులవా డని పేరొందిన శేషాద్రి నిలయుడు ఇతరుల చిక్కులేమి తీర్చుననియు విశ్వనాథవారు అధిక్షేపించుచున్నారు. ఇది నిందా రూపమున నున్న స్తుతి.

**లోకపరిశీలనము**

తిరుపతి వేంకటేశ్వరులు ప్రజల కోర్కెలు తీర్చునని లోకమున ప్రతీతి కలదు. భక్తు లధిక సంఖ్యలో తిరుపతి క్షేత్రమును సందర్శించుటయు, కోర్కెలు నెరవేరుటకై ముడుపులు చెల్లించుటయు, ప్రసిద్ధిగా కలదు. లోకములోని యీ విషయము నాధారముగా గొని, వెక్కి వెక్కి ఏడ్చునట్టి ఇతరుల బిడ్డను ఆదరించినట్లు, లోకుల కోర్కెలను తీర్చుచున్నావని పరిహాస పూర్వకముగా కవి యీ వేంకటేశ్వరునితో సంభాషించిరి(4). ఇచ్చట 'కోర్కులను ఱొమ్మునం గట్టికొని యీదుచున్నా' వని యనుట విశ్వనాథవారి లోక పరిశీలనమునకు చక్కనిదర్శనము.

వేంకటేశ్వరుని కొలుచుచు, విశ్వనాథవా రొకచో ['జీవుడీ మేనిలో గర్భమునఁ బ్రవేశించెడు వేళ...'(19)] జీవుడీ శరీరమున ప్రవేశించినప్పు డెంతో సుఖమును పొందియుండును; అట్లే ఈ శరీరమునుండి పోవునప్పు డంతే దుఃఖమును పొందుటకు నిన్ను సేవింపకుండుటయే కారణ మని విన్నవించిరి. పుట్టుటలో గల జీవుని సంతోషమునకు కారణము లోక వ్యవహారములో నున్న ఆనందమును; పోవువేళగల దుఃఖమునకు కారణము భక్తి రాహిత్యము నని విశ్వనాథవారి నిష్కర్ష. ఇది, భక్తిపై వారి విశ్వాసముతో పాటు వారి లోక పరిశీలనమును కూడ తెలియజేయుచున్నది. విశ్వనాథవారు 'ప్రవహించు కాలువ య్యైనచో నెండవచ్చును స్వామి!...'(28) అనెడి

పద్యమున వేంకటేశ్వరుని యందు పరబ్రహ్మతత్త్వము నారోపించి లోక పరిశీలనాగత విశేషముచే భావము నతిశయింపజేసిరి. లోకములో నీరు ప్రవహించు పంట కాలువలు ఎండిపోవుట చెరువులు సాధారణముగ నెండకుండుట యున్నది. మిక్కిలి లోతైన కొలనులను గుండము లందురు. మండువేసవిలో అధికోష్ణముచే చెరువులు, గుండములు కూడ నెండుట అచ్చు టచ్చుట కలదు. ఈ విషయములను గ్రహించి కవి, కామ ప్రవృత్తి గల హృదయమును గుండముతో పోల్చి చెప్పుచున్నారు. తమ హృదయము విషయవాసనలతో ప్రవాహమువలె నున్నచో నేడో రేపో ఎండునని, అనగా విషయ వాసనలు తొలగునని తలపవచ్చును. కాని అది గుండము వలె సాంద్రమై యన్నది. కావున సహస్రార్క తేజుడగు వేంకటేశ్వరుని, పంకముతోసహ జలము నెండించునట్లుగా, విషయ వాసనలతో లోతైన హృదయము నెండింపుమని ప్రార్థించుచున్నారు. ఇచ్చుట వేంకటేశ్వరుడు పరబ్రహ్మముగా చెప్పబడెను. వేల కొలది సూర్య మండలముల కాంతి ఒక్కసారి కనబడిన ఎట్లుండునో, పరబ్రహ్మ యట్లుండును( భగవద్గీత.11.12). ఇచ్చుట వేంకటేశ్వరు డటువంటి సహస్రార్క తేజుడని కవి వర్ణన. అనగా పరబ్రహ్మము. ఇది విశ్వనాథవారి భక్తి తత్త్వముల నేకత్ర దర్శింప జేయుచున్నది. ఇది వారి లోక పరిశీలనమునకు నిదర్శనము. కొన్ని పద్యములలో భక్తు లేడు కొండ లెక్కివచ్చుట తలనీలా లిచ్చుట మొదలగు విషయములు వ్యవహారధోరణిలో వ్యక్తము చేసి భక్తుల స్థితిని ప్రకటించిరి(97,98). వేంకటేశ్వరుని శంఖచక్రములను ఊర్ధ్వపుండ్రమును క్రమముగ వాసుకి వినాయకుడు త్రిశూలము అనువానితో నుపమించి ['సాద సుదర్శన మది చేత వాసుకి చుట్టు కొన్నట్లె...'(100)] చెప్పిరి. ఇది విశ్వనాథవారి శివకేశవాభేద భక్తికి అపూర్వ కల్పనకు పరమ మనోహరమైన నిదర్శనము.

---

# 13. భీమేశలింగ! ద్రాక్షారామ సంగ!

ఇది 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను గ్రంథములోని ఆరవ శతక పరామర్శ. ఈ శతకమున దక్షిణకాశి యగు ద్రాక్షారామమునందలి భీమేశ్వరస్వామి స్తుతింపబడినాడు. అద్వైత తత్త్వము, భక్తి అనునవి యితర శతకములలోవలెనే ఈ శతకమునకు ప్రధాన వస్తువులు. 'భీమేశలింగ! ద్రాక్షారామ సంగ!' అను మకుటము, మధ్యాక్కర పాదము

యొక్క రెండవ ఇంద్రగణములోని చివరి గురువుతో నారంభ మగుచున్నది. అనగా మకుటముకల పాదము యొక్క రెండవ ఇంద్రగణము తప్పనిసరిగ ర, నగ ములే కావలసి వచ్చును. అయిదవ గణాద్యక్షర మగు 'క్షా' యతి స్థాన మగుచున్నది. ఇది ద్రాక్షారామములోని 'క్షా' యగుటచేత ఉభయయతి చెల్లును.

విశ్వనాథవారు హరిహరాద్వైత భావము కలవారయ్యును, అధికముగా శివారాధనముపై మక్కువ గలవారు. దీనికి, పది మధ్యాక్కర శతకములలో నధిక సంఖ్య గలవి శివపరమైనవి యగుట యొక నిదర్శనము. ఈ శతకమున తనను ఐహిక భోగముల నుండి దూరము చేయు మనియు జన్మరాహిత్యమును ప్రసాదింపు మనియు కవి, భీమేశ్వరుని వేడికొనిరి.

## స్తోత్రము

ద్రాక్షారామము సప్త గోదావరీ మండలాంతర్గతము. పంచారామములలో నీ క్షేత్రము ప్రశస్తమైనది. శ్రీనాథుని భీమఖండ మీ ప్రశస్తిని చాటుచున్నది. కాశీనుండి వెడలగొట్టబడిన వ్యాసుడీ ద్రాక్షారామము చేరి, భీమేశ్వరుని శరణుజొచ్చెను. ఈ భీమేశ్వరుడు సప్త ఋషులచే స్తోత్రముల నందినవాడు. విశ్వనాథవారీ విషయములను స్తోత్రరూపముగ నిట్లు రచించిరి.

శ్రీసప్త గోదావరాంబు నిత్యాభిషిక్త రమ్యాంగ
వ్యాస సన్నుతి రంగ సప్త ఋషి మండలార్చిత లింగ
ప్రాసాద శేఖరోన్నత వృషభరాజ రాజత్తురంగ
శాసితానంగ భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! (1)

## పరబ్రహ్మతత్త్వము

విశ్వనాథవారు ద్రాక్షారామ భీమేశుని యందు పరబ్రహ్మ తత్త్వ మారోపించి ఈ క్రింది పద్యమును రచించిరి.

ఫణిరాజు నీ తలపైన నెప్పుడు పడగ విప్పికొన
గణనాథపిత! నీవు మూర్తి కట్టిన గానంబ వేమొ
అణిమాదులకు పైన నీవు ప్రభు! హో3 ఊహో3 ఉ మంచుందు
కణశ ముగ్ధాంగ భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! (25)

ఈ పద్యమును కవి వ్యవహార విషయములతో మనోహరముగా రచించిరి. శివలింగముపై శేషుని పడగలు నిత్యము గొడుగు వలె విప్పుకొని యుండును. ఇది పరమశివుని సగుణరూపము. పూర్వ మొక చోట కవి యీ పడగను ప్రస్తావించి వ్యవహార గతమైన ఒక విశ్వాసము నాధారముగా గొని, దానిని శివునకు, సంపదలకు చిహ్నముగా చెప్పిరి(పుట: ). ఇక్కడ పడగ యుండుటకు శివుడు గానస్వరూపు డగుటయే హేతు వని చెప్పుచున్నారు. నాదస్వరమునో లేక ఏదైన నొక గానమునో వినిన సర్పము, పడగ విప్పి నాట్యము చేయు నని ప్రతీతి. దీని ఆధారముచే శివలింగముపై శేషుని పడగ యుండుట కా శివుడు మూర్తి కట్టిన గాన మేమొ నని కవి ఉత్ప్రేక్షించుచున్నారు. భీమేశ్వరుడు పరబ్రహ్మయని ప్రతిపాదనము. పరబ్రహ్మ ఓంకారమయము. 'ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ...' అను శ్రుతి వాక్యమును బట్టి ఓంకారమే పరబ్రహ్మ స్వరూపము. కావున పరబ్రహ్మము ధ్వనిమయము, రాగమయము, గానమయము. లౌకిక సత్య మగు సర్పము గానము కానందించి, చెంత చేరు నను విషయ మిట శివునిపై పడగ యుండు నను దానిని సమర్థించుచున్నది. శివునిపై బుసలు కొట్టుచు నుండెడి యా పడగ ధ్వనిని కవి యిందు 'హో3 ఉహో3 ఉ' అని అనుకరించిరి. ఈ విధముగ నీ పద్యమున కవి తన కల్పనా చాతుర్యముతో వ్యవహార విషయములను జొప్పించి చెప్పిరి. 'తొలుత నాంతాకాశ మందు గోళాకృతులుగను ...'(81) అనెడి పద్యమున విశ్వనాథవారు భీమేశ్వరుని యందు పరబ్రహ్మ తత్త్వమును చూపిరి. పూర్వ శతకములలోని పద్యములలో వలె ఇందును విశ్వమంతకును పరమేశ్వరుడే ఆధారమనెడి భావమును వెలిపుచ్చిరి. ఈ పద్యములలో భావ మొకటియే అయినను ప్రకటనము నందు వైవిధ్యము కలదు. ఇచ్చట భీమలింగ పరబ్రహ్మము విశ్వమునందు గోళాకృతులు దాల్చియు, దానితో నాగక, సృష్టి చేయుచు దాని నాడించుచు, నలసటలేక యుండునని కవి దానిని స్తుతించిరి. అదే పరబ్రహ్మము విశ్వసృష్టియందన్ని రూపములను దాల్చునని కవి ఈ క్రింది పద్యమున నుడివిడిరి.

> అన్నింటి కన్న నాశ్చర్యమేమన నాకస మందు
> నిన్ను నీవే తారకలుగఁ బొడిచి కొంటివి మనుజులయు
> తెన్నున నేలపై దిగితివి యిదింత తికమక లగుచుఁ
> జన్నట్టి మెలిక భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! (82)

విశ్వనాథవా రిందు అద్వైత తత్త్వము నంతను సులభ గోచరము కావించిరి. పరబ్రహ్మమే అనంత విశ్వమున గ్రహములుగను నక్షత్రములుగను రూపు దాల్చును.

ఆత్మయై స్థూల దేహమును ధరించి అవనిపై అవతరించును. మనకీ తత్త్వ మవగతము కాక తికమక గొల్పును. విశ్వనాథవా రిట్లు పరబ్రహ్మ తత్త్వమును వివరించి, ద్రాక్షారామ భీమేశుని పరబ్రహ్మగా నుతించిరి. ఇది వారి సగుణ మూర్తులందు నిర్గుణ బ్రహ్మమును చూపు సమన్వయ దృష్టి. ఈ విధముగ వీరు విశ్వ మంతయు పరబ్రహ్మమయ మను భావమును 'శ్రీగిరి', 'శ్రీకాళహస్తి' మొదలగు శతకములలో వివరించిరి. విశ్వనాథవారి 'వరాస్వామి' శతకవములోని 'శ్రీవాణీ గిరిజాధినాథుల జగత్స్థిత్యుద్భవాంతః క్రియా.....' అనెడి పద్యగత భావమునే వారు మధ్యాక్కర శతకములందు పలు విధముల వ్యాఖ్యానించుచు వ్రాసిరి. అట్టి పద్యములలో నిది యొకటి.

విశ్వనాథవారు విశ్వములోని గ్రహభ్రమణాదు లన్నియు నేదో నియమము ననుసరించి జరుగుచుండగ, అజ్ఞానులు దీనిని కూడ మానవ యత్నమనియే తలంతురని తమ ఆస్తిక్య భావమును, నాస్తికుల అజ్ఞానమును వెల్లడిచేసిరి.(83) భీమేశ్వరుడు జగత్సార పరమార్థ రూపుడని స్తుతింపబడినాడు.(86). ఇది వారి బ్రహ్మ భావమునకు ప్రతీక. పరమేశ్వరుడు దేహమున ప్రవేశించగనే ఈ జీవు డల్ప మానవుడగును. మాయా ప్రభావముచే అనాత్మ భావము కలిగి పరబ్రహ్మమునకు దూరమగును (87). అని చెప్పి విశ్వనాథవారు చావకుండగను కూడ దైవమడ్డుపడుట, అప్పుడు భగవంతుని తలచుట, జన్మ రాహిత్యమును కోరుట అను విషయములను 'చాకుండఁ జేతువో దానికీవును జాల వాపదలు రాకుండఁ జేతువో...'(88) అను పద్యమున వెల్లడి చేసిరి. విశ్వనాథవా రిదే భావముతో నసత్తు నందలి మానవుల భ్రాంతిని మరి కొన్ని పద్యములలో వర్ణించిరి.

### తత్త్వజ్ఞానము

'ఇంటిలో నాల్గు మూలలను తిరిగెద నెచటఁ గన్పడవు...'(61) అనెడి పద్యము నందలి అంతరార్థము తాత్త్విక విషయ సంపన్నము. భగవంతుడు సర్వవ్యాపి. అట్లన్నప్పటికిని కంటికి కనబడువాడు కాడు. పరమేశ్వరుడు కాంతిమయము. కాంతి దృష్టి గోచరము. కావున పరమేశ్వరుడు వీక్షణమునం దుండును. జ్ఞాన నేత్రముచే వీక్షింపబడును. అనగా సమాధియందలి దృష్టికి గోచర మగును. ఆ విధముగ దర్శన మీయు మని విశ్వనాథవారు ద్రాక్షారామ భీమేశ్వర స్వామిని వేడికొనిరి. ఇట్టి తాత్త్వికార్థ మీ పద్యమున నిక్షిప్త మైనది. ఒక పద్యమున (73) వారు కోర్కెలు జయించితి ననియు, మనసులో దైవమును నిలుపుకొంటి ననియు, కావున దర్శన మిమ్మనియు ప్రార్థించిరి. లేనిచో జడమైన కాలముయొక్క గతి యనుకొందు నని వ్రాసిరి.

శతకములలో భక్తు లీ విధముగా భక్తి పారవశ్యమున నిర్భీతిగా భగవంతునితో భాషింతురు. 'ఒగిఁ బూలలోఁ బెట్టి నీది నీకిచ్చుచున్నాను...'(76) అనెడి పద్యమునం దిట్లే భగవంతునితో సంభాషించుచు కవి నిగూఢమైన తాత్త్విక భావమును వెల్లడించిరి. ఆత్మ బ్రహ్మము. ఆత్మను దేహాదులనుండి విముక్తి గావించి పరబ్రహ్మమునం దైక్యము చేయుట జీవుల పరమ కర్తవ్యము. దీనినే కవి ఈ పద్యములో 'పూలలో బెట్టి నీది నీ కిచ్చుచున్నా' ననుట. భక్తులు, హృదయమున భగవంతుని నిలుపుకొని నిరంతరము చేయు ధ్యానము వలనను, ఆత్మకు దేహభ్రాంతిని తొలగించుటకు చేయు అభ్యాసము వలనను నిది సాధ్య మగును. కాని ఆ బ్రహ్మభావ మంత సులభ సాధ్యము కాదు. విషయ వాంఛలనుండి మనఃప్రవృత్తిని మరల్చుట కష్టతరము. దీనిని, భగవంతుడు భక్తుని 'నగుబాట్ల పాల్సేసి నీవు నాయది నాకిచ్చుచుంటి' వనుట. అనగా ఆత్మను దేహ మందే యుంచు నట్లు విషయ వాసనల నుండి విముక్తి కలిగించకపోవుట. ఇదంతయు భగవంతుని నిర్ణయము. ఆ పరాత్పరుడు జగత్ప్రభువు. నిష్ఠగల సాధన లేనిచో భక్తునికి ఇహలోకగతమైన అగచాట్లు తప్పవు. ఈ శతకమునం దనేక పద్యములలో నిట్టి గహనమైన తత్త్వజ్ఞానము సులభమైన పదజాలముతో చెప్పబడినది. వ్యవహార గతమైన నుడికారపు సొంపుతో విశదీకరింపబడినది.

## వైరాగ్యభావన

విశ్వనాథవా రక్కడక్కడ కొన్ని పద్యములలో వైరాగ్య భావమును ప్రకటింతురు. ఒకచోట భీమేశ్వరుని నుతించుచు మరణము, వ్యాధులు, మనుష్యుల దుఃఖభారము చూచినప్పుడు అది అజ్ఞాన మనెడి వేదాంత భావ మరుదుగా తోచునని ప్రకటించిరి(47). 'ఏ దినమ్మున కాదినమ్మె తెలవారునిదె ప్రొద్దుక్రుంకు...'(49) అనెడి పద్యమున తమ నిస్సంగత్వమును తెలిపిరి. నిత్యము రాత్రింబవళ్ళు కలుగుచునే యుండును కాని, మనసులోని దిగులు పోదు. ఆత్మజ్ఞాన మవగతము కాకపోవుటయే ఆ దిగులు. ఈ లౌకిక కార్యములును, సంసారగతమైన బాధలును, అనుభూతులును ఎందువలనో తెలియదు. ఇట్టి వైరాగ్య భావమును విశ్వనాథవారు ద్రాక్షారామ దైవమునకు విన్నవించి, వచ్చి ఆదుకొమ్మని ప్రార్థించుచున్నారు. ఇది వారి విషయ విరక్తిని జ్ఞానానురక్తిని వ్యక్తము చేయుచున్నది.

## ఆత్మనివేదనము

కవి భక్తి భావముతో 'నన్ను నీలోనఁ జేర్చుకోవచ్చు' నని (31) తమకు తామే భగవంతుని కర్పించుకొనిరి. ఈ సందర్భమున వారు, ఇంత కంటె పెద్ద దినములు

పూర్వమే గడిచెననియు, అంతయో ఇంతయో బాధ కలదు గాని పూర్వపు బాధలు లేవనియు, చింత ఏమాత్రము లేదనియు చెప్పిరి. అందుచేతనే తాను భగవంతుని చేరుటకు సిద్ధముగా నుంటినని తెలిపి శివుని శాంత మనస్కుడని సంబోధించిరి. ఇది వారి స్వీయ కథనముతో కూడిన అనన్య భక్తి భావమును తెలుపుచున్నది.

## అకుంఠిత భక్తి

విశ్వనాథవారీ శతకమున తమ అపరిమిత భక్తిని ప్రస్ఫుటముగ ప్రకటించిరి. వారి భక్తి భావము యొక్క పరాకాష్ఠ భీమేశలింగ వర్ణనతో నభివ్యక్త మగుచున్నది. వారి భ భక్త్యతిశయమును 'బాదరబందీ లివి తలమున్కలై బాధించుచున్న...'(6) అనెడి పద్యము ప్రకటించుచున్నది. మానవుడు ప్రపంచగతమైన పలురకముల కష్ట సుఖములందును, లాభ నష్టములందును మునిగి తేలుచుండును. ఈ సంబంధమును వ్యవహారమున బాదరబందీ లందురు. విశ్వనాథవారు దీనికి లోనై యున్నను ద్రాక్షారామ భీమేశుని పాదపద్మములను విడువ జాలననియు, అది భక్తియో! లేక వ్యాధియో! అనియు తమ అకుంఠిత భక్తిని ప్రకటించిరి.

విశ్వనాథవారు తమ పవిత్ర భక్తిభావమును 'నీ వెఱుంగుదువు తండ్రీ! భవద్ధ్యాన నిభృత వేళలను...'(19) అనెడి పద్యమున నిరుపమానముగ వర్ణించిరి. కవితా రూపము దాల్చిన వారి అకుంఠిత భక్తి కిది నిదర్శనము. వారు భక్త్యావేశముతో పరమేశ్వరు డేల పలుకడా యని 'పది మాటలకు నొక్క మాట బదులుగాఁ బలుకంగ వచ్చు...'(9) అనెడి పద్యమున విన్నవించిరి. వ్యవహారములోని వాక్యధోరణి ఈ పద్యపు టెత్తుగడలో నుండి, పద్యభావమునకు సౌందర్యము నాపాదించుచున్నది. పదిమాటలు పలికినప్పు డొక్కసారి యైనను బదులు వచ్చును కాని, ఈ భీమేశ్వరు డే వ్రతమును పూనినాడో, వందల కొలది పద్యములకైనను బదులు పల్కడు కదా! అని కవి, భగవద్దర్శనము కాకపోవుటలోని ఆశ్చర్యమును వ్యక్తము చేసిరి. వ్రాసిన పద్యాలకైన నది దిక్కు లేద యనెడి నుడికార ప్రయోగముచే కవి భావమునకు కవితా రూపమైన అతిశయము చేకూరుచున్నది.

## వినయ భక్తి

విశ్వనాథవారి భక్తి భావమీ మధ్యాక్కర శతకములలో పలువిధముల ప్రదర్శింపబడును. ఒక పద్యములో నద్వైత రూపములో స్తుతించిన కవి, మరొక పద్యములో నధిక్షేప రూపమున నుతించును. అట్లే ఒకదానియందు భగవంతునితో సన్నిహితముగా సంభాషించును. మరొక దానిలో తన్మయ భక్తిని ప్రదర్శించును.

'ఎంచవే యేకాంత మందు నన్ను మహేశ్వర! పరిగణించవే నా దీనమ్మైన చరితంబు...'(29) అనెడి పద్యమున అభ్యర్థనా పూర్వకమైన వినయభక్తిని ప్రకటించిరి. విశ్వనాథవారు దైవమును 'హృద్రసాంచిత రూప!' అని సంబోధించి ఏకాంతమందు తమను తలచుకొమ్మనియు, తమ దీనమ్మైన చరిత్రను పరిగణింపుమనియు, ప్రసన్నుడవు కమ్మనియు, పాపము పరిహరింపుమనియు విన్నవించుకొనిరి. ఈ పద్యమున కవి వినయ భావముతో కూడిన ఒక దీనునివలె వేడుకొనిరి. ఇది వారి వినయ భక్తికి నిదర్శనము. అట్లే వారు భక్తిచే కలిగిన వేదనను 'నెత్తిపై కెక్కి పిండికొట్టుచున్నావు, గుండెలోనుండి గగ్గోలు చేయుచున్నావు, లుంగయై పోతిని' అని ప్రకటించిరి(30). ఇది వారికి భగవంతుని యెడల గల తపనను తెలుపు చున్నది.

## ప్రగాఢభక్తి

విశ్వనాథవారీ క్రింది పద్యమున తమ ప్రగాఢ భక్తి భావమును ప్రకటించిరి.

క్రుమ్మి ప్రవాహంబు చొరగ నిమిడించుకొని యాగి యాగి
గుమ్మ నీళ్ళులు క్రక్కు తూమువలె నాదు గుండియ నిన్ను
చిమ్ముచున్నది యక్కఱయుగ నో దయాసింధు! నింపి హృద
యమ్ము చీల్పఁగదె భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! (41)

పొంగి పొరలి వచ్చు నీటి ప్రవాహ మొక్కచో చేరి యాగి, ఒక తూము ద్వారా బయట కెట్లు శక్తితో చిమ్ముకొను వచ్చునో, అట్లే వారి గుండె భగవద్భక్తిని చిమ్ముచున్న దనియు, అది 'అక్కర' గ నేర్పడుచున్న దనియు విశ్వనాథవారు భీమేశునకు విన్నవించిరి. తరువాత, ఆ భక్తితో వారి గుండెను నింపి, ఒక్కసారిగ చీల్చుమని ప్రార్థించిరి. ఇది వారి ప్రగాఢభక్తిని తెలుపుటతోపాటు భావతీవ్రత నొక చిత్తరువు వలె కూడ ప్రకటించుచున్నది. ఇచ్చటనున్న భక్తిభావమును ఉపమాన సామ్యముతో చెప్పుటలోని రామణీయక మొక మహాకావ్యమును స్ఫురణకు దెచ్చుచున్నది. ఈ విధముగ విశ్వనాథవారు 'అమ్మో! మహాదేవ! నీకు నా బ్రతుకంతయు నంకి, తమ్ముగా జేసితి...'(43) వంటి పలు పద్యములలో తమ ప్రగాఢ భక్తి భావమును ప్రదర్శించిరి. 'నీ యనుగ్రహమది కల్లలేదని నే నేడ్చు చుండ...'(45) అనెడి పద్యమున భగవంతుని అనుగ్రహము కలుగలే దనెడి విలాపమును, హృదయము నందున్న జ్యోతి స్వరూపమైన

ఆత్మ యొక్క ప్రతిస్పందనను కడు మనోహరముగ ప్రకటించిరి. నిప్పుకు నీరు తగిలినప్పటి 'చుంయి చుంయి' అను ధ్వనిని అనుకరించి, చమత్కారమును సృష్టించిరి.

## మోక్షాసక్తి

ఒక పద్యమున (17) వారు 'నీదయ కోసమై యెదురు చూతు నా నిముస మెప్పుడని' అని తమ ఇహలోక విరక్తి భావమును, పరమేశ్వరునియం దైక్యము కావలెన నెడి భావమును ప్రకటించిరి. 'నిన్ను సేవించిన వారికి భోగము నిచ్చినావు, నేను రాగి దమ్మిడియు కూడ నడుగను, నేను కోరునది నీ సాక్షాత్కారమేను' అని వారు ద్రాక్షారామ భీమేశ్వరుని వేడుకొనిరి(92). ఇది వారి నిష్కళంక మైన మోక్షాసక్తిని తెలుపుచున్నది. మరి రెండు పద్యములలో వారు విషయాసక్తిని నిరసించిరి(93,94). ఐహిక వాంఛలు తనకు లేవని, పరపదమును ప్రసాదింపు మని, భగవంతుని పరిపరి విధముల వేడుకొనిరి.

## వ్యాజస్తుతి

కవి వ్యాజస్తుతి రూపమున ద్రాక్షారామ భీమేశ్వరుని 'పాపమా దక్షుని దైన వీడు పాడ్వరచితి వంత...'(11) అనెడి పద్యమున స్తుతించిరి. శివుడు కోపించి దక్షుని యజ్ఞవాటికను ధ్వంసము చేయును. ఆ శివుని ప్రతాపమునకు సప్తర్షులు హర్షించి, ఆతనిని స్తుతించిరి. ఈ కార్యమును కవి 'ఈవాడిన దాటయ్యె పోవుచుండు' నని శివుని విచ్చలవిడితనమును, అధికారమును అధిక్షేపించిరి. ఈ పద్యమున పరమేశ్వరుని యొక్క నిరుపమానతత్త్వమును, వ్యాజస్తుత్యలంకార మూలమున నుతించిరి.

## స్వీయవృత్త ప్రకటనము

శతకములలో సాధారణముగా కవి తన సొంత గోడును వెళ్ళబోసుకొనును. అందు వలననే శతకములకు కొంత ఆత్మాశ్రయ కవితా ధోరణి కూడ కలదందురు. విశ్వనాథవారొక పద్యమున ['పొంచితి పెరిగిన బిడ్డ మ్రింగి నా సొంత చేరితివి...'(16)] భీమేశ్వర స్వామిని ఉపాలంభించుచు స్తుతించిరి. ఈ శతకము వ్రాయునాటికి వారి కుమారులలో నొకరు మరణించిరి. గుంటూరులోని వారి యుద్యోగము పోయెను. వారికి భక్తి భావము తీవ్రతరమయ్యెను. ఈ విషయములకు భగవంతుడే కారణమని వారు పై పద్యమున నిందించుచును. 'ఇక

ప్రాణములను కూడ గొనిపోవాని నెవరు వలదంటిరి' అని నిష్ఠూరముగా భీమేశ్వరునితో ననిరి. భక్తి పరాకాష్ఠ యందిట్టి ఉపాలంభన భావమే కలుగును. అధిక్షేప శతకము లందిట్టి పద్యములే ఉండును. హరిహరాభేద భావముతో వారు ఆత్మ సాక్షాత్కారమును కోరుచు వ్రాసిన 'నీ పెఱరూపైన రామచంద్రుని నిండైన కథను...'(99) అనుపద్యము రామాయణ కల్పవృక్ష రచనా వృత్తాంతమును వెల్లడిచేయుచున్నది.

## లోక పరిశీలనము

'ఆది కాలము నుండి భక్త జనుల హస్తామలకమవు ...'(13) అనెడి పద్యమున కవి లోకవ్యవహారములోని యొక సత్యమును గ్రహించి ధ్వన్యాత్మకముగ ప్రకటించిరి. హస్తామలక మనున దొక ప్రౌఢ లోకోక్తి. అనగా అరచేతియందుసిరిక. ఉసిరికాయ ఆరోగ్య ప్రదమనియు, నందు ప్రాత ఉసిరి పచ్చడి శ్రేష్ఠమనియు, లోకమునం దొక విశ్వాసము కలదు. అట్టి ఉసిరిక అరచేతియం దుండుట యనగా అందుబాటులో నొక భాగ్యముండుటయే. పరమేశ్వరు డిట్లు భక్త జనులకు అరచేతియం దామలక ఫలము వంటివాడు. విశ్వనాథవారు, భోజనము నందు పథ్యమునకు ప్రాత యుసిరికాయ పచ్చడి ఎటువంటిదో తమకా భగవంతుడట్టి వాడని అనుకొనుచు, నా దేవదేవునితో 'చింత పులు పెక్కు' వలదనియు, తన 'వ్యాధి అనాది' దనియు ప్రార్థించిరి. ఇది వారి భక్తి భావ ప్రకటనమునకు పతాక వంటిది.

హృదయమునం దుండు ఆత్మ అంత సులభ గోచరము కాదు. నిరంతర భక్తి భావనా తత్పరులకు, విషయ వాసనా దూరులకు గాని ఆత్మ జ్ఞానము కలుగదు. అనగా నితరులకు హృదయము నందున్న దైవము కానరాడనుట. దీనినే ఒక పద్యమున (33) 'నెంత త్రవ్వు చుండిన చెమ్మరా' వనుట, 'నీకంటె పలనాటి నూతులు మే' లనుట. ఇది వారి లోక పరిశీలనమునకు దానిని పద్య భావముతో ననుసంధించెడి నేర్పునకు నిదర్శనము. విశ్వనాథవారు మరొక పద్యములో(34) భగవంతుడు తమ కనుభూతమైనప్పుడు గుండె చిత్రిక పట్టినట్లుండునని వ్రాసిరి. ఇది వారి 'భక్తి' బావమును ప్రకటించుటలోని నిర్దుష్టతను సూచించుచున్నది. ఒక పద్యమున (53) కవి భీమేశలింగము గుండ్రని కోల రాయియే యైనను, తమకు గోచరమగుట లేదని భౌతిక-తాత్త్విక విషయములను రెంటిని చెప్పిరి. ఇది వారి తాత్త్విక ప్రతిభతో పాటు లోకపరిశీలనమును కూడ ప్రకటించుచున్నది. భీమేశలింగము గుండ్రని లింగాకృతి కలవాడు. చేతితో గట్టిగ పట్టుకొనిన పట్టు దొరకదు. ఇది బయటకు దెలియు సామాన్య విషయము. ఆ పరమేశ్వరుని పట్టుట ఎవరికి దెలియును? అదంత

సామాన్యము కాదుకదా! ఇది దాని తాత్త్వికార్థము. ఈ అంశమును 'పట్టు చిక్కని యట్టి నున్న గుండ్రాయివలె నున్న నిన్నుఁ ...'(55) అనెడి పద్యమున వర్ణించిన విశ్వనాథవారు, పరమేశ్వర తత్త్వము నెరుగుట యసాధ్యమైనప్పుడు పూర్వపు భక్తు లెట్లు తెలిసికొనిరో యని భీమేశ్వరుని ప్రశ్నించి తమకా తత్త్వము తెలియునట్లుగ చేయుమని ప్రార్థించిరి. ఇందు వారు భగవంతుని ప్రార్థించిన తీరు వారి లోకపరిశీలనమును వ్యక్తము చేయుచున్నది.

## లోకోక్తి

విశ్వనాథవారొక పద్యమున (53)'నూకలకెడ్చి యేడ్చి తవుటికేడ్చిన యట్ల' నెడి లోకోక్తిని ప్రయోగించి పద్యగత భావమును శక్తిమంతము గావించిరి. ఇటువంటి లోకోక్తి ప్రయోగములను ఈ శతకములోని పలుతావుల నుంచి చూపించవచ్చు.

## నుడికార ప్రయోగము

కవి 'నేననుకొందును దేహ బలమున నెగడు నిదంచు...'(21) అనెడి పద్యమున నుడికార ప్రయోగముతో తమ భక్తిని వెల్లడి చేసిరి. ఒక పద్యమున(66) వారు సర్వదా నా పరమేశ్వరునే తలచెద నని ప్రకటించిరి. తన, వీడని భావమును చెప్పుటకు భీమేశ్వరునితో 'తన నొక గుదిబండగా' నెంచుకొమ్మని విన్నవించుకొనిరి. ఏ విధముగ నైనను తప్పని దానిని గుదిబండ యని లోక వ్యవహారమున కలదు. ఈ నుడికార ప్రయోగముతో వారి నిరంతర భక్తిభావము సుస్థాపిత మగుచున్నది. భక్తితో కూడిన తన దేహబలముచే పరంజ్యోతి నెగడునని తాను భావింపగా, ప్రసన్నుడగు ఆ పరమాత్మ భక్తికి లొంగక తప్పదని తాను తలచును. అప్పుడు వారు దొరికిన దైవమును వదలరాదని హృదయమునందు బంధింతురు. ఇది శతక మర్యాదలో సాగిన, విశ్వనాథవారి భక్తి భావ ప్రదర్శనము. భగవంతుడు భక్త సులభుడు. కావున భక్తుడు కోరినచో తప్పక ప్రత్యక్ష మగును. అట్లే భక్తితో తలచగనే గోచరమగు పరబ్రహ్మమును భక్తుడు వదల జాలడు. ఈ రెండింటిని క్రమముగా కవి 'తప్పని తద్దిన' మనియు, 'మెత్తని వాని బట్టికొని మొత్త బుద్ధి' యనియు నుడికారములతో ప్రకటించుట వలన భావమున కెనలేని యతిశయము కలుగుచున్నది. పరిహాస పూర్వకముగ భగవంతునితో నిట్లు పలుకుట స్వతంత్రులైన శతక కవుల లక్షణము.

# 14. నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల!

ఈ శతకమును విశ్వనాథవారు తమ స్వగ్రామమైన నందమూరులోని సంతాన వేణుగోపాలస్వామిపై రచించిరి. తెలుగునాట ప్రతి గ్రామమునందును శివకేశవాలయము లుండుట ప్రతీతి. భక్తులీ రెండు దేవాలయములను సమమైన భక్తి భావముతో దర్శించుట పరిపాటి. విశ్వనాథవా రిదే భావముతో వారి గ్రామమునందు శివుడగు విశ్వేశ్వరునిపై కులస్వామి శతకమును, విష్ణువగు సంతాన వేణుగోపాల స్వామిపై నందమూరు శతకమును రచించిరి. వారి శతకములం దెల్లెడల కొట్టవచ్చినట్లుండు శివకేశవాభేదమున కీ రెండు శతకములు ప్రత్యేక సాక్ష్యములు. శివపరమైన శతకములలో శివుని పరబ్రహ్మముగా చెప్పినట్లే విశ్వనాథవారు ఈ శతకమున విష్ణువును పరబ్రహ్మముగా జెప్పి వేణుగోపాలుని నుతించిరి. ఇతర శతకములకంటె నిందు నుడికార ప్రయోగము తక్కువగా కనబడును. ఇందు ఆత్మానాత్మల తత్త్వమెక్కువగా వ్యాఖ్యానింపబడినది. నందమూర్నిలయ!సంతాన వేణుగోపాల! అను నీ శతక మకుటము, మొదటి ఇంద్రగణము లోపించిన మధ్యాక్కర పాదమగుచున్నది. 'నందమూర్నిలయ' వరకు పూర్వార్ధము ముగియుట, పదచ్ఛేదముతో సూచితమగుచున్నది. 'వేణుగోపాల' లోని 'వే' అయిదవ గణాద్యక్షరమై యతిస్థాన మగుచున్నది. కాగా పరిమితమైన వ్యంజన యతులనే ప్రయోగింప దగియున్నది. ఇందు ఇకార వర్గ విశిష్టమైన 'వ, ప, బ' లతోనే యతి మైత్రులు కూర్పబడియున్నవి. ఇచ్చట కూడ పదచ్ఛేద ముండుట పద్య గమనమునకు సౌందర్య హేతువు.

## ఆత్మతత్త్వము

దృష్టికి గోచరము కాని ఆత్మను గురించి కవి 'పర్వతం బొక్కండు పైనఁ బడి చావఁ బ్రాణముల్ పోవ...'(57) అను పద్యమున జెప్పిరి. ఆత్మ శూన్యమును, పూర్ణమును, చైతన్యమును. ఆత్మ బ్రహ్మము. బ్రహ్మము వాయువును, కాంతి స్వరూపమును, జ్ఞానమును. ఈ బ్రహ్మము నందలి ఒక బిందువే జీవాత్మ. ఇదంతయు నుపనిషత్ప్రతిపాదితవస్తువు. దీని వ్యాఖ్యయేం 'జీవు డన్నది గాలియా! ప్రకాశమా! చిల్లేశమా!...'(58) అనెడి పద్యముగా రూపొందినది.

ఈ విధముగ విశ్వనాథవారు, ఉపనిషత్తులలో చెప్పబడిన ఆత్మ స్వరూపమును వ్యాఖ్యానించుచు పంచ భూతములను, ప్రకృతిని వర్ణించి సృష్టి రహస్యములను ప్రపంచించిరి. ఇందు(59,60,61,62,63)వారు ప్రదర్శించిన వర్ణనారామణీయకము ఆధ్యాత్మిక తత్త్వమునకు వన్నె చేకూర్చుచున్నది. 'ఆనతమయి భావమైన యట్టిది యాత్మయు...'(64) అను పద్యము ఆత్మతత్త్వమును వర్ణించుచున్నది. ఆత్మ, చైతన్య స్వరూపము. సర్వము ఆత్మమయ మనెడి ఉపనిష ద్వివరణము లౌకిక దృష్టిలో 'భావ' మనిపించును. ఉపనిషత్తులు శరీరమును మాయా స్వరూపమని చెప్పినవి. అనగా ఆత్మ ఒక్కటే నిత్యము; శరీరాదు లనిత్యములు. లౌకిక దృష్టిలో శరీరము ద్రవ్యమగుచున్నది. న్యాయ మాలోచించిన ఊహా రూపమగు నాత్మయే మాయ యనియు, ద్రవ్య రూపమగు శరీరమే నిత్యమనియు ననిపించును. కావున ఉపనిషత్తులు మాయయే శరీరమని చెప్పుట ఎట్లు పొసగును అనెడి లౌకిక మీమాంసతో విశ్వనాథవారు ఆత్మతత్త్వమును వివరించిరి.

**ఆత్మజ్ఞానము**

ఈ తనూ నిర్మితి తలచిన కొలంది నేవమ్ము కలుగు
చేతమ్ము నందుఁ దాత్కాలికము వాంఛ చేత నిద్దానఁ
బ్రీతి ఘటిల్లెడు మరియు నంతలో భీతి ఘటిల్లు
వీతార్తి! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! (10)

ఈ పద్యము విశ్వనాథవారి ఆత్మజ్ఞానమును ప్రకటించుచు, విషయ విరక్తి ఎంత దుర్లభమో చెప్పుచున్నది. మాయా ప్రభావముచే శేర్పడిన దేహాదులు ఆత్మ కాదనెడి విషయము నెఱిగిన వారికీ దేహముపై నేవము కలుగును. మనసులో వాంఛలు కలుగగనే దేహముపై ప్రీతి కలుగును. వెనువెంటనే అది మోక్ష హేతువు కాదనెడి భావము కలుగగా భీతి కలుగును. ఇది ఇంద్రియ జయము ఎంత కష్టసాధ్యమో అను విషయమును వ్యక్తపరచుచున్నది. అట్లే ఒకచో వారు, అకారణముగ నింద్రియ ప్రవృత్తి ఘటిల్లుటకు తాను విషయినైతినని నందమూర్నిలయునికి నివేదించుకొనిరి(11). జ్ఞానము యొక్క రూపములేని తనమును అనగా సర్వమును జ్ఞానరూపమే అను దానిని ఒకచో ప్రకటించిరి(12). ఇది అంతయు వారి ఆత్మజ్ఞానమును వెల్లడించుచున్నది. 'ఈ పేరుతో నున్న ఈ శరీరము నిది యొక వ్యక్తి ...'(17) అనెడి పద్యమున విశ్వనాథవారు ఉపనిషద్విషయమగు 'ఆత్మ-ప్రకృతి' అనుదాని జ్ఞానమును ప్రతిపాదించిరి. సుఖ

దుఃఖాదులు శరీరమునకేగాని ఆత్మకు కావు. ఆత్మ తన్ను తానెరుగుటకు దేహగతమైన సుఖదుఃఖాదులను త్యజించవలెను. అని ప్రకటించిన విశ్వనాథవారు, వానినుండి తమకు వైముఖ్యము ప్రసాదింపుమని కోరిరి.

విశ్వనాథవా రొక పద్యములో(34)మోహభ్రాంతి తొలగగనే ఆత్మజ్ఞానము కలుగు ననెడి ఉపనిషద్విషయమును సుబోధముగ వ్యాఖ్యానించిరి. మాయచే ఆవరింపబడిన జీవుడు తనను తాను తెలిసికొనలేడను తాత్త్విక విషయమును 'నా స్వామి! మనసులో మరచి పోవుచున్నానయ్య ...'(37) అను పద్యమున ప్రకటించిరి. మాయా వలయమగు నీ ప్రపంచమున బడిన జీవుడు ఇంద్రియలోలుడై ఆత్మా నాత్మ వివేకము తెలిసికొనలేడు. ఆత్మ కీ దేహాదులను తొడుగుట పరబ్రహ్మము యొక్క క్రియయే. జీవునికి దేహ భ్రాంతి పోవలెనన్న, భగవంతుని కృప యుండవలెను. దానికి మనస్సులో భగవద్ధ్యాన మావశ్యకము. విషయవాంఛ లాధ్యానమును కొనసాగనీయవు. జీవుడు దీనిని దాట వలెను. ఇదంతయు భక్తుని వ్యాపారము. విశ్వనాథవా రిట్టి తాత్త్విక విషయము లాధారముగా గొని తమ భక్తిని, జ్ఞానమును పలు పద్యములలో ప్రకటించిరి.

## అకుంఠిత భక్తి

విశ్వనాథవారొకచో, శ్రీకృష్ణుని ముగ్ధమోహ నాకారమును వర్ణించి తమ మధుర భక్తిని వెల్లడిచేసిరి. అకుంఠితమైన భక్తిభావముతో జన్మగతమైన దుఃఖములను, విషయాసక్తిని కాళీయదమనునికి నివేదించుకొని, కేవల కైవల్యమును కోరుకొనిరి. విశ్వనాథవారు భక్తితత్పరతతో భగవంతుని 'మనసులోఁ గట్టిన మూర్తిగా నీవు మన్నింతు వెపుడు ...'(8) అనెడి పద్యమున వేడుకొను విధము వారి స్నిగ్ధమును, మధుమునైన భావ ప్రకటనమునకు చక్కని నిదర్శనము. తమ మనో నేత్రములకు స్థిరముగా గోచరమగు నా వేణుగోపాలస్వామి బాహ్య చక్షువులకు మూర్తివలె కానరాడని విశ్వనాథవారు పేర్కొని, మనస్సునుండి కన్నులవరకు వ్యాపింపుమని ప్రార్థించిరి. ఇది భగవంతుని యెడల గల వారి ఆర్తిని తెలుపుచున్నది.

కవి ఒకచో శ్రీకృష్ణుని తన ఆత్మ నవధరింపుమని, 'శ్రీ శాతమైన నీ వేణు గానంబు రేకగా జ్ఞాన, కోశంబు లోపల వచ్చి చొరనీవె బాల! గోపాల' అని వేడికొనిరి(22). ఇది వారి పరిపూర్ణ భక్తితోపాటు వారి హృదయము నిండుగా భగవంతుని నింపుకొనవలెనెడి కోరికను కూడ వెల్లడిచేయుచున్నది. ఒక పద్యమున వారు సామాన్యుని వలె, దేహమునుండి ప్రాణములు చెప్పకనే పోవుచున్న వనియు, అవి ఎచ్చటకు వెళ్ళుచున్నవో తెలియ దనియు వాపోయిరి(25). కొన్ని చోట్ల ఒక జ్ఞాని

వారి కీ సృష్టి యంతయు ఎప్పటి కప్పటికే ఆనందముగా గోచరించును. దాని తత్త్వ మాలోచించినప్పుడు వారి కిది యంతయు వ్యర్థ పదార్థమని తోచును. పరబ్రహ్మము మాయా ప్రభావముచే నీ సృష్టి గావించును. ఇదంతయు మాయా స్వరూపము. కల్పాంతమున నీ మాయా ప్రపంచ మంతయు బ్రహ్మమున లీనమగును. కావున కనిపించు సృష్టియంతయు వట్టి పిప్పియే. ఇట్టి తాత్త్విక విషయమును విశ్వనాథవారు అనుభవ పూర్వకముగ నొకపద్యమున చెప్పిరి(86). ఇదంతయు నుపనిషద్విషయమే.

## ధ్యానము

'ఒగి నాశరీరమ్ము కట్టై వలె పోవుచున్నది గాని ...'(18) అనెడి పద్యమున వారు నిరంతరము భగవంతుని కొలుచుకొనెడి భాగ్యము ప్రసాదింపుమనీ ప్రార్థించిరి. ఉపాధి గతమైన దోషముల కంటె మనస్సు నందలి భావమునకు విలువ నిచ్చి తమకు భగవద్ధ్యాన సదా కొనసాగునట్లు, విషయానురక్తి కలుగకుండునట్లు అనుగ్రహింపుమని వేణుగోపాలుని వేడికొనిరి. ఇదే భావముతో వారు మరొక పద్యమున దేహచర్యల కంటె మనశ్చర్యలు భిన్నములని పేర్కొనిరి(19).

## ఆత్మనివేదనము

ఈ బ్రతుకులో ఆనందమున్నదో లేదో తెలియదు కాని అలవాటు కొలది బ్రతుకు చుంటి ననియు గుండెలో దైవము మసలుట అన్నదే తృప్తి అనియు విశ్వనాథవారా నందమూర్తిలయునకు విన్నవించుకొనిరి(46). వారు భగవంతుని గురించి ఆలోచించుచుండగా నవనీతము వంటి యిట్టి ఊహ లెన్నియో వచ్చుచున్నవనియు, ఇది పూర్వజన్మ వాసనచే కలుగుచున్నదెమో ననియు ననిరి(65). విశ్వనాథవా రొకచో 'హరి హరాఖ్యంబు వెలుఁగు సార' మని వ్రాసి పరబ్రహ్మతత్త్వము నొక్క వాక్యములో సమగ్రముగా తెలిపిరి(66). వారు పరబ్రహ్మను గూర్చి తెలిపెడు వేదాది గ్రంథములను చదివితి ననియు, పరబ్రహ్మము నర్థము చేసికొంటిననియు, దాని నితరులకు చెప్పవలసి యున్నదనియు, కాని ఆ అనుభూతి మాత్రము లేదనియు వివరించిరి(72).

## మోక్షాసక్తి

మరుజన్మ వలదను భావమును 'ఈ మేను కలిగి నన్నాళ్ళు తప్పద యీ పాడు సంత ...'(53) అను పద్యమున వెల్లడించిరి. ఆత్మ కీ దేహ మున్నన్ని నాళ్ళు ఈ ప్రాపంచిక విషయ సంబంధము తప్పదు. ఈ ఆత్మ మరొక జన్మలో మరొక దేహముతో

జనించినను తప్పదు. కావున మరువకుండగ తమకు మరుజన్మ మీయ వలదని కవి సంతాన వేణుగోపాలుని స్తుతించిరి.

## వ్యాజస్తుతి

ఈ శతకములో నచ్చటచ్చట కొన్ని పద్యములు అధిక్షేపాత్మకమైనవి కూడ కలవు. 'సంపూర్ణముగ నీ యనుగ్రహము నాకు సమకూడుటున్నె ...'(44) అను పద్యమున సంపూర్ణమైన భగవదనుగ్రహము కలుగవలెనని వారు భగవంతుని పరిపరి విధముల స్మరింతురు. దైవము కానరాక పోవుటను వారు అధిక ప్రార్థనము వెక్కసమై యుండుటయే కారణ మనియు అందుచేత తమ విన్నపములు తంపట వేసినట్లుగా నైన వనియు చెప్పిరి. ఇక్కడ లోకములోని విషయము నాధారముగా జేసికొని వేణు గోపాలుని నిందా వ్యాజమున స్తుతించిరి.

## లోకవృత్తము

'తరి బావి లోఁ తుగాఁ ద్రవ్వి జల పడ్డ తరువాత నొడ్డు విరిగి పడ్డట్టుగా ...'(28) అను పద్యము వారి లోక వృత్త పరిశీలనమునకు నిదర్శనము. బావి త్రవ్వినపుడు జల పడిన పిదప ఒడ్డు భాగము నుండి మట్టి పెళ్ళలు విరిగి పడుచుండును. అప్పుడా మట్టిని తొలగించుచు లోతుగ త్రవ్వుదురు. విశ్వనాథవారు లోకములో నున్న ఈ విషయమును సాదృశ్యముగా గ్రహించి, వారి భక్తిమయ హృదయమును చెప్పిరి. హృదయమును భక్తిచే త్రవ్వుకొని భగవంతుని ప్రతిష్ఠించుకొను నప్పుడు, ఒక వైపునుండి ఇంద్రియ ప్రవృత్తి యధికమై హృదయమును ముంచివేయుచుండును. భక్తుడు మరల హృదయమును త్రవ్వి భగవంతుని నిలుపవలెను. ఈ విధముగ విశ్వనాథవారీ పద్యమున సాధనలోని క్లిష్టతను లోకవ్యవహారము తో పోల్చి చెప్పుట హృదయంగమమై యున్నది.

## స్వీయవృత్తము

విశ్వనాథవారు 'వెలఁదిపై బిడ్డపై కోర్కి వలదు జీవికి నంచు ...'(32) అను పద్యమున స్వీయ కథనమును వెలువరించిరి. ఇందు కవి తన కుటుంబము లోని విషయము నాధారముగా దీసికొని పరబ్రహ్మము యొక్క నిర్గుణత్వమును, కాంతిమయత్వమును తెలిపిరి. ఇహలోక గతమైన బాంధవ్యములను అనగా భార్యా పుత్రుల యెడ మమకారమును కూడ త్యజింపవలె ననియు నప్పుడే ఆత్మజ్ఞాన మలవడుననియు ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. ఇది జ్ఞానమార్గము. విశ్వనాథవారు దీని నెరిగియు, వారి భార్యయు, బిడ్డయు పోయినప్పుడు మాత్రము దీనిని తెలిసికొన

లేకపోయిరి. మమకారమును త్రెంచుకొనలేకపోయిరి. నీవైనను తెలుపవలదాయని వేణుగోపాలుని ప్రశ్నించి, మరల నీ వేల తెలిపెదవు, నీవు శుద్ధ కాంతిస్వరూపము కదా యని పరబ్రహ్మతత్త్వమును తెలిసికొని సమాధాన పరచుకొనిరి. ఇందు వారు బంధములను త్రెంచుకొనుటలోని మానవుల దుర్బలత్వమును, అట్లే పరబ్రహ్మ స్వరూపమును వెల్లడించిరి. 'సామాన్యముగ నేఁల బ్రయాణముంజేయు సమయంబు నందు ...'(88)అను పద్యమున వారు నడచునపు డెక్కువగా కవిత్వము జెప్పుదు రనెడి విషయము తెలుపబడినది. అందుచే వారు తమ తుది యాత్రను భగవంతునిపై కవిత్వము పాడుచు సాగనీయుమని వేడుకొనిరి. దీనివలన వారు జీవిత పర్యంతము కవిత్వమును వ్రాయవలె ననియు, అదియు భగవత్పరమైన దనియు కోరుకొనినట్లు తెలియుచున్నది. వారు శ్రీ కృష్ణుని, తమ వద్దకు వచ్చి నిలువుమని ప్రార్థించి, తమకు తామే వేణుగోపాలున కర్పించుకొనుట నిట్లు ప్రకటించిరి.

> వచ్చిన నష్ట మేమయ్యా నీకు గోపాలయ్యా నాదు
> పుచ్చిన యూరుపు లగురు ధూపంబు పొందమ్మి వోలె
> విచ్చిన యెదఁద నైవేద్య మర్ఘ్యమ్ము వెలలు బాష్పములు
> వెచ్చనై నందమూర్తిలయ! సంతాన వేణుగోపాల! (100)

ఇందు తమ సర్వస్వము భగవంతుని సేవకై మీదుకట్టినట్లును, శరీరమును సర్వము భగవంతుని పూజకై వినియోగించు వస్తువుగా భావించి నట్లును తెలియుచున్నది. అనగా వారి శరీరము నందణు వణువునను భక్తిభావమే నిండినది. విశ్వనాథవారు మహాకవియైన భక్తాగ్రగణ్యులు. కావున నిట్లు ప్రకటించుకొనజాలిరి.

ఈ విధముగ విశ్వనాథవారీ శతకమున ఉపనిష ద్వివరణ ప్రాయముగా నద్వైత తత్త్వమును భక్తిని హృదయంగమముగ వర్ణించిరి.



# 15. నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి!

ఇది విశ్వనాథవారి మధ్యాక్కరల లోని శివపరమైన శతకములలో నొకటి. 'నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జ హేళి!' అను నీ శతక మకుటము, తొలి రెండింద్రగణములు లోపించిన మధ్యాక్కర పాద మగుచున్నది. అనగా క్రమముగా నొక సూర్య గణము రెండింద్ర గణములు మరల ఒక సూర్యగణముతో నీ మకుట మేర్పడుచున్నది. 'సిద్ధాబ్జ' లోని 'సి' ఐదవ గణాద్యక్షరమై యతి స్థాన మగుచున్నది.

దీని యందు కూడ విశ్వనాథవారు అద్వైత తత్త్వమును, నిరుపమాన మైన భక్తి భావమును ననేక విధముల వర్ణించిరి. ఇందలి భక్తియు తత్త్వమును, ముందరి శతకములలోని విషయములే. అయినను తత్ప్రకటనములో వైవిధ్యము గోచరించును. ఇందు భక్తి కధిక ప్రాధాన్య మీయబడినది. మానవుల ప్రాపంచిక విషయములను జయింపలేని ఇంద్రియ ప్రవృత్తిని వర్ణించి ఆత్మతత్త్వము నెరుగుటలోని కష్టమును వివరించిరి, పరమేశ్వరుడు కరుణ స్వరూపుడని చెప్పి యా దైవముచే వచ్చి బిడ్డలైన మానవుల నుద్ధరింపుమని వేడుకొనిరి. వ్యవహార వాక్య శైలిలో అద్వైత విషయము లెన్నియో నీ శతకమున పద్య రూపము దాల్చినవి. లోకోక్తి ప్రయోగ మిందు పరిమితముగా నున్నది. ఇతర శతకములవలె నిందును కవి దైవముతో సంభాషించు నట్లుగ పలు విషయములు ప్రతిపాదింపబడినవి.

**పరబ్రహ్మతత్త్వము**

బ్రహ్మము నిత్యము, సృష్టి యనిత్యము అని ఉపపత్తి పూర్వకముగా 'ఒక మంచి జరుగును దాని వెంబడి నొక చెడ్డ జరుగు...'(6) అనెడి పద్యమున వివరింపబడినది. సృష్టి మాయా స్వరూప మగుటచే, దానియం దొకటి మంచి యైన, మరొకటి చెడ్డ యగును. సమానత్వ ముండక హెచ్చు తగ్గు లుండును. సమగ్రత్వముతో నెల్ల వేళల సమముగా నుండువాడు పరమేశ్వరుడు. అనగా పరబ్రహ్మము. అది సద్రూపము, అఖండ తేజోమయము. కావున నా దైవ మొక్కటియే సమమైనది. కడమ సృష్టి యంతయు అసద్రూపము. విషమము. ఈ విధముగా నుపనిషత్తులలో చెప్పబడిన బ్రహ్మము-మాయ అను వాని కీ పద్యము వివరణ ప్రాయము.

**ఆత్మతత్త్వము**

విశ్వనాథవా రొక పద్యమున ఆత్మ యొక్క రాకపోక లగు పుట్టుకచావులు నిరర్థకములని చెప్పిరి. బట్టలు నేయునప్పుడు మగ్గములో ఆసు లోపల కండె అటు నిటు తిరుగు చుండును. అట్లే పుట్టుకచావు లుండియు ప్రయోజనము మాత్ర మేమియు లేకపోవుచున్నది. దీనిని కవి తమయం దారోపించుకొని, కండె వలె తిరిగియు నేసిన బట్ట యేమి లేదనియు, ఈ నాటికి కొంత భక్తిభావన యనెడి నేత సాగుచున్న దనియు నెకరుకల్లువాసి యగు విశ్వేశ్వరునికి విన్నవించిరి(7). దీనియందు వారి భక్తితోపాటు లోక పరిశీలనము కూడ వ్యక్తమగుచున్నది.

ఈ క్రింది పద్యమున భగవంతుని యొక్క విశ్వవ్యాపకత్వమును గూర్చియు ఆత్మ స్వరూపమును గూర్చియు కవి పరమోదాత్తముగ వర్ణించిరి.

పదునాల్గు భువనముల్ నీవు కుక్షిలోపలఁ బెట్టుకొంటి
విది యెంతవాఁడవో నీవు, నిన్ను నా యెడఁద నిముడ్తు
నది యెంతవాడనో నేను, నద్ది నాకనుభూతి తెమ్ము
చిదతీత సంస్థితీ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జ హేళి! (68)

విశ్వ చైతన్యమే బ్రహ్మము. బ్రహ్మమే ఆత్మ. ఆత్మ హృదయమునం దుండును. ఈ ఉపనిషత్సత్యమును పై పద్యమున కవి వ్యాఖ్యానించిరి. విశ్వ మంతయు బ్రహ్మమయమను విషయము భగవద్గీత శ్రీమద్భాగవతము మొదలగు గ్రంథములలో బ్రహ్మము యొక్క కుక్షిలో పదునాల్గు లోకము లుండునట్లుగా వర్ణింపబడినది. ఆ బ్రహ్మమే పరమేశ్వర వాచకముతో పిలువబడుటచేతను, అట్టి బ్రహ్మమే ఆత్మ యనబడి మానవుల హృదయములం దుండుట చేతను, మానవునియందు మహనీయత ఆపాదింపబడుచున్నది. విశ్వనాథవారీ అంశము నిచ్చట వివరించిరి. అట్టి మహనీ యానుభూతిని తనకు కలుగ జేయవలసినదిగా ఆ పరమేశ్వరుని ప్రార్థించిరి. ఇది వారి అద్వైత పాండిత్యముతోపాటు వారి ఆత్మ జ్ఞానాభిలాషను, విశ్వాత్మ భావమును కూడ వెల్లడిచేయుచున్నది.

**ఆత్మానాత్మ వివేకము**

విశ్వనాథవా రొకచో ప్రకృతి పురుషుల తత్త్వమును వర్ణించిరి. పరబ్రహ్మము నందే మాయకూడ నుండుటచే ఆత్మయందీ రెండు యంశము లుండునని చెప్పిరి(84). పరబ్రహ్మకును ఆత్మకును భేదము తలచువారికి భ్రుకుటియం దా పరబ్రహ్మము కాన రాదనియు, ఆ భావము కలుగుటకు కూడ భగవంతుడే

కారణమనియు చెప్పి తాను మాత్రము శ్రీకంఠుని కొలుతునని వ్రాసిరి(85). విశ్వనాథవారి నిరుపమానమైన దైవభక్తికిని వారికి కలిగిన భగవత్సాక్షాత్కారానుభూతికిని 'నమఁ బైకి గొంచు రావలయు నంచు నున్నది నీకు ....'(86) అనెడి పద్యము నిదర్శనము. పరమేశ్వరు డపార కరుణామయు డనియు భక్తజన పాలకు డనియు నిందు వర్ణింపబడినది. భగవంతుని దర్శించుటకు ఆత్మ నవలోకించవలె ననియు, దయా స్వరూపు డైన దైవము భక్తుని వెన్నానుకొనుచు నుండి, సెనగ బద్దంత జ్యోతి రూపమున బొమముడి యందు నిల్చు ననియు నిందు చెప్పబడినది. కవి దీని నంతను తనకు కలిగిన అనుభూతిగా వివరించిరి. తరువాత పద్యమున అట్లనుభూత మగు ఆ వెలుగు, పట్టరానంత ఆనందము కలిగించు ననియు బాధతో నున్న శరీరము గుర్తురా దనియు చెప్పి, ఆ శరీరమును కూడ తొలగించి శాశ్వతానందము ప్రసాదింపుమని వేడికొనిరి(87).

విశ్వనాథవారు 'పొగడుచు నుందురు మిత్రు లొక్కవైపున నుండి ...'(90) అనెడి పద్యమున మానవునకు కలుగు మేలుగీళ్ళు భగవన్నిర్ణయములే నని వివరించిరి. వారొకచో ప్రపంచ మంతయు నశ్వరమని తెలిసియు నందు మునుగుట తప్పుట లేదనియు, దాని వలన తమ కప్పుడప్పుడు కలుగు జ్ఞాన సూర్యోదయము మరుగుపడి పోవుచున్న దనియు, తమ కా దుస్థితి పట్టకుండగ కావు మనియు నెకరుకల్ విశ్వేశ్వరుని వేడికొనిరి. లౌకిక స్థితిని గుర్తించియు మోక్షమును కాంక్షించెడి యొక మహాభక్తుని వేదన యిది. విశ్వనాథవా రిట్టి మహాభక్తు లని ప్రతి పద్యము నుడువుచున్నది. 'భ్రూయుగంబునకును నడుమగా నిన్నుఁ బ్రోవు చేయుంగఁ ...'(34) అనెడి పద్యమున వారు భ్రూమధ్యమున ఆత్మను నిలుపుకొనిన విధమును తెలిపిరి. పూర్వము కొన్ని పద్యములలో నిట్లు భ్రూమధ్యము నందు నిలుపుకొనెడి జ్యోతిని వర్ణించిరి(పుట: 52,53,64). ఇచ్చట అది చెదరి పోయెడి స్థితియు, దానిని స్థిర మెనర్చుటకు వారు చేయు ప్రయత్నమును సూచించిరి. తరువాత వారా దైవమునే మానవులను సరిదిద్ది మోక్షము ప్రసాదింపుమని 'బిడ్డను సరిదిద్ది మంచి త్రోవను బెట్టుకోవలయు...'(95) అనెడి పద్యము ద్వారా వేడిరి.

## ఇంద్రియ నిగ్రహము

'మన్నిత్య భావనాధార! నేను కుమ్మరి పుర్వువోలె, నున్నాను తాఁబేలు వోలెఁ జేత గాకున్నది యున్కి ...'(45) అనెడి పద్యమున విశ్వనాథవారు ఇంద్రియ నిగ్రహ మెంత కష్టమో వివరించుచున్నారు. ఇంద్రియములను ప్రవృత్తి మార్గము నుండి వెనుకకు మళ్ళించవలెను. అనగా నింద్రియము లన్నియు ఆత్మోన్ముఖములు కావలయును. అప్పు డాత్మ సాక్షాత్కారము సుగమ మగును. తాబే లెట్లు అవయవములను లోపలకు

సంగ్రహించుకొనునో, అట్లే మనోజయము కోరు వారు ఇంద్రియములను నివృత్తి మార్గమునకు త్రిప్పవలెను. కుమ్మరి పురుగు అవయవములు వెలుపలకే యుండును గాని, లోపలకు సంకోచించుకోవు. ఇది ఇంద్రియ ప్రవృత్తికి చిహ్నము. ఇది వేదాంత పరిభాష. దీని ఆధారముచే విశ్వనాథవారు తనకు తాబేలు వలె నుండుట చేతకాకున్న దనియు, కుమ్మరి పురుగువలె నున్నా ననియు నివేదించుకొనిరి.

## వైరాగ్యభావన

విశ్వనాథవారు దైవముతో నెలతలు, ధనము, రోగములేమి, అధికారత మొదలగువానిని శాశ్వతములని తలవక వానికై వాంఛించుట లేదనియు, ఆ భగవంతునే గాఢముగా కోరుచున్నా ననియు ఒక పద్యమున(12) నివేదించిరి. అట్లే వారు అనంతమైన కాలమును చూచినచో భీతి కల్గుచున్న దనియు, అంతు చిక్కని జనన మరణములులేక తమకీ జన్మతోనే మోక్షమును ప్రసాదింపు మనియు ప్రార్థించిరి(13). లోకములోని చిన్నెలు చూచినచో వారికి 'మేనునఁ దేళ్ళు ప్రాకుచున్న ట్లుండు నని' విరక్తి భావమును ప్రకటించిరి(14). ఇది వారి విషయ నిరాసక్తతను, కేవల మోక్షాసక్తిని తెలుపుచున్నది. 'అంతయును నశించి పోవునని రూఢియైనట్టి ...'(15) అనెడి పద్యమున సృష్టి యంతయు నశించునని తెలిసి దాని వింతలు చూచి ఆనందించెడి శక్తి తనకు లేదని చెప్పిరి. బ్రతుకుట తప్పనిసరి యగుచున్న దని, తమ కది శివుడు కంఠమున గరళము నుంచుకొనుట వంటి దని వైముఖ్యమును ప్రకటించిరి. సకలేంద్రియముల ప్రవృత్తిని నిరసించి హృదయమున పరమేశ్వరుని నిలుపుకొనుట వైరాగ్య మనిపించుకొనును. దీనినే 'నినుఁ బండించు వ్యవసాయ' మనుట. అది ఉన్నచో బ్రతుకు సుఖతరము కాగలదు, లేనిచో దుర్భరము అను విషయము 'వైరాగ్య భావంబు కలిగి బ్రదికిన బ్రదుకు ...'(29) అనెడి పద్యమున ప్రకటించిరి.

## ధ్యానము

ఒకచో వారు, పనుల యొత్తడిచే దినముల తరబడి భగవద్ధ్యానమును చేయుటకు వీలుపడనిచో, మనస్సు నందు ధ్యానము చేయలేకపోవుచున్నా ననెడి దిగులుండు నని విచారము వెలిపుచ్చిరి(63). ఆ భావమును వారు 'మహిత వస్త్రమున చినుగు పట్టిన యు' ట్లుపమించి చెప్పిరి. ఇచ్చట నిరంతర ధ్యానము చేయువారి యెడద మహిత వస్త్రము వంటిది. ధ్యానము చేయుట కవకాశము చిక్కక పోవుట, ఆ వస్త్రమునకు పట్టిన చినుగు వంటిది. ఇది వారి భక్తిని ప్రకటించుటలోని భావనా రామణీయకము. ఈ శతకమునం దధిక పద్యములలో వారు ధ్యాన విశిష్టతను గురించియు, అహంకార నిర్మూలనము గురించియు ఇంద్రియ జయమును గురించియు అనేకవిధములుగా రచించిరి.

## జ్ఞానభక్తి

'ఇది నాది యని కూడఁ గాదు నాస్వామి యిది నేన యనుట ...'(34) అను పద్యమునం దహంకారమును గూర్చి వివరించిరి. నేననెడి భావమే మాయకు పునాది. దానిని తొలగించిన నాడు మాయ తొలగి జ్ఞానము కలుగును. కవి యిందు నేననెడి యహంకార సౌధమును కూలద్రోసి మాయను నాశనము చేయుదునని చెప్పిరి. ఇట్లే వారు మరొక పద్యమున(36) విషయ వాంఛలను కూడ జయించునట్లనుగ్రహింపుమని ప్రార్థించిరి. ఈ పద్యములలో జ్ఞానహేతువగు మనోజయమును వివరించిరి. 'అరయ స్వప్న కథాళి చూడఁ గోపమే యధిక మన్పించు ...'(38) అనెడి పద్యమున వారు కామక్రోధములను జయించెడి శక్తిని ప్రసాదింపు మనియు, అసంఖ్యాకమైన నుతులు చేయుదు ననియు భగవంతుని ప్రార్థించిరి.

తరువాత నొక పద్యమున భగవ దనుభూతిని గూర్చి సగము పచ్చి సగము దోరగా నున్నట్లు వర్ణించి, సంతోష సమయమున కూడ ఉల్లము నందు భగవంతు డుండు ననిరి. సాధారణముగ మానవులు కష్టమునందే భగవంతుని నుతింతురు. కాని విశ్వనాథవారు భోగవేళల కూడ భగవంతుని మరువని భక్త శిఖామణి; స్థిర చిత్తులు(40). నేననెడి అహంకారము లేనిచో పాపములు చేయునది లేదనియు, కావున నేననెడి భావమును నానుండి తొలగింపు మనియు, అప్పుడు నీవును నేనును ఒక చేనిలో పంట వలె నుందు మనియు నెకరుకల్ దైవమును వేడిరి(43). అహంకారము తొలగినచో ఆత్మజ్ఞానము కలుగును. దానివలన పరమాత్మానుభూతి కలుగును. ఆత్మయే బ్రహ్మము. కావున దీనినే కవి 'నీవును నేను నదొక్క చేనిలో పంట' యని నిరుపమానముగ చెప్పిరి.

## ఆత్మ నివేదనము

విశ్వనాథవా రొకచో ధ్యాన సమయమున భార్యా బిడ్డలను గూర్చిన ఊహలే పొడముచున్న వని, అనగా ఇంద్రియ జయము లభింప కున్న దని చెప్పి, సర్వ వేళల యందును నిశ్చల భావముతో భగవంతునే తలచున ట్లనుగ్రహింపు మని దైవమును వేడికొనిరి (49). తాను భగవంతుని స్వరూపమును చూడలే దనియు, శాస్త్రములు చెప్పిన రీతి నాశ్రయించితి ననియు భగవంతునికి నివేదించి తన ననుగ్రహింపు మని ప్రార్థించిరి (51). కవిత్వమునకును తనకును అవినాభావ సంబంధము పెరిగిన కారణముచే దైవచింతనకు తాను దూరమైతినని చింతించిరి(54). ఉత్తమ మానవుని గూర్చి విశ్వనాథవారు 'మనిసి తోడి యహంక్రియానుగతి కాక మనుజులం దెవడు ...'(55) అనెడి పద్యమున వివరించిరి. ఎవడు ఇంద్రియాతీతుడై

ఆత్మ విద్యను తెలియ గోరునో వాడొక్కడే నరుడనియు, అధికులు అహంకార దుష్టులనియు చెప్పి కవి తాను కూడ నట్టి అహంకార స్వభావుడనే నని నివేదించిరి. అహంకార స్వభావమును విడనాడవలె ననెడి తమ దీక్ష నిందు ప్రకటించిరి. ఒక పద్యమున(27)వారు భగవంతునితో తమ శరీరము ద్వారా చెడు పనులు చేయకుండునట్లు కావుమని వేడికొనిరి.

## స్వీయవృత్తము

విశ్వనాథవారు 'నాకీ జగతి నధికారములనఁ దృణప్రాయములగుఁ, గాక...'(62) అనెడి పద్యమున తమస్వీయ గాథను ప్రకటించుకొనిరి. పదవు లనిన వారికి తృణప్రాయ మను భావమును, వారి బిడ్డల కేమైనను సంపద లిచ్చుటకు మిగలదేమో నను భయమును ఇందు తెలిపిరి. తరువాత భగవత్కృప చేత వారి మనస్సు భగవంతుని పైననే లగ్నమై యున్నదని ప్రకటించిరి. అనగా వారికి సదా భగవంతుని పైననే భావముండుటచే తనకు కావలసిన వన్నియు భగవంతుడే తీర్చు ననెడి విశ్వాసము వ్యక్తము చేసిరి. ఆ నమ్మకముతోనే వారు నెకరుకల్ విశ్వేశ్వరుని 'దయచూడు' మని ప్రార్థించిరి.

## లోకపరిశీలనము

ఒక పద్యమున(30)కవి అనిత్య వస్తువులను గూర్చి నిత్యములుగ భావింతు రనియు, అది అనిత్యమని మనసునం దైనను తలపక, మనసును వంచించుకొను చుందు రనియు, తత్త్వము నెరుగనివారిని గూర్చి చెప్పిరి.

## లోకోక్తి

లోక విషయములందు నిమగ్నమైన గాని మానవులకు బ్రతుకు వెళ్ళదు. లోక విషయములందు నిమగ్నమై యున్నచో భగవద్ధ్యానమున కాటంకము కలుగును. కాని మానవులకీ రెండును కావలయును. దీనిని 'అవ్వ కావలయు, బువ్వ కావలయు' ననెడి లోకోక్తిచే కవి సమర్థించిరి. ఈలాగున మానవులీ రెంటిని సమముగా కలిగియుండుట కష్ట మనెడి భావ మొక పద్యమున (71) చెప్పిరి.

ఈ విధముగ విశ్వనాథవా రీ శతకమున నెకరుకల్లు విశ్వనాథునికి తమ భక్తిని వివరించి ఆత్మయందు స్థిరముగ నిలువు మని ప్రార్థించిరి.

# 16. మున్నంగి వేణుగోపాల!

'విశ్వనాథ మధ్యాక్కఱలు' అను శతక సంకలనములోని తొమ్మిదవ దీ మున్నంగి శతకము. మధ్యాక్కఱ శతకములలో విశ్వనాథవారు మొదట వ్రాసిన దీ శతకమే. 'తెనాలికి సమీపమున నున్న మున్నంగి గ్రామము నందలి పెద్దలు తమ గ్రామమందలి వేణుగోపాలస్వామివారిపై మున్నంగి వేణుగోపాల అను మకుటముతో నొక శతకము వ్రాసి పెట్టుమని విశ్వనాథవారిని వేడుకొని యుండిరి. ఆ మకుట మొక్క మధ్యాక్కఱలో తప్ప నితర వృత్తములలో కుదురదు' (వేంకటావధాని 1983:85). ఆ విధముగా వారా దైవముపై మధ్యాక్కఱలలో నొక శతకము రచించి పిదప వారి స్వగ్రామ మైన నందమూరు లోని దైవముల పైనను అనంతరము శ్రీశైలము, శ్రీకాళహస్తి, భద్రాద్రి మున్నగు క్షేత్రములలోని దైవములపైనను క్రమముగ మధ్యాక్కఱలలోనే శతకములను వ్రాసినట్లు తెలియుచున్నది. కాగా నీ మున్నంగి శతకమునే విశ్వనాథవారి మధ్యాక్కఱ శతకములు వెలువడుటకు నాంది యని చెప్పవచ్చును. ఇది ఆ గ్రంథమునందలి విష్ణు పరమైన శతకములలో చివరిది. ఈ శతక మకుటము మధ్యాక్కఱ పాదములోని ఉత్తరార్ధ మగుచున్నది. 'వేణుగోపాల'లోని 'వే' యతి స్థానమై పదచ్ఛేద విరామమును కూడ కలిగియున్నది.

పోతన భాగవతములోని భక్తి భావముతో పోటీపడునట్టియు పాఠకులను భక్తి భావాంబుధిలో నోలలాడించ గలిగినట్టియు పద్యరత్నము లిందు గలవు. ఇందలి మధ్యాక్కఱ పద్య రచనా విన్యాసము సౌందర్యపు టంచులు ముట్టినది. భావము నందే కాక పదప్రయోగము నందు కూడ నిది విష్ణు సహస్ర నామమువంటి యొక ఉదాత్త స్తోత్ర కావ్యము వలె నున్నది. శ్రీకృష్ణుని మేల్కొలుపు స్తోత్రములు సగుణ రూపమును వర్ణించిన ట్లున్నను, వ్యంగ్య మర్యాదలో నవి ఆత్మ చైతన్య ప్రబోధకములు.

## పరబ్రహ్మతత్త్వము

ఇందనేక పద్యములలో వారు శ్రీకృష్ణుని వేణు గాన రవమును, మోహనాకారమును పలు విధములుగా చిత్రించిరి. జీవ బ్రహ్మల సంబంధమును పరబ్రహ్మ స్వరూపమును వర్ణించిరి. పరబ్రహ్మ రూప మగు అఖండ జ్యోతిని ధ్యానించి దాని తత్త్వమును తెలిసికొనలే మని ప్రకటించిరి.

వేణు గోపాలుని యందు పరబ్రహ్మతత్త్వము నారోపించి పలు పద్యములను రచించిరి. ఒక పద్యములో శ్రీకృష్ణుడు నిద్రించు వేళ ఆయందము వర్ణనా తీతమని చెప్పుచు 'నీ యంద మంతయు నంద సుత నీవు నిద్రించు వేళ, మాయురే యెంత వర్ణించి తృప్తి యన్మాట కనబడదు ...'(66) అని వర్ణించిరి. ఇందు బ్రహ్మము అఖండమైన శాంతి స్వరూప మనెడి సృష్ట్యాది స్థితి సూచితము. ఇందే 'నీ వొక వేళ నిదుర మేల్కొందువో యన్న భయము' అనుటలో, పరబ్రహ్మము యొక్క ప్రళయకాల స్వరూపము ధ్వనితము. ఇదంతయు పరబ్రహ్మ తత్త్వ నిరూపకమై, దానిని మనోహరముగా వర్ణించెడి కవి కల్పనాశక్తిని వెల్లడి చేయుచున్నది.

శ్రీకృష్ణుని సాకార రూపమును వర్ణించుచు మేల్కొను మని చేసిన స్తుతులు, ధ్వని గంభీరములై యొప్పుచున్నవి. వానియందున్న ధ్వని ఆత్మ స్వరూపుడైన పరబ్రహ్మమును మేల్కొలుపు రూపమున చేయు స్తుతి. అనగా నంతశ్చైతన్యమును జాగృతము చేయుట. దానికీ క్రింది పద్య మొక ఉదాహరణము.

అర నిద్ర పావు నిద్రలుగ మేలుకో కయ్య నా స్వామి
తెఱచిన కనులుగా మత్తు వదలిన దేహంబు గాగ
వదలిన జాగ్రత్త పడగ విప్పిన పాముగా నెల్ల
వెఱవఱి మేలుకోవయ్య మున్నంగి వేణుగోపాల! (85)

ఆత్మ జ్ఞానము సంపూర్ణముగా కలుగవలెను. జ్ఞాన నేత్రము తెఱువబడవలెను. జాగృతము చేయబడిన కుండలినీ శక్తి శరీరము నందలి మూలాధారము నుండి బ్రహ్మ రంధ్ర పర్యంతము ప్రసరింపవలెను. ఆ విధముగా ఆత్మ స్వరూపు డైన పరబ్రహ్మము నిద్ర మేల్కొనవలయు నని యిందలి సూచన. జాగృతము కాబడిన కుండలినీ శక్తిని బడుగ విప్పిన పాము వలె చెప్పుటయే తనను నిద్రనుండి మేల్కొన జేయుట. అప్పటి దేహ స్థితియే మత్తు వదలిన దేహ మనుట. ఆ విధముగ విశ్వనాథవారు కొన్ని పద్యములలో పరబ్రహ్మ తత్త్వమును ధ్వని రూపమున నుంచిరి.

**ఆత్మజ్ఞానము**

ఒక పద్యమున(27)వారు పరమేశ్వరుడు పరిశుద్ధ తత్త్వ మనియు, ఆ దైవమునకు సంపద లున్నప్పుడు పొంగుట, లేనప్పుడు కుములుట లేవనియు, ఇదియే దైవమునకు మానవులకు భేద మనియు వివరించిరి. మానవులు కలిమిలేములను భిన్నముగా చూతు

రనియు, అది పోయిన నాడు ఆత్మ జ్ఞానము కలిగి మోక్షము లభింప గలదనియు ఇందు ధ్వనిత మగుచున్నది.

**ఆత్మతత్త్వము**

విశ్వనాథవారు పరమేశ్వరుని యొక్క ప్రశాంతము గంభీరమునైన స్వరూపమును, వారా పరమేశ్వరుని మేల్కొను మని చేయు ప్రార్థనను, అదియు తన గుండెయం దనియు సుమా రొక పది పద్యములలో కడు హృద్యముగా వర్ణించిరి. ఈ క్రింది పద్యమున వారు వేణుగోపాలుని మేల్కొలుపుటలో పొందుపరచిన తాత్త్విక రహస్యము ఆశ్చర్యానందములు కల్గించుచున్నది.

వేని నిద్దుర పట్టరాని మోహమ్ము వెలయించు నింత
వాని మేల్కనుట ఘా మోహ విచ్ఛిత్తి పచరించు నంత
కాన మేల్కొన నీవు మేలుకొన నీవు కలకల మమ్ము
పీనమౌ మత్తులోఁ బెట్టి మున్నంగి వేణు గోపాల! (68)

మానవ హృదయము నందుండు ఆత్మయే పరమేశ్వరుడు. మానవుల కాత్మ జ్ఞానము కలుగ నంతవరకు వారు భ్రాంతికి లోనై మాయా ప్రపంచమున కొట్టుమిట్టాడు చుందురు. ఆత్మ జ్ఞానము కలిగినచో నా మోహము వీడిపోవును. నిరంతర ధ్యానము, ఇంద్రియ జయము వలన గాని, ఆత్మ తత్త్వము గోచరము కాదు. అనగా నాత్మ చైతన్యమును పొందు టంత సామాన్యమైనది కాదు. అంతవరకు బలమైన మోహము నందు మానవుడు మునిగియుండవలసినదే. ఈ తాత్త్విక సందేశ మీ పద్యమున సరళ సుందరముగా విశ్వనాథవారు వ్యాఖ్యానించిరి. ఎడదలో నుండు పరమేశ్వరుని జాగృతము చేయ నిశ్చయించుట వలన నిక మోహము పోవుననియు, అప్పుడు భ్రుకుటి యందు జ్యోతి రూపమున ద్యోతకమగు నా వెలుగు ఎట్టిదో కదా యనియు వేణుగోపాలునికి విన్నవించిరి(69).

మేలుకో నా స్వామి! నాదు గుండెలో మేలుకో కలిత
మాలా చలద్గాఢ దుఃఖ నిచయ సంహారణమ్ము గాఁ గ
కేళీ మనస్సమాకృష్ట మోహ నిచయ నికృంతనమ్ము గను
ధీ లతా మూలమ్ము తునుగ మున్నంగి వేణుగోపాల! (73)

గాఢమైన దుఃఖములు తొలగునట్లుగను, మోహము త్రుంపబడునట్లుగను, భయలతలు ఖండింపబడునట్లుగను ఆత్మ స్వరూపు డైన పరమేశ్వరుని తమ హృదయము నందు మేలుకొమ్మని విశ్వనాథవారు ప్రార్థించిరి. ఇది వారి పద్య రూపము దాల్చిన అద్వైతపరమైన స్తోత్రమున కుదాహరణము. ఈ పద్యములలో పరమేశ్వరుని మోహనాకారమును, మోహభ్రాంతి తొలగుటకై పరమేశ్వరునికి చేయు నుతులును వర్ణింపబడినవి.

**ఆత్మసాక్షాత్కారానుభవము**

ఈ క్రింది పద్యమున వారు తమకు భ్రుకుటి యందు సాక్షాత్కరించు దైవమును వర్ణించిరి.

కన్నులలో నీరు నిలచి గొంతులో గాద్గద్య మొప్పి
వెన్ను లోపలఁ బుల్కరించి ముద్భుజా వీధిలోఁ గదలి
కన్నుంబొమల మధ్య బర్వు దించిన కరణి భాసించి
వెన్నుడా నీవనుకొందు మున్నంగి వేణుగోపాల! (61)

కవి ఇందు భగవంతుని తోడి తాదాత్మ్య భావమును ప్రకటించిరి. బొమముడి యందు తేజోరూపమైన పరబ్రహ్మము గోచర మగునప్పటి అనుభవమును తెలియ జెప్పిరి. సాధకుడు యోగశక్తితో కుండలినీ శక్తిని జాగృతము చేసిన నాశక్తి మూలాధారమునుండి బ్రహ్మరంధ్రము పర్యంతము ప్రసరించును. ఆ సమయమున భ్రుకుటియందు తేజోరూపమై ఆత్మ వెలుగొందును. అప్పుడు కలుగునదియే బ్రహ్మానుభవము. అట్టి అనుభవ స్థితియందు డెబ్బది రెండు వేల నాడులును హృదయములోనికి ప్రసరించునని యోగశాస్త్రమునందు చెప్పబడినది. ఇట్టి స్థితియందలి తమ అనుభవము వలన కలిగిన సాత్త్విక భావాదులగు కనులలో నీరునిలుచుట, గొంతులో గాద్గద్య మొప్పుట, వెన్నులో పులకరించుట, భుజవీధిలో కదలిక, బొమల మధ్య బరువు దించిన కరణి భాసించుట అనువానిని క్రమముగా కవిపేర్కొనిరి. భక్తి రసానుభవములోని బ్రహ్మానందానుభూతి నిది చక్కగా వెల్లడి చేయుచున్నది.

**ఆత్మకథనము**

'మచ్చిక యది యెంత స్వామి! ...'(23), 'కచ్చె పూనకు మోయి నాదు పైన నీ కాలి లెంక ...'(24) అనెడి పద్యములలో వారు తమకు గల శివకేశవాభేద భక్తిని వెల్లడించిరి. ఆ అభేదరూపుడైన పరమేశ్వరుని యొక్క కరుణ కావలెనని విన్నవించిరి. వారు శివుని పైనెక్కువ మక్కువ కలవా రగుటచే వేణుగోపాలుడు కష్టపెహించు నేమోనని శంకించి, భగవంతున కట్టి భావ ముండ దనియు లేనిచో మధ్యాక్కరలు వ్రాయుటకు తమను పిలిపించుకో డనియు ప్రకటించిరి. ఆ విధముగా నా దైవము యొక్క దయామయత్వమును చాటిరి.

నీపైన మధ్యాక్కఱలను వ్రాయుచు నిద్రింప నేనుపా
స్వాపమ్ములోన నా స్వామి బంభర ధ్వానమ్ము వింటి;
శ్రీపతీ నీ వేణురావ సాంతత్య మృదు ధార వచ్చి
నీపున కంటుకుపోయె మున్నంగి నేణుగోపాల! (34)

ఈ పద్యమున విశ్వనాథవారు వేణుగోపాలుని పై మధ్యాక్కరలు వ్రాయుచు నిద్రింప నా దైవ శక్తి వచ్చి తమను చేరినట్లు చెప్పిరి. ఇది వారి సాంద్రమైన భక్తి భావమునకును, వారి కనుభూత మైన దైవ సాక్షాత్కారమునకును నిదర్శనము.

**అవతార వర్ణనము**

ఈ శతకము నందు విశ్వనాథవారు కడు చమత్కారముగను, అధిక్షేప పూర్వకముగను దశావతారములను వర్ణించిరి. 'పరలోకములు లేవు సంఘ మర్యాద పాటింపె కలదు ...'(92) అనెడి పద్యమున బలి చక్రవర్తి ఔన్నత్యము కొనియాడబడి వామనరూపు డైన విష్ణువు అధిక్షేపింపబడెను. భూలోకములో మానవసేవకు మించిన ధర్మము, అనగా దైవము లేదని చెప్పబడినది. ఒక పద్యమున(94)పది తలల రావణుడు, పది విధములుగ వెర్రి తలలు వేసిన యధర్మమునకు ప్రతీకయని ప్రతిపాదింపబడినది. రాక్షసులను దునిమి శాంతిని కాపాడె ననియు, మానవ ధర్మమునకు విలువ పెంచె ననియు రామావతారము యొక్క ఉదాత్తత ధ్వన్యాత్మకముగా చెప్పబడినది. ఇట్లే ఇతర అవతారములు ప్రౌఢముగను హృద్యముగను వర్ణింపబడినవి. '...దాగువు పారిజాతమ్ము, దారు వనీ కథ జ్ఞాపకంబున్నదా జగన్నాథ! ...'(102)అను పద్యమున

దారు శబ్దముతో కవి పారిజాత వృక్షమును, దారుకావనమును, జగన్నాథుని సూచించిన తీరు రమ్యతరమై చమత్కారము గొలుపుచున్నది.

## హరిహరరూపము

తలమీది నెమ్మి పించియము సురగంగ తరగల తనుకు
కలితమౌ పిల్లనగ్రోవి పేడిన ఖట్వాంగ శకలి
గళమందు రత్నహారములు ప్రోఁ కెడు గండు సర్పములు
విలసిల్ల మేలుకోవయ్య మున్నంగి వేణుగోపాల! (86)

ఈ మధ్యాక్కర పద్యము నందలి మూడు పాదములలో క్రమముగ పూర్వార్థము లందు కృష్ణుడు, ఉత్తరార్థములందు శివుడు వర్ణింపబడిరి. ఇది వారి హరిహరాభేద భక్తితో పాటు రచనా వైశారద్యమును కూడ సూచించుచున్నది.

## స్వప్నానుభూతి

ప్రకటమౌ నీ నిద్రలోన నొక సుఖ స్వప్నంబు వచ్చి
యొక కాళిదాసు కావ్యంబు వోలెనో యొక త్యాగరాజ
సుకృతి కృతిం బోలెనో తదా భ్రాంతి స్ఫురియించుచుండు
వికృతి వికృతి కానియట్లు మున్నంగి వేణుగోపాల! (82)

అవిద్యలో నుండి యున్నను, ధ్యానముతో నున్న తాము పొందు అనుభూతి ఒక కాళిదాసు కావ్యము వలెను, ఒక త్యాగరాజ కృతి వలెను ఉండునని వర్ణించిరి. 'వికృతి వికృతి కాని య' ట్లనగా ప్రకృతి యొక్క ఆభాస. స్వప్నమైనను అనుభూతి నిజమైన దనుట. విశ్వనాథవా రిచ్చట భక్తితోపాటు వారి కవితాత్మను కూడ వెల్లడించిరి. కావ్యము లందు కాళిదాసు కావ్యమును, సంగీత కృతులందు త్యాగరాజ కృతులును పరమానంద సంధాయకములని విజ్ఞులందురు. ఆ అంశ మిచ్చట ప్రస్తావించబడినది. తదుపరి స్వప్నము నందలి భగవదనుభూతి ఆనందదాయకము. కావ్యానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి. గానామృతముచే నప్పటి కప్పుడే బ్రహ్మానందము కలుగునని చెప్పుదురు. కావ్యమునను సంగీత కృతియునను కాళిదాస త్యాగరాజుల వారివి కాగా నాయానందముత్తమోత్తమ మైనది. విశ్వనాథవారికి స్వప్నానుభూతి యట్టి ఆనంద స్ఫురణ కలిగించి యది సత్యము వలె తోచినది.

### వ్యాజస్తుతి

'భామిను లిద్దఱు నీకుఁ జెటి యొక్క ప్రక్కన గలరు ...'(28) అనెడి పద్యముః శ్రీకృష్ణుని పరముగ పరమేశ్వరుని యొక్క నిర్గుణత్వము, గానమయత్వము, ఆనందమయత్వము అధిక్షేప పూర్వకముగా వర్ణింపబడినవి.

### విగ్రహారాధన

'మొదల మానవ శిల్పి నిన్ను రాతి రూపున సంతరింప...'(56) అను పద్యమున వారు విగ్రహారాధనను సమర్థించిన తీరు చమత్కార భరితము. నిర్గుణ బ్రహ్మమును సాకార రూపము నందు లోకులు అర్చించుటకు వీలుగా రాతి విగ్రహము లేర్పడినవి. అప్పుడా దైవమును హృదయమునందు నిలుపుకొనుట సులభము. ఇచ్చట కవి విగ్రహరూపము నెదలో నిలుపుకొనుటలో గల యౌచిత్యము నిట్లు సమర్థించిరి. 'పరబ్రహ్మము నిర్గుణమును, ఆద్యంత శూన్యమును, నామ రూపాది రహితమును. ఆ విధముగా నిది యని చెప్పలేని ఆ పరబ్రహ్మమును రాతి వలె చూపుటలో తప్పులేదు'. ఇందు విశ్వనాథవారు విగ్రహారాధనలోని ఔచిత్యముతోపాటు పరమేశ్వరుడు సర్వవ్యాపకుడను విషయమును కూడ చెప్పిరి.

### లోకవృత్తము

'నీరమ్ము చేత నల్లనిది కాళింది నీవామె వదలి...'(45) అనెడి పద్యమున వారు శ్రీకృష్ణుడు మున్నంగిలో వెలయుటకు గల హేతువును హృద్యముగా నూహించిరి. బృందావన వాసి యగు శ్రీకృష్ణుడు కాళిందీ విహారి. ఆ నదీ జల వర్ణము నలుపు. కృష్ణ శబ్దమునకు నలుపని యర్థము కలదు. కృష్ణా తీరమందలి మున్నంగిలో శ్రీ కృష్ణుడు వెలయుట కీ నలుపు రంగనెడి సామ్య ముండుట యని కవి సమర్థించిరి.

### 'విశ్వనాథ మధ్యాక్కఅల' అంకురార్పణము

ఈ శతకము నందలి తొలి పది పద్యములలో వేణుగోపాలుని స్తుతించిరి. తరువాత మున్నంగి గ్రామమును పూర్వము వినలేదనియు, ఆ వేణుగోపాలస్వామిని దర్శించలేదనియు పేర్కొని, ఆ దేవుని కెంతో దయ యుండుట వలన తమచే నీ శతకము వ్రాయించుకొనుచున్నా డని వ్రాసిరి (11). తమ యూరిలో కూడ వేణుగోపాలస్వామి ఆలయము కల దనియు ఆ విధముగ వేణుగోపాలు నెరుగుదు ననియు మున్నంగిస్వామికి నివేదించిరి(13). వారి అభిమాన దైవములుగా విశ్వేశ్వరుని,

వేణుగోపాలుని పేర్కొనిరి(14). వివిధ క్షేత్రములలోని దైవము లందరు నొక్కటియేయను భావమును నిట్లు చెప్పిరి.

తిరుపతి మంగళ సింహ భద్రాద్రి దేశంబులందు
మరియు నీ మున్నంగిలోన నచ్చట మాయూరఁ గాశి
సిరిగిరిలో ద్రాక్షతోటఁ గాళహస్తిపురి నెందైన
వెరవుగా మీరును మీరె మున్నంగి వేణుగోపాల! (15)

ఇందు భావి శతక నిర్మాణమునకు సూచనగా ఒక్క నెకరుకల్లు వేములవాడ దైవములు కాక, ఇతర దైవము లందరు పేర్కొనబడిరి. వారికి శివకేశవు లిరువురి పట్ల సమానమ్మైన భక్తి కలదని యిందు ప్రకటించిరి. వారు పరమ భక్తులు గాన ఆ భగవంతు డీ మధ్యాక్కర శతకముల దైవముల నొక్కచో స్తుతింప జేసెను. ఇది మధ్యాక్కర శతకములు వెల్వడుటకు భగవత్పరమైన ప్రేరణ యని చెప్పవచ్చును.

ఆత్మనివేదనము

'ఇద్ది యెందుకు చెప్పుచుంటి నన దారు వేను నటంచు...'(104) అను పద్యమున విశ్వనాథవారు తనను మురళిగా నూహించుకొని యా కృష్ణుని యూపిరి పోసి ఊదుకొమ్మని ప్రార్థించిన విధము వారి భక్తి పరాకాష్ఠకు నిదర్శనము.

శివునకు నీకును నేను భేదమ్ము సేయన యేని
సవురుగా మీ రిద్దఱొక్కడే బ్రహ్మ చైతన్య మేని
అవుర! వేదాంతముల్ నిజము లేని, నన్నది పొందుఁ గాక
వివరమ్ము తెలిసిన నన్ను మున్నంగి వేణుగోపాల! (107)

విశ్వనాథవారిందు శివకేశవులందు తనకు భేద భావము లేనట్లైనచో శివకేశవులిరువురు నొక్కటియై, అదియే బ్రహ్మచైతన్య మైనచో, ఉపనిషత్తులు చెప్పినది నిజ మైనచో తాను దానిని పొందెదనని దీక్షారూపమున చెప్పిరి. ఈ పద్యగత భావమును శతకము లన్నింటి యందును వారు ప్రబోధించిన విషయముల సారముగా గ్రహింపవచ్చును. తద్ద్వారా వారా పదవిని పొందిరని తలపవచ్చును.

# 17. వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!

ఇది 'విశ్వనాథ మధ్యాక్కఱ' లను శతక సంపుటిలో చిట్ట చివరి శతక మగు చున్నది. ఇతర శతకములలో వలె దీని యందు కూడ అద్వైత భక్తి ప్రదర్శితమైనది. ఇందు రాజరాజేశ్వరుని యందు పరబ్రహ్మతత్త్వ మారోపింపబడినది. మానవుల కష్టములు దేవునికి నివేదింపబడి, చిత్తము నందు శివు డుండునట్లుగా ప్రార్థింపబడెను. గహనమైన ఆధ్యాత్మి కాంశములు వ్యవహారగతమైన ఉపమానములతో సుబోధము కావింపబడినవి. 'వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి' అను నీ శతక మకుటము, తొలి ఇంద్ర గణము లేని మధ్యాక్కర పాద మగుచున్నది. 'రాజేశ్వరా' లోని 'జే' అను నక్షరము అయిదవ గణాది యందుండి యత్యక్షర మగుచున్నది. ఇది సంధ్యక్షరము కావున దీని కుభయయతి చెల్లును. ఒక పద్యమున(2) పూర్వము మత్స్యేంద్ర యోగి సారంగధరుని కన్నులు, కాళ్ళు, చేతులు ప్రకాశింప చేసిన విషయము ప్రస్తావించి 'నీ కన్న దైవంబు మిన్నున లేడనిపించె' నని వేములవాడ క్షేత్రదైవమును కవి ప్రార్థించిరి. ఇది యాగ్రామమునకు చెందిన చారిత్రక గాథ.

### ఆత్మతత్త్వము

విశ్వనాథవారీ క్రింది పద్యమున ఆత్మ-దేహము అనువాని సంబంధమును గూర్చి వివరించిరి.

చిరిగిపోయిన ప్రాంత గుడ్డ వదలి, క్రొంజీర ధరించు
తెఱఁగున నైనచోఁ బూర్వ మున్నట్టి దేహంబు విడుట
చిరిగిన గుడ్డపైఁ బ్రేమ యుండదు చెప్పుట యిద్ధి
యెఱుకకై వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! (58)

ఈ పద్యము భగవద్గీత(2-22)లో శ్రీకృష్ణు డర్జుననకు చేసిన ఉపదేశములోని

'వాసాంసి జీర్ణాని యథా విహాయ, నవాని గృహ్ణాతి నరోஉపరాణి, తథాశరీరాణి విహాయ జీర్ణా, న్యన్యాని సంయాతి నవాని దేహీ ' అను శ్లోకమునకు వ్యాఖ్యానము వంటిది. ఇచ్చట ఆత్మ ఒక దేహము వదలి మరొక దేహమును ధరించు ననెడి ఆధ్యాత్మిక సత్యము, చిరిగిన వస్త్రము వదలి నూతన వస్త్రము ధరించుట వంటిదిగా ఉపమింపబడినది. చిరిగిన బట్టపై ప్రేమ యుండని తెరగున, పోయిన దేహము గురించి విచారింప నక్కరలేదని తెలియ జెప్పుటను విశ్వనాథవారు పై పద్యమున వర్ణించిరి. ఇది వేదాంత విషయమును వారు సులభతరముగ నుద్బోధించు తెరగును తెలుపుచున్నది.

## జ్ఞాన స్వరూపము

'కనుచున్న వినుచున్న దెల్లఁ దెలిసికోఁ గలుగుట...'(62) అను పద్యమున జ్ఞానము గురించిన వివరణము కలదు. మానవులు తమ లోపల నున్న యొక తెలివిచేతనే చూచుట, వినుట అనునవి చేయగలుగుచున్నారు. తెలివియే జ్ఞానమా లేక జ్ఞాన మనునది వేరుగ నున్నదా? జ్ఞానము వేరైనచో మానవుల దేమి కావలయును. అని కవి రాజరాజేశ్వరుని ప్రశ్నించిరి. దీని వలన జ్ఞాన మనునది పరమేశ్వర రూప మనియు మానవుడు దాని కంటె భిన్నముగా కనిపించినను, అభిన్నుడనియు, కావున మానవుడు జ్ఞానమును పొందవలె ననియు తెలియ జెప్పబడుచున్నది.

## అకుంఠిత భక్తి

'నీవు నాలోఁ బ్రవేశించుటకు నెంచనేవలెఁ గాని...'(23) అను పద్యమున విశ్వనాథవారు భగవంతుని తనయందు ప్రవేశింపుమని ప్రార్థించి, దాని కనువుగ తమ శరీరము శతశతచ్ఛిద్రమని చెప్పిరి. ఆత్మరూపు డైన పరబ్రహ్మము, మానవుల హృదయమునం దుండు ననెడి ఉపనిషత్సిద్ధాంతము పూర్వ మనేక పద్యములలో ప్రకటింపబడి యుండగా, నీ పద్య గత విషయము దానికి వైరుధ్య మనిపించును. సరియైన ఆలోచనచేత నా వైరుధ్యము తొలగిపోవును. భగవంతుడు ప్రవేశించుట యన హృదయస్థమైన ఆత్మ జాగృత మగుటయే. అదియే జ్ఞాన నేత్రములకు ద్యోతక మగుట; భ్రూ మధ్యమున జ్యోత్యాకృతిలో వెలుగొందుట. ఇదియే వారీ పద్యమున కోరినది.

మధ్యాక్కఱలకును నీకు నాకు సంబంధంబు బలిసి
మధ్యాక్కఱలు, నేను వేఱ పనిమీఁద మానివేసినను
నీ ధ్యాన మేమయ్యె నేమి యయ్యెద నేను కృపణమ
హీధ్యేయ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! (33)

విశ్వనాథ వారీ పద్యమున తమకును, దైవమునకును, మధ్యాక్కర పద్యమునకును నవినాభావ సంబంధ మున్నట్లు వ్రాసిరి. ఈ పద్య రచనను మానివేసినను భగవద్ధ్యానము లేక యుండలేనని ప్రకటించిరి. అనగా సదా ధ్యానమగ్నుడనై యుండెద ననిరి. ఇది వారి అనన్య భక్తి భావముతోపాటు దైవస్తుతికి మధ్యాక్కరయే అనువుగా నుండునని వారు చేసిన భావనను కూడ వెల్లడించుచున్నది. ఈ క్రింది పద్యము వలన విశ్వనాథవా రనుక్షణము భగవద్ధ్యానము చేయుదురను విషయము తెల్లమగుచున్నది.

ఊపిరి తీసికొం చూపిరిన్ వీడుచో మహాదేవ
నీ పేరె యెడతెగకుండఁ దలఁచుచుంటిని మహాదేవ
నీ పేరె తలచుచు నుంట చిత్తంబు నిలుపలేదేని
యేపాటు వేములవాడ రాజరాజేశ్వరా!స్వామి! (73)

మోక్షమును కోరుకొను విశ్వనాథవా రొక పద్యమున(76) మరణము ప్రాప్తమగు వరకు తానుండిన స్థితిలో నుండుటకు వారి కిష్టము లేదనియు అది భగవంతుని దయలేక పోవుటయే ననియు వివరించిరి. అట్టి పరిస్థితిలో వారు 'చావురానీయవు, నిరంతరము నిన్ను స్మరింపజాలనీయవు, భావి తోచనీయవు, చిత్తమును నిలబడనీయవు, నీవు కాక మరొక చోటికి పోనీయవు' అని తమ అంతర్మథనమును మరొక పద్యములో(77) భగవంతునికి నివేదించుకొనిరి. ఇట్టి భావముతో కవి పరమేశ్వరుని వచ్చి తమ చిత్తమున నవధరింపుమని 'గ్రహచారమును బట్టి రాకపోకలు కైకోకు...'(78) అను పద్యమున వేడికొనిరి. గ్రహచార మనెడి లోక వ్యవహార గతమైన విషయ మిందు ప్రస్తావింపబడి, పరమేశ్వరుని సర్వజ్ఞత్వము ప్రకటింపబడినది.

### ఆనందానుభవము

'ఆనంద మొక్కడే నీ స్వరూప మంచన దాని యాను పానులు...'(64) అను పద్యమున వారు పరబ్రహ్మము, అనుభవింపదగినదే కాని, వేరుగ చెప్పదగినది కాదను విషయమును చెప్పిరి. ఆ పరమేశ్వర స్వరూపము ఆనందమయము. దాని ఆనుపానులు తెలిసికొనవలె నన్న అనుభవింపవలెనే గాని వేరుగ తెలియలేము. అట్టి అనుభవజ్ఞానము కలుగవలెను. దానిని పొందుటకు కవి యొక్క ఆర్తి యిందు వ్యక్తము చేయబడినది. తరువాత పద్యమున(68) వారు ఆనందానుభవమును గురించి వ్యాఖ్యానించిరి. పరమాత్మ స్వరూపమైన ఆనందమును వ్యక్తి అనుభవించును. అప్పుడా

అనుభవించిన వాడును, అనుభవమును వేరనుట ఎట్లు పొసగును. అప్పుడా శబ్దము యొక్క అర్థము కూడ పొసగదే! అని వారు వ్యవహారగత తర్కముతో దేవుని ప్రశ్నించిరి. అనగా మానవుని యందే భగవంతు డున్నాడనియు, ఆనందానుభవము పొందిన మానవుడు జీవన్ముక్తిని పొంది బ్రహ్మమగు ననియు నిందు చెప్పబడినది.

## లోకపరిశీలనము

భగవంతుని గురించి అందరు తలపోయుదురే గాని, ఆ భగవంతుని చూసిన వారుండరు. ఈ అభిప్రాయమును 'ఈ వదిగా నిదిగా దలంచుచు నెల్లవేళలను...' (49) అను పద్యమున వెలువరించిరి. పరబ్రహ్మము తేజోమయ మనియు, సర్వ వ్యాపక మనియు నుపనిషత్తులు చెప్పుచున్నవి. అట్టి పరమేశ్వరుని అట్లుండును, ఇట్లుండును అని మానవులు ఊహించుచుందురు. అట్లూహించుకొనుచు, బ్రతుకుటలవాటై పోయినది. అని విశ్వనాథవారు చెప్పుచు నీ పద్యమున ఆ భగవంతునికి నీ వెటువంటి వెలుగువో అసలు తెలియుట లేదని విన్నవించిరి. ఇది భగవంతుని గురించి లోకములో మానవు లనుకొను విధము. విశ్వనాథవా రనేక విధములైన లోక వ్యవహారములను గ్రహించి తమ భక్తి భావమున కనుసంధించి భగవంతునకు నివేదింతురు. మానవు లొక వస్తువు తమదగు వరకు నంగలార్చుట కలదు. అది తమదైన పిదప ధైర్యముతో దానిపై నశ్రద్ధ వహింతురు. ఇటువంటి మానవుల సాధారణ దృక్పథము నొక పద్యమున వర్ణించిరి(55). క్లేశ సమయములందు భగవంతుని ప్రార్థించి స్వస్థత చేకూరిన పిదప నా భగవంతుని మరచెడి మానవుల స్థితి యిందు వ్యాఖ్యానింపబడినది.

> కుక్కయు మరి దాలి గుంటలోఁ బండుకొన్నంత సేపె
> తక్కన లేచి తోఁక విదలించి వెంటనె దొడ్డిదారి
> యెక్కడఁ గనిపించు నక్కడే దూరు జృంభన్మహోగ్ని
> దృక్కేళి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! (87)

ఈ పద్యము వారి లోక పరిశీలనమునకును దాని నాధ్యాత్మిక విషయముతో సమన్వయించి చెప్పుటకును చక్కని నిదర్శనము. ఇందు మానవుని యొక్క భగవద్ధ్యాన పరమైన చంచల స్థితి కళ్లకు కట్టినట్లు వర్ణితమైనది.

'ఇంత నిరర్థక జీవితమునకై యెంతయో శ్రద్ధ...' (16) అనెడి పద్యమున భగవద్భావనను గూర్చిన సమాజ దృక్పథమును వెల్లడించిరి. మానవులు నశ్వరములైన జీవిత విషయములపై శ్రద్ధను, శాశ్వతమైన బ్రహ్మ భావనయం దశ్రద్ధను చూపుదురని

చెప్పి, అది సృష్టి లక్షణ మనిరి. మాయా ప్రభావమున జీవుడీ దేహము దాల్చి యట్టి భావనకు లోనగును. మాయయును పరమేశ్వరుని లీలయే, అనగా జీవుని సర్వ వ్యాపారములకు భగవంతుడే నిర్దేశకు డగుచున్నాడు. అందువలననే కవి యిచ్చట 'వెసదోషమెవరి దింతకు' నని రాజరాజేశ్వరుని ప్రశ్నించిరి. మరొక పద్యమున (17) ఆస్తిక్యభావమును గూర్చి ఎంతయో నిష్కర్షగా చెప్పిరి. అందరి హృదయములందు భగవంతు డుండగా జనులా దైవముతో విరోధింతురు. దైవము లేడనియు తామే కలమనియు భ్రమింతురు అని చెప్పి 'ఏమో చావనీ వారి' నని వారి యెడల తమకు గల వైముఖ్యమును ప్రకటించిరి. ఒక పద్యమున వారు 'కృతయుగ మతిఁ దాటి పట్టె కెదురు దేకెడువాఁ డనేను' అని తమ స్వభావము నొక చిత్రము వలె ప్రకటించిరి(18). ఇందు సమాజ స్వభావమునకు వారి స్వభావమెంత వైరుధ్యము కలిగి యున్నదో ననుదానిని, వారు స్వీకరించిన లోకోక్తి సువ్యక్తము చేయుచున్నది.

## స్వీయవృత్తము

వారు వేములవాడ వెళ్లుటకు కారణముగా 'ఒక్క యోగమ్మెదో నీ చరణ సన్నిహిత ధాత్రి భాగ, మెక్కితి' నని భక్తి తత్పరతతో చెప్పిరి(3). 'ఒక్క రెండేండ్లకు మున్ను నేవచ్చి...'(4) అను పద్యమున వారు తమ కా ప్రాంతముతోడి సంబంధమును ప్రకటించిరి. రెండేండ్లకు పూర్వము విశ్వనాథవారా క్షేత్రము దర్శించి ఆ స్వామిని కొలిచిన వైనము ప్రస్తావించిరి. ఆ దైవము ప్రేమతో వారిని మరల ఆ ప్రాంతమునకు రప్పించి ఒక యున్నత పదవి యందధిష్ఠింప జేసెనని పేర్కొనిరి. ఇందు వారు కరీంనగర కళాశాలాధ్యక్ష పదవి నలంకరించిన విషయము చెప్పబడినది. విశ్వనాథవారు 'ఇప్పటి కరువది యైదు వచ్చిన వేమన వలయు, నప్పుడు పాతిక యేండ్ల నాడు నీయందు నామనసు, చొప్పెటు లున్నదో యట్లె యున్నదీ చొప్పు నీ వేమి, చెప్పెదో...'(95) అను పద్యమున వేములవాడ శతకము రచించునాటికి వారికి అరువది యైదేండ్లను విషయమును చెప్పిరి. వారికి పాతికేండ్ల వయస్సు నుండియు ఒకే రకమైన భక్తి భావము చెక్కు చెదరక యున్నదని వెల్లడి చేసిరి.

## సూక్తులు

ఆస్తికుడైన ఆత్మవంచన పరుని కంటె నాస్తికుడే మేలని 'పదునెక్కి యాత్మహం డొక్కరుఁడు నాత్మవంచకుం డొకఁడు...'(89) అను పద్యమున వారు ప్రకటించిన తీరు ఆస్తికుల నాలోచింప జేయుచున్నది. ఆత్మజ్ఞాన విషయమున

మూర్ఖుడైన వాడు, అనగా ఆత్మజ్ఞానము నంగీకరింపని వాడు స్వచ్ఛమైన ఎద కలిగి యుండును. అనగా నతడు నమ్మిన దానియందు త్రికరణ శుద్ధి కలిగియుండునని యర్థము. ఆత్మ నంగీకరించు వారి యందే త్రికరణ శుద్ధి లోపించి యుండును. ఏలన కొందరు పైకెంతో జ్ఞానుల వలె నుండియు ప్రవర్తన యందు భిన్నముగ నుందురు. అందుచే నిట్టి ఆస్తికుని కంటె నాస్తికుడే మేలని విశ్వనాథవారు చెప్పిరి.

**ఆలంకారిక చమత్కారము**

విశ్వనాథవారు 'పచరించి మింటిలో లేఁత యెండలు పండు వెన్నెలలు, విచరింతు వంతియె గాని నాదు జీవిత మూషరమ్ము, రుచిలేని కూరలోనైన గాని తిరుగమూత వేతు, రెచటను...'(13) అనెడి పద్యమున తమ జీవిత సత్యమును మనోహరముగా ఆలంకారిక చమత్కారముతో ప్రకటించిరి. తమ జీవితము చవుటి నేల వంటి దైనను దైవము కరుణామయు డగుటచే లేతయెండలను పండు వెన్నెలలను ప్రసరింపజేయును. అనగా నిస్సారమైన జీవితమునం దప్పుడప్పుడు మంచి రోజులు వచ్చుచుండును. దీనిని సమర్థించుటకు కవి రుచి లేని కూరలో గూడ తిరుగమూతను వేయుదురను లోకములోని విషయము చెప్పిరి. ఇచ్చుటి విశేష లక్షణమును సమర్థించుట కొక సామాన్య విషయము చెప్పబడుటచే నీ వాక్యమున కర్థాంతరన్యాస దీప్తి కలుగుచున్నది.

ఈ విధముగ విశ్వనాథవారు కడమ శతకములలో వలె వేములవాడ శతకమున కూడ పలు విషయములు స్వీకరించి తమదైన ప్రత్యేక ముద్రతో వ్యాఖ్యానించిరి.



# 18. సింహావలోకనము

'విశ్వనాథ మధ్యాక్కఱ' లపై వెలువడిన ఈ విమర్శ గ్రంథమున పూర్వ విభాగములలో విశ్వనాథవారిని గురించియు వారి మధ్యాక్కఱ శతకములను గురించియు, ఒక పద్ధతి ప్రకారము రూపొందించుకొన్న ప్రణాళిక ననుసరించి పరిశీలనము కావింపబడినది.

ఇట్టి పరిశీలనము వలన విశ్వనాథవారా పరమేశ్వరున కొక్కొక్క మధ్యాక్కఱలో నొక్కొక్క స్తుతి రూపమున ననేక విషయములను వ్యాఖ్యానించుచు వేయి మధ్యాక్కఱలను రచించినట్లుగా తెలియుచున్నది. కాగా నిది యా నిర్గుణ పరబ్రహ్మమునకు సగుణ మూర్తుల పరముగా కావించిన, నొక సహస్ర నామ స్తోత్రము వంటి దగుచున్నది. ఆయన యనేక పద్యములలో కేవలము కైవల్యము నర్థించి చేసిన నుతులకు ఆ పరమేశ్వరుడు వారి కనేక పర్యాయములు భ్రుకుటియందు జ్యోతి రూపమున ప్రత్యక్షమైనట్లు పేర్కొనిరి. వారు అక్షర రూపమైన దానిని వాంఛించి, స్తుతించుటకు వాహికగా 'అక్కఱ'ను గ్రహించిరి. అక్కఱ అనుదానికి అక్షర మనియు నర్థము. అభ్యర్థనయును అభ్యర్థన మార్గమును అక్షరమే. ఈ విధముగ విశ్వనాథవారు అక్షరత్వము నొందిరి. అక్షర విశ్వనాథులైరి. అందుచేత 'విశ్వనాథ మధ్యాక్కఱల'పై పరామర్శ రచన యగు నీ గ్రంథము 'అక్షర విశ్వనాథ' యైనది.

'విశ్వనాథ మధ్యాక్కఱ' లను గ్రంథము వారి కాధ్యాత్మికపరముగనే గాక సాహిత్య పరముగ కూడ అక్షరత్వము కలుగజేసినది. ప్రధానముగ అది నుడికారము, లోకపరిశీలనము మొదలగువాని రూపమున నిరూపిత మగుచున్నది. భాషకు సహజమును, జీవమును అయిన లక్షణము నుడికారము. అది భాషా వ్యవహారమున వర్థిల్లుచుండును. ఆ తెలుగు నుడికార సంపద సమృద్ధిగ ఈ శతకములలో కనిపించును. విశ్వనాథవారి లోకపరిశీలన మీ దశ శతకములలో బహుభంగుల విస్తరిల్లినది. దీనిలో కొన్ని అంశములు ఆధ్యాత్మిక విషయ సమన్వితములు కాగా మరికొన్ని మానవ సమాజమునకు సంబంధించినవి. ఈ విషయములీ పరిశీలన గ్రంథమున సూచ్యము కావింపబడినవి. ఈ విధముగ మధ్యాక్కఱల రూపమున వారికి ఆధ్యాత్మిక, సారస్వత రంగములలో నక్షరత్వము లభించుటను ఈ 'అక్షర విశ్వనాథ' పరిచయము చేయుచున్నది. తదుపరి ఈ గ్రంథము 'విశ్వనాథ మధ్యాక్కఱ' లపై

భాషాపరముగను, ఉపనిషద్విషయ వ్యాఖ్యాన సమన్వితముగను సామాజికాంశ పరిశీలనాత్మకముగను ఇట్లనేక విధముల చేయు భావి పరిశోధనలకు ప్రేరకము కాగలదు.

******

మధ్యాక్కఱలకు నీకు నాకు సంబంధంబు బలిసి
మధ్యాక్కఱలు, నేను వేఱ పనిమీద మాని వేసినను
నీ ధ్యాన మేమయ్యె నేమి యయ్యెద నేను కృపణమ
హీధ్యేయ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!

క్రుమ్మి ప్రవాహంబు చొరగ నిమిడించుకొని యాగి యాగి
గుమ్ము నీళ్ళులు క్రక్కు తూమువలె నాదుగుండియ నిన్ను
చిమ్ముచున్నది 'యక్కఱ'లుగ నో దయాసింధు! నింపి హృద
యమ్ము చీల్పఁగదె భీమేశలింగ! ద్రాక్షారామ సంగ!

శివునకు నీకును నేను భేదమ్ము సేయున యేని
సవురుగా మీరిద్ద ఒొక్కడే బ్రహ్మచైతన్యమేని
అవుర! వేదాంతముల్ నిజములేని, నన్నది పొందుఁ గాక
వివరమ్ము తెలిసిన నన్ను మున్నంగి వేణుగోపాల!



# అనుబంధము - ౧

4వ, 5వ గణాద్యక్షరములు రెండింటికి యతి మైత్రి చెల్లిన పాదములు.

1. శ్రీగిరి శతకము

నిటలాక్ష నీ సన్నిధియును నీ సేవ నెరయు వేఁడితఁజ (20)
నిరతిశయంబు సౌఖ్యంబు నీ మూర్తి నిభృతంబు సేర్తు (67)
గుత్తులు గుత్తులై ప్రిదిలుకొన్నవి గుండియ ల్లెల్ల (84)
అనుభవవేళయందు సుఖ మన్నచో నదియు భావనయ (95)

2. శ్రీకాళహస్తి శతకము

హర! నన్ను నే నీకు సర్వ మర్పించి నప్పటి నుండి (16)
ఎప్పు డెదో దిగు లెప్పు డేవో సహింపగారాని (17)
అరసి నానాక్షేత్ర సమితియందు మీరావిర్భవించి (21)
భరత దేశంబున భక్తి భావంబు పనకల్పికొంచు (21)
ఈ కోప మీయహంకార మీకామ మివి యెల్ల స్వామి (42)
ఇచటి యీ దేహ మాలంబ మీ దేహ మేగిన పిదప (46)
ఆలంబనమునకు వెదకునది హేతువయ్యె జన్మలకు (47)
తగ లిప్తయే బిందువా ప్రథమమ్మైన తళుకుకైన నిన్ను (48)
అనుభవ పరమార్థభూతులైన మహాత్ముల మాట (49)
తనరంగ నా యనుభూతి దవ్వునఁ దారాడునట్లు (49)
పనితమై జిహ్వ నిన్నెపుడు పలికినఁ బాటింప వింత (53)
కొన్నానొ, అదిలేదు, గ్రుడ్డి గుఱ్ఱాలకుం బండ్లు తోము (64)
పాము పడగ విప్పి శిరసుపై నీడ పట్టిన నేది (76)
ముంగిట కళ్లలు తీయఁ బోయిన ముగ్గొల్కినట్లు (79)
పదివాగులై పాఱు కాలకర్మముల్ పాపపుణ్యములు (88)
కదలికచే నొక్కఁడొకఁడు కలియుట కలుగుఁ గదలుట (88)

## 3. భద్రగిరి శతకము

ఒగి దీనిరక్ష కష్టముగ నున్నది యున్నదీ చరణ! (23)
చలియించుచున్నది చలన సంగతా సాధు చేష్టముగ (28)
ఏడువలేక నవ్వుటయ యెంచిన నీ సృష్టి యెల్ల (32)
నీతి బాహిరుఁ డైన వాఁడు నేను నా నీతి గాఁ గలన (34)
చేవ వెల్గు వెలుంగే, మరియు చీఁకటి చీఁకటే, రెండు (49)
తేఁజాల దెందుకు గాని దిగవయ్య దిగు సంచరన్మ (57)
అరయ నీ మాటలు వేని కవి నీక యప్పుఁజొప్పెదను (59)
అవుర నే నీజన్మదాఁక నఘ హీనమైనట్టి జన్మ (63)
మొదలిడి నీమర్వు చొరఁగ మున్నున్న పోడిమి కూడఁ (66)
ఓరువజాలను బ్రతికి యుండుట యుర్విపై బరువు (74)
ఉన్న మృత్యువు కంటె మిత్ర మున్నదే యున్నన్ని నాళ్ళు (82)
పన్నిన మధ్యాక్క-అలుగ భావముల్ వచ్చెడు స్వామి (92)
వన్నెలు చిన్నెలుగాఁగ వర్ణింప వలఁతిని నేను (100)

## 4. కులస్వామి శతకము

అంత తపంబు చేయంగ నైన నీ యాజ్ఞ నా యాత్మ (1)
ఆ యింద్రియములు జీర్ణించు నప్పటి కా యింద్రియములు (8)
దండితానేకపదైత్య! తమరి చింతన లేకయుండ (13)
గుండియలో దిగులొకటి కొండయై కూరుచున్నయది (13)
కాక యెట్లుందు వొక్కో- యగాధాంధకారాంధువునను (15)
ఇతర విషయ సన్నికర్ష మెప్పు డీ యెదకుఁ గల్గెడినొ (17)
జతపడకుండనే మదికి సహజంబు చాంచల్య మిట్టు (17)
పదములో నైనట్టి తీపి పొడవు, వ్యర్థతా బుద్ధి (18)
తెలివి యనంగ నీయదియ తెల్వి, యంతికమునఁ జేరు (20)
కందును దిందు ననంగ గమలాప్త కమలారులొచు (23)
ఇందు నేనయి యజమానుడీ వొచు నేను వేఱొకడ (23)
ఇవి యెల్ల బ్రాతిభాసికములే యంచు నీసడించకువె (29)
బ్రదుకును బ్రదుకుచు నుంటి బ్రదుకఁ దప్పదు ప్రాణనాథ (44)
పదివేల్ దివాకరుల్ నీవు పదివేల్ విభావరుల్ నేను (44)
కాని కామ క్రోధములయి గాటంబు గానెంత బ్రతికి (45)

అలుపంపు విషయముల్ తెలియు నధికంబు లర్థమ్ము కావు (48)
అలగుండెలో నెంతలోతు నందుండి హర! నన్ను నింత (48)
పరగంగ నేడేండ్లు తాను పట్టినఁ బదునాలుగేండ్లు (53)
ఇచ్చట వార్లేక యేమి? యిచ్చట నేనుండి యేమి? (58)
మరి యెల్ల యిచటిదొ బ్రదుకు మాకు సంబంధించినంత (61)
ఎవ్వడో జనియించు బ్రతుకు నెవ్వడో యెవ్వడో చచ్చు (63)
అవ్వల నివ్వల దాని కనుబంధ మగు పాడిగింపు (63)
పర్విన వైరాగ్య మైనవారికిఁ, బడదూహలందు (66)
అకట! సదా కోటి జీవులందున నభవ నేననుచు (90)
వట్టి నాయంతనే నిన్నుఁ బట్టుక ప్రాకులా డెదన (94)
కోటి శత్రుల గూర్చినావు కూర్చుంటి గుండియలోన (97)

## 5. శేషాద్రి శతకము

శ్రీ పయోధర సమాశ్లేష రేఖాపరీమళామృతధు (1)
కొన్నట్లు వ్యాధులు పాపికోను నీకొండకు వత్తు (3)
వలయున యిట్టి వ్యాపారభావ మావలఁ బెట్టి నాకు (12)
ఆపేరు మొదలైనవి వ్యవహార సమాసన్నములివి (13)
పుట్టెను పుట్టిన బుద్ధి పోవును బుడకల నంద్రు (27)
కన్నచో నెందుకో తెలియదాయె నీదైన యీగుట్టు (31)
గానైన పేరాస యేఁచగా నైహికము నిత్యమంచుఁ (32)
ముగ మట్టమున నుండి యుబుకు బుడగలై బుసబుస లగుచు (40)
మోహ భావంబులన్ తుంగముసైలముట్టెఁ ద్రోచుచును (44)
అంచును నియమంబు లేనియపుడు లేవనినఁ దప్పేమి (47)
అవుర! నీ భార్గవ రాముడైనట్టి యవతారమొక్క (57)
సకల వేదమ్ములు నుపనిషత్తులు సకలాగమములు (62)
వారికిఁ జూపితి కౌరవ సభలో భయపడినట్లు (71)
ఎన్నగా నిప్పుడే అక్కడెక్కడో యేమియు లేద! (82)
ఎన్నగ యంత్రాల మీఁదనే గుట్టమే యుండదపుడు (90)
పరమేశ తెలిసెను పుణ్యపాపముల్ పట్టించుకోవు (98)

**6. ద్రాక్షారామ శతకము**

పది మాటలకు నొక్క మాట బదులుగాఁ బలుకంగవచ్చు (9)
పది పదుల్ వందలు గాగ వ్రాసిన పద్యాలకైన (9)
గాదని యుపవాస ఘటన కలుగఁగా గలుగును గాని (17)
తాను నీవనుకొందు విద్ధి తప్పని తద్దినమంచు (21)
పైకి శిలాకఠినుండ వయ్యును భావమ్ములోన (22)
గణనాథపిత! నీవు మూర్తికట్టిన గానంబ వేమొ (25)
కాలాకృతిం బూని పట్టి క్షణములు గడపుటో తెలియ (26)
కనుకని నా వెన్నుపాముగాఁగను గదలించి కరువు (46)
విన్నంత, తలచిన కొలఁది వివృతమౌ విభవంబు నీది (54)
కంటికిఁ, గంటిలో నుండి కంటికిఁ గన్పించువాడ (61)
నీ పేరె యనుచుందు నెడద నిన్నె ధ్యానించు చుండెదన (66)
నగుబాట్ల పాల్సేసి నీవు నాయది నాకిచ్చు చుంటి (76)
హాజమా యటంచు నెంచెదవో హర హర హర మహాదేవ (78)

**7. నందమూరు శతకము**

కనులకుఁ గట్టిన మూర్తిగా నీవు కన్పింప వెపుడు (8)
సర్వథా చచ్చెడివారు సర్వదా చచ్చుచున్నారు (16)
కలుగను మూర్ఖత దీనికంటెను గలుగునా వేఱు (31)
అలుపంబులందున మరియు నలుపంపు టధికారమునకుఁ (39)
అన్నియుఁ బున్నెంబులగున యటుగాక నన్ని పాపములె (41)
పర్వతం బొక్కండు పైనఁబడి చావఁ బ్రాణముల్ పోవఁ (57)
ప్రకట తైజస శరీరములు పయనించుఁ బాంచభౌతికము (59)
ఆకాశమం దేకదేశమై యుండునా వాడు పట్టి (60)
పడియుగా నొక చోట నిల్చెఁ బల్లానఁ బడియు తానయ్యెఁ (61)
అనతమయి భావమైన యట్టిది యాత్మయు ద్రవ్య (64)
ఇన్నిన్ని వచ్చెడు దీని హేతువు నెఱిఁగితి నేను (65)
మనసు భ్రమించుచు నున్కి మంచికి మరలించుచున్కి (68)
మొదలు తుదయు లేని కష్టములు దుఃఖములు పూర్వ భుక్తు (69)

ఎదఁ గోరి రనుమాట యర్థ మిప్పటి కెఱుఁగ వచ్చెడిని (69)
కప్పిన యందంబు గాఁగఁ గనిపించుఁ గంటికి సృష్టి (86)
మ్రొక్కు నా జీవుని గడప ముంగిట ముగ్గులు తీర్చి (98)

8. నెకరుకల్లు శతకము

కన్నులు మూసిన నెఱుపు కన్పించుఁ గన్పించు నలుపు (18)
ప్రాణముల్ సుడిగొని నిన్ను బతిమాలి బామాలు కొలఁది (23)
వైరాగ్య భావంబు కలిగి బ్రదికిన బ్రదుకు తేలికయు (29)
వైరాగ్య లేశంబు లేక బ్రదికెడు బ్రదుకు దుర్భరము (29)
వైరాగ్య మననేమి నిన్నుఁ బండించు వ్యవసాయమందు (29)
ఊహ వదలిపెట్టి, కూడ నూహించు టేటికోమరి యి (35)
నిగుడు, లోకము పైకి మనసు నిన్ను ధ్యానించెడు వేళ (46)
నట్టుగాఁ గవనంబునకును నా కవినాభావమైన (54)
వనరి యధార్థ వాక్కునకు వశుడనై వాక్చమత్కార (58)
నీ కృపావశమున మనసు నీపైన నిలుచుచునుండె (62)

9. మున్నంగి శతకము

తరుణ చంద్రాతప హాస! దర్పిత దానవ హ్రాస! (4)
దరచక్ర చిహ్నసుందర పదాంక బృందావనీ ఘాస! (4)
కారుణ్య రససముద్రా! జగచ్ఛ్రేణి కళ్యాణ ముద్ర (7)
ప్రశమిత పంచేంద్రి యోగ్ర పరిణద్ధ వనరాశి దాహ! (9)
ఛాయలు మూర్తి తాల్చితిరి, స్పందనచ్ఛాయ లివెల్ల (16)
వడిగ నా కోటి కోరికల ఫలమిచ్చు స్వామివి నీవు (18)
వేణు వూపిరి తిత్తు లెండఁబెట్టు నీ విద్య మానవును (19)
నీవు స్వామివి కాదటంచు నిందించి నీ శిక్ష పొంద (30)
ఉభయ లోకమ్ముల తత్త్వ మొకచోట నురువుగాఁ గూడి (31)
పదిలమౌ చిరునవ్వు వెలుగు ప్రసవ శోభారాశిగాగ (33)
స్వాపమ్ములోన నా స్వామి బంభర ధ్వానమ్ము వింటి (34)
సెనగ పూవులబోని నీదు చేడెల చికిలింతలైన (38)
బాహిరిల్లిన యట్టి గేహ భామినీ భావంబు కలదొ (41)

పరితో భ్రమణ సేయుచున్న బంభర స్వానమ్మ స్వామి (44)
ఇంత మాయాప్రియుండీవు నెందుకోయీ నీకు వలతు (47)
ఈ మొదల్ తుదలేని యింత సృష్టిలో నేనొక యణువు (53)
అలుకమై నిది యందు రిద్ధి యనరని నగునె నీయంత (58)
అంకముల్ కార్యకారణ సమన్వయ మదియ మానవత (60)
అన్న! జాగ్రజ్జ్యోతివైన యా వెల్గు లవి యెట్టులుండు (69)
మదన గోపాలుని వదన మండల మాధుర్య మెల్ల (78)
అది గమ్యమనుకొంట కన్న నవివేకమని వేర కలదె (80)
అమరంగ వీపున యందు నమృత మన్నట్టి రసంబు (89)
అనుభవించడు, భార్య కీయ డాత్మజు డన్నది కాదు (91)
ధరణి మానవసేవ మించి ధర్మమ్మ దైవమ్మ లేదు (92)
అప్ప! చేతను గత్తి బూని యపుడు మాయాయుధ శ్రేణి (97)
ధా లాస్య శైవాలి నీకథం జెప్పెదను కృష్ణదేవ (98)
ఓయి ఫల్గున సారథీ! మహోగ్ర యుద్ధోర్వి లోనన్ గ (101)
ఔర! నీ శృంగార రసమయం బన్న యౌవనం బెల్ల (102)
ముహుంరర్పితమ్మ నీ ముగ్ధ మోహనమూర్తి; ఫాలమున (105)

## 10. వేములవాడ శతకము

ఈ గాలి యీ మేనిలోన నీరీతి నెన్నాళ్ళ వరకు (10)
మొగి నాచరిత్రమ్మనకు ప్రభూ! నిప్పు ముట్టించ వలయు (12)
ఈ మరియాద నీకన్న నెక్కువై యొసగెడు స్వామి (48)
అనుభవించితిన నీవైన యానంద మపుడైనఁ గాని (65)
అనుభవ మన్న శబ్దమ్మ నర్థమ్మ నదుకునే వాని (65)
ఆనంద మనుభూతికైన దైనచో నదియందులోని (67)
ఏనిట్టు లుండుట నాకు నేమియు నిష్టము లేదు (76)
అదిరయ్య దానికై యేడ్చినప్పటి కది లేద యిప్పు (83)
వింతలౌ వెల్గులు కానిపింపగా విప్పికోద, యఘ (88)
ఏవలె నింత వైయర్థ్య మెందుకో యెందుకో దీని (92)
ఐ కోహ సంజనకమ్మలై పొల్చునవి యున్న యెడల (97)

# అనుబంధము - ౨

## ముద్రితప్రతిలో ఛందోభంగము గల పాదములు - సవరణలు

**1.** శ్రీగిరి శతకము

శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! (1) (సూనాభిషంగ!)

(నకార ప్రాసగల పద్యము)

నా నమ్మకమ్మిది స్వామినాథ! నాదు జన్మాల చేత (89) ( నా జన్మాల)

**2.** శ్రీకాళహస్తి శతకము

దయలేదయేని భస్మీకరింతు తాకినయంత (4) (భస్మీకరింతువు)

పో మన స్సిది దొంగ పడి దోచుక పోయినట్లుండె (12) (దొంగలు పడి)

బరువు నాయది నీకు నెత్తిన పాపమ్ము కలదొ (16) (నెత్తినంతన పాపమ్ము)

అహహ యీ మూడింటఁ గగన దురూహలే యధిక భీకరము (43) (గన)

నిన్ను నమ్మిన దాని కిట్లు జేయనే వలెఁ బ్రభుత (61) (సేయంగనే)

కొన్ని జన్మములు దాటితిని మనోమయ కోశంబునందు (68) (దాటితి)

ఎంత పొడుచుక చూచినను గన్నుల కగుపడబోవు (80) (కేలకన్పడవు)

**3.** భద్రగిరి శతకము

కలుగగాఁ గోదండ రమ్యమైనకైదండ యీవె (15) (మైనట్టి కైదండ)

ఈ వెట్ట యిటులున్న నింక నేమైన నున్న దా మండి (19)

(5వ గణాద్యక్షరంతో కాక 4వ గణాద్యక్షరంతో యతిమైత్రి)

చివరకు వెనుకటి జన్మ కూడఁదెలియని జీవుడైపోతి (63) (జన్మ దెలియని)

ముడిదినుసు నిజంబు నాయెడద యంబుజ పరీమళము (81) (యెడదయ)

**4.** కులస్వామి శతకము

సేతువీవు, యవ్వుర నీభావన నవ సుమ ఫలాభమౌ మమ్ము (9)

(సేతువీవ, లవుర) (నవ్య) (ఫలలాభ)

ఎదలోనఁ బ్రేమంపుటూహ యుదయించు నంతలో నీవు (18) (నింత)

సుసమాహితుండేమొ యనయట్లుగాఁ జూపట్టునట్లు (41) (యనగ నట్లుగాఁ)
వదరుట యొక్కటి యాపైన సంకెళ్లవలెఁగాళ్ళయందు (52) (యొక్కటిపైన)
ఈ భూమి యీ మిన్ను నా కోస మేకమైతిరా! హ (57) (మిన్ను కలిసి నా)
అదియెంత యూహ సేసినను చనిపోవు నాప్రియు లెందు (59) (నాత్మీయు)
దయలేక యొక్కొక్క ముక్కగాప్రతిరోజు తరుగుటయేల (93)
(ముక్కగా రోజు)

**5. శేషాద్రి శతకము**

వాదంబు లేదిందు నీదైన పరమాత్మ వాదంబు గాక (9) (నీదు)
కంటి హాలలంబు కష్ట దుఃఖ నికాయంబుహనఁ దెఱ (41)
(హాలహలము) (నికాయంబు దెఱఁగు)
లేదేని నొక్క యూహ పొనరింపవలెన్ గృత యుగ
మాదిలో..... (92) (యుగము - నాదిలో)

**6. ద్రాక్షారామ శతకము**

మన యిద్దఱకు సిగ్గులేదు తలచినంతన వచ్చి మన్నింతువీవు (20)
(తలచిన మన్నింతు)
ఆరక తెగపోట్లు పొడుచుచుండ నయ్యో యగునొ శి (56)
(ఊరక) (యగునో)
గాదిలి స్వామి! దైవమవె కాని కలికాల మగుట (59) (కాని యీకలికాల)
మును మౌళిపై విప్పిపట్టు పడగయు నోయి స్వామి హర (62) (మ-నల యతి)
మా కట్టి కొంచును జరుగుచున్నది యిది పౌరుషముగ (83) (యది)

**7. నందమూరు శతకము**

అనువు కాకుండెదు నిను బలవంతమని చేయరాదొ (26) (నిన్ను)
సామాన్యముగ నేఁల ప్రయాణముం జేయు సమయంబు నందు (88)
(పైని పయనించు)

**8. నెకరుకల్లు శతకము**

వే కోయవలె నన< జాలవు వేయి జన్మములు (11) (నన నాకుం జాలవు)

మరియు జాగ్రద్వేళ కామభావమే యధిక మన్పించు (38) (మనసు కన్పించు)

**9. మున్నంగి శతకము**

తారుణ్య గుణ సముద్రా! వ్రజస్త్రీ జగన్మనో భద్ర! (7) (కారుణ్య)

నిదురించుటయు మేలుకొంట రెండే రెండో లేక యొకడె (55)

(రెండు రెండే )

కేళీమనస్సమాకృష్ట మోహ నిచయ నికృంతనమ్ముగను (73) (మోహనికృంత)

పది విధాలుగ వెట్టి తలలు వేసి యధర్మంబు పెరుగ (94) (వేయుచు పాపంబు)

**10. వేములవాడ శతకము**

కన< త్రిపురమ్మయు నీవు పెనవేసికొంచు< జిందించు (20) (పెన<గొని గంగ<)

ఎప్పుడు కానె కానాంతర స్థితుండవై యీ వ త్రిప్పెదవ (44) (స్థితుండీవ)

పిచ్చియో యిటువైపు మరల మొగము చూపించవే య (54) (యదియు,నె...)

---

# అనుబంధము - 3

## మాదిరికి కొన్ని సామెతలు, లోకోక్తులు, నుడికారములు

**1. శ్రీగిరి శతకము**

మార్పేరం బిలుము, ఊగులాడితినేని (6), కొఱవి కొనితెచ్చికొన్నట్లె యేమి (37), తెలివిపోయె జదవ వేయగా (43), నూకల కేడ్చి యేడ్చి తవుటి కేడ్చిన యట్లు గాక (45), పెరిగిన విఱుగుట యరుదె (58), పిచ్చి కుదిరిన గాని పెండ్లికాదు పిచ్చి గుదురదు పెండ్లైన గాని (92).

## 2. శ్రీకాళహస్తి శతకము

వడ్లగింజలోని బియ్యపు గింజ (8), ఉడుకు నగ్నుల బానఁ బిడుగు పడెనన్నట్లు (11), దొంగ పడి దోచుకు పోయినట్లుండె (12), కంట వత్తిడు కొని, పవలు రాత్రులు కాని (30), మన్ను తిన్న పాము (34), గ్రుడ్డెద్దు చేనిలో బడ్డ విధాన (59), గ్రుడ్డి గుఱ్ఱాలకు బండ్లు తోముచున్నాను (64), అయ్యవార్లం గారినిఁ బొనరింపఁ బో నది కోఁతి యయ్యె (75), చేసిన పాపంబు చెప్పిన బోవు (78), కంటికిఁ గలికమునకైన నక్కఱపడవు (80), అంగటిలోని బెల్లమునకును గుడిలోని లింగమునకు నైవేద్య మన్నట్లు (95), సున్నకు సున్న హళ్ళికి హళ్ళి (99).

## 3. భద్రగిరి శతకము

పుల్లవిరుపువమాటలు (17), పప్పులుడకవు (18), చచ్చునపుడు సంధ్యమంత్రము (21), గ్రుడ్డిలోమెల్ల (21), ఎగదీసిన బ్రహ్మహత్య దిగదీసిన గోహత్య (23), పులిమీది పుట్ర(31), కడుపులోనిల్లు కట్టిన యట్లు(32), చేసినట్టి పాపము చెప్పినఁ బోవు (40), అటునుండి నరుకుక రమ్మి (41), ప్రాణములు పెట్టి బ్రతికితి (44), గ్రుడ్లు నీర్గుడ్లలో గ్రుక్కికొనుట (51), నీటి కొలది తామర (53), మొండివాడు రాజుకన్న బలవంతుడు (57), చదువవేసినయంత నున్న మతి కూడ సమసిపోయె (66), కాళ్ళ వ్రేళ్ళయందు బడుట (68), చచ్చిన చావె (79), గోచికిని బెద్ద గావంచాకు చిన్న (79), బలవంతపున్ బ్రాహ్మణార్థంబు (91).

## 4. కులస్వామి శతకము

రాచి ఱంపాన బెట్టెదవు (33), కంపన పడ్డ కాకి వలె (46), పెడ చేను పండుననుచు తనది మురగ బెట్టుకొందు రటె (55), పిల్లిపై నెలుకను నెలుకపైనను బిల్లిని బెట్టి (86), బొట్టు కాటుక పెట్టి (94).

## 5. శేషాద్రి శతకము

పిచ్చి కుదిరెను రోకలి తలకు జుట్టు మన్నట్లు (24), పుట్టెను పుట్టిన బుద్ధి పోవును పుడకల నంద్రు (27), నాల్గు వ్రేళ్ళు లోనికిఁ బోవుచున్న (30), సిగపట్ల గోత్రమ్ము (89).

**6. ద్రాక్షారామ శతకము**

ఆడిన దాట (11), కౌపీన రక్షణమ్మున నీ పటాటోప మన్నట్లు (18), తప్పని తద్దినము (21), అడ్డదారులు (24), మెత్తవాని బట్టికొని మొత్త బుద్ధి (21), చివరకు మొండి చేయి చూపించు (36), నిషధయోగ్యుడు (40), నూకల కేడ్చి యేడ్చి తవుటి కేడ్చిన యట్లు (53), అది పదివేలు (60).

**7. నందమూరు శతకము**

పాల ముంతువో నీట ముంతువో (29), వట్టి టాటాలకు గాదు (68), పది పిచ్చికలు చేతిలోన నాథ (69), దిన దిన గండము నూరేండ్ల యాయుస్సు, సగము చచ్చిన వాని నేల పట్టుక సాధింతు (94).

**8. నెకరుకల్లు శతకము**

ఇంగువ కట్టిన గుడ్డ (21), చేసికొన్న వారికి మహాదేవ! చేసికొన్నంత (26), నాల్గు వ్రేళ్ళు లోనికి బోవుట, కాళ్ళు కడుపు పట్టుకోవచ్చు (28), హిరణ్యాక్ష వరములు (50), పుట్టి మునుగుట (54), కొనితెచ్చికొంటిఁ దగ దారికి పోవు తద్దినము (58), కందకు లేని దురద చేమ కేటికి (59), అవ్వ కావలయు బువ్వ కావలయు (71), రోగమ్ము కుదురు, చిప్ప చేతికి వచ్చు (92).

**9. మున్నంగి శతకము**

వేలకు వేలు (51), ప్రాణాలు కడబట్టుట (74), లక్ష మారులు (79)

**10. వేములవాడ శతకము**

మసిపూయు (14), గ్రుడ్డి గవ్వంత (15), ఏమొ చావనీ! (17), తాటిపట్టె కెదురు దేకెడివాడు (18), అంగలార్చుట (55)

మొదలగునవి

# ఉపయుక్త రచనల సూచి

## సంస్కృతము

1. ఈశ ఐతరేయ కఠోపనిషత్తులు. 1981. అను: శ్రీ విఠలదేవుని సుందర శర్మ. సురభారతీ సమితి, హైదరాబాదు.
2. ఈశావాస్యోపనిషత్తు. 1982. రామకృష్ణ మఠము, మద్రాసు.
3. ఉపనిషత్సుధ (ఈశ, కేన, కఠ, ప్రశ్న ఉపనిషత్తులు) I. 1979. వ్యాఖ్యాత: చర్ల గణపతి శాస్త్రి, విశాఖపట్నం.
4. కఠోపనిషత్తు. 1983. రామకృష్ణ మఠము, మద్రాసు.
5. కేనోపనిషత్తు. 1982. రామకృష్ణ మఠము, మద్రాసు.
6. తైత్తిరీయోపనిషత్తు. 1986. రామకృష్ణ మఠము, మద్రాసు.
7. తైత్తిరీయ, కేన, ప్రశ్న, ముండక, మాండుక్య ఉపనిషత్తులు. 1984. అను: డా. పుల్లెల శ్రీరామచంద్రుడు. సురభారతీ సమితి, హైదరాబాదు.
8. ప్రశ్నోపనిషత్తు. 1982. రామకృష్ణ మఠము, మద్రాసు.
9. మాండుక్యోపనిషత్తు. 1982. రామకృష్ణ మఠము, మద్రాసు.
10. ముండకోపనిషత్తు. 1982. రామకృష్ణ మఠము, మద్రాసు.
11. శ్రీమద్భగవద్గీత. 1966. వ్యాఖ్యాత: విద్యాప్రకాశానందగిరి స్వామి, శ్రీశుక బ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి.
12. శ్వేతాశ్వతరోపనిషత్తు. 1983. రామకృష్ణ మఠము, మద్రాసు.

## తెలుగు

1. అప్పకవి, కాకునూరి. (17శ.) 1963. అప్పకవీయము. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.
2. గణపతిశాస్త్రి, చర్ల (వ్యాఖ్యాత) 1979. ఉపనిషత్సుధ-1 (ఈశ కేన కఠ ప్రశ్నోపనిషత్తులు).
3. గౌతమరావు, జువ్వాడ. 1974. విశ్వనాథ కవితా వైభవం. యువభారతి, సికిందరాబాదు.

4. గోపాలకృష్ణారావు, కే. 1976. ఆంధ్ర శతక సాహిత్య వికాసము.
5. ధూర్జటి. (16శ.) 1979. కాళహస్తీశ్వర శతకము. తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
6. నీలకంఠ శాస్త్రి, ఓరుగంటి. 1977. హరిహరనాథ తత్త్వము. వేదము వెంకటరాయ శాస్త్రి & బ్రదర్స్, మద్రాసు.
7. పెద్దయ, విన్నకోట. 1972. కావ్యాలంకార చూడామణి. వేదము వెంకట రాయ శాస్త్రి & బ్రదర్స్, మద్రాసు.
8. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. 1980. ఉపనిషత్ వాహిని. శ్రీ సత్య సాయి ఎడ్యుకేషన్ & పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం.
9. భాస్కరానంద సరస్వతీ స్వామి. కుండలినీ యోగ రహస్యం-1. యోగప్రభా పబ్లికేషన్స్, తిరుపతి.
10. మందేశ్వర రావు, వడలి. 1985. ఇది కల్పవృక్షం. సమదర్శిని సాహిత్య సమాఖ్య, సుబ్రహ్మణ్యనగర్, హైదరాబాదు.
11. రాధాకృష్ణన్, సర్వేపల్లి. బ్రహ్మ సూత్రము (అను: రత్నాకర బాలరాజు), కాసంశెట్టి రాధాకృష్ణయ్య, చిందంబర రెడ్డి, అనంతపురం.
12. రామరాజభూషణుడు. (17శ.) 1965. నరసభూపాలీయము. (వ్యాఖ్యాత: సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి. త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్టణం.
13. లక్ష్మీరంజనం, ఖండవల్లి. 1970. 'విశ్వనాథ మధ్యాక్కఱలు'. లక్ష్మీరంజన వ్యాసావళి. రచయిత. (ద్వితీయ ముద్రణ).
14. లింగమూర్తి, పరశురామపంతుల. (18 శ.) 1934. సీతారామాంజనేయ సంవాదము. వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.
15. విద్యాప్రకాశానందగిరి స్వామి. 1973. గీతోపన్యాసములు. శ్రీశుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి.
16. ______________. 1982. రామాయణబోధామృతము. శ్రీశుక బ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి.
17. విద్యారణ్య స్వామి. (14శ.) 1965. వేదాంత పంచదశి. (శ్రీరామ కృష్ణ విరచిత వ్యాఖ్యానము) వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.
18. వెంకటరామరెడ్డి, దొడ్డ (అను.). 1983. నారద భక్తి సూత్రములు. శ్రీరామకృష్ణమఠము. మైలాపూరు, మద్రాసు. (మూడవ ముద్రణ)

. వేంకటావధాని, దివాకర్ల. 1965. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

1. ________________. 1983. కవిసమ్రాట్ విశ్వనాథ. నాగార్జున విశ్వవిద్యాలయము.

. ________________. 1974. 'కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ.' ప్రతిభాలహరి. 1974. యువభారతి, సికిందరాబాదు.

2. ________________. 1980. పోతన. (భారతీయ సాహిత్య నిర్మాతలు), కేంద్ర సాహిత్య ఎకాడమి.

3. ________________. 1960. ప్రాఙ్నన్నయ యుగము. రచయిత.

4. శంకరాచార్య. (8శ.) 1983. వివేక చూడామణి. (వివరణము: కామర్షి వేంకట సుబ్బయ్య) రామకృష్ణ మఠము, మద్రాసు.

5. ________________. 1982. శివానంద లహరి. శ్రీవిద్యా సేవాసమితి, హైదరాబాదు.

6. శ్రీరామరాజు, నడుపల్లి. 1985. తెలుగులో ఛందో విశేషములు. శ్రీసత్య ప్రచురణలు, హైదరాబాదు.

7. ________________. 1985. ఛందో వ్యాసావళి. శ్రీసత్య ప్రచురణలు, హైదరాబాదు.

8. సంపత్కుమారాచార్య, కోవెల. 1981. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయిక రీతి. రచయిత.

9. సచ్చిదానంద మూర్తి, ముళ్లపూడి.1982. 'విశ్వనాథ మధ్యాక్కఱలు-వైశిష్ట్యము'. విశ్వనాథ శారద-1. విశ్వనాథ సత్యనారాయణ స్మారక సమితి, హైదరాబాదు.

0. సత్యనారాయణ, విశ్వనాథ. 1976. కల్పవృక్ష రహస్యములు. పి.యస్. అండ్ కో, గుంటూరు.

1. ________________. 1972. కావ్యానందము. అరవింద ప్రచురణలు, విజయవాడ.

2. ________________. 1978. నారాముడు. (?) హైదరాబాదు.

3. ________________.1970. మాస్వామి. వి.యస్. యన్.అండ్ కో, విజయవాడ.

34. ______________. 1976. శ్రీమద్రామాయణ కల్పవృక్షము(బాలకాండము). వర్లీ పబ్లికేషన్స్, విజయవాడ.
35. సుబ్రహ్మణ్యం, జి.వి. 1964 అభినవ లోచనము. యువభారతి, సికింద్రాబాదు.

36. ______________. 1976. 'రామాయణ కల్పవృక్షం'. రామాయణ సుధా లహరి. యువభారతి, సికింద్రాబాదు.
37. సువర్చలాదేవి, కాశీనాథుని. విశ్వనాథవారి భ్రమర వాసిని-ఒక పరిశీలనము. 1985. రచయిత, హైదరాబాదు.
38. సూర్యనారాయణ మూర్తి, జోస్యుల. విశ్వనాథ కథ. దివిసీమ సాహితీ సమితి, అవనిగడ్డ.
39. శ్రీరామమూర్తి, ధూళిపాళ. 1956. 'జీవుని వేదన'. భారతి. ఆగస్టు సంచిక.
40. ______________. 1963. 'జీవుని వేదన'. భారతి. జూన్ సంచిక.
41 విశ్వనాథ వాఙ్మయ సూచిక. 1974. తెలుగు విభాగము, స్నాతకోత్తర విద్యా కేంద్రము, వరంగల్.
42. విమర్శిని. 1978 జనవరి. తెలుగు విభాగము, కాకతీయ విశ్వవిద్యాలయం
43. సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.

ఆంగ్లము

1. *Aitarēya Upaniṣad*, Commentary by Śaṅkarācārya. Translated by Swāmi, Gambhīrānanda. Advaita Āśrama, Calcutta.
2. *Īśa Upaniṣad*, Commentary by Śaṅkarācārya. Translated by Swāmi Gambhīrānanda. 1980. Advaita Āśrama, Calcutta.
3. *The Bṛhadāraṇyakōpaniṣad*, Commentary by Śaṅkarācārya. Translated by Swāmi Madhavānanda. 1965. Advaita Āśrama, Calcutta.

